# ఉమ్మడి శక్తి ప్రభావమే అమోఘం
# 5 వేళ్లనూ కలిపి పిడికిలి బిగిస్తే వాటి శక్తి అపారం.

తాజ్ (స్ప్రే) పెయింటింగ్ వర్క్సు
టౌన్‌హాల్ రోడ్ :: శ్రీకాకుళం.
మావద్ద : బీరువాలు, ఫ్రిజ్‌లు, ...

## జండూ పంచారిష్ట
### మీ జీర్ణాశయాన్ని సవ్యంగా ఉంచి
### మీకు మంచి ఆరోగ్యం చేకూర్చుతుంది

జబ్బుల లక్షణాలు వేరు-వేరయినా, వాటికి మూల కారణం సాధారణంగా ఒక్కటే. జీర్ణశక్తి లోపించడం. ఫలితమే అనారోగ్యం.ఇప్పుడు జీర్ణశక్తి కోసం వాడండి జండూ పంచారిష్ట.

గొప్ప 5-ఇన్-1 జీర్ణకారి టానిక్.మీ చేతి ఐదు వేళ్లలాగే జండూ పంచారిష్ట జీర్ణసంబంధమైన సమస్యలను సమర్థవంతంగా, సురక్షితంగా పరిష్కరిస్తుంది. అజీర్తి,అధిక భోజనం, కడుపులో వాయువు, తేపులు - ఈ బాధల నుంచి ఉపశమనానికీ, సున్నితంగా పనిచేసే విరేచనకారిగానూ, ఆకలిని వృద్ధి పరచడానికి కూడా ఇది ప్రభావవంతంగా పనిచేస్తుంది. 5 వేళ్లనూ కలిపితే ఆ పిడికిలిలోని శక్తి ఎంత అపారంగా వుంటుందో, అలాగే, జండూ పంచారిష్టలోని ఆయుర్వేద ఔషధ గుణాలు ఉమ్మడిగా కూడి మీ జీర్ణకోశాన్ని చక్కబర్చి, బలం చేకూర్చుతాయి.




క్రమం తప్పక జండూ పంచారిష్ట సేవించండి. మీ సామాన్య ఆరోగ్యం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి.

మరి ఆరోగ్యమే కదా మహాభాగ్యం!

## జండూ పంచారిష్ట

*ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్*



450 మి. లీ. మరియు 200 మి. లీ. సైజులలో లభిస్తుంది.

CLARION/B/ZP/20/173 TEL

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఫిబ్రవరి 'చతుర' నవల: కామయజ్ఞం

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజి జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

# చమక్కులు

## అలవాటు

మట్టి కుండలు, పొయ్యిలు, దాకలు, కుంప ట్లు అమ్ముతాం. కుమ్మరి మనిషి కేక వినిపించ గానే పిచ్చయ్య గడపలోకి వచ్చి "ఏయ్ కుండ లమ్మీ ఇటు రా" అని పిలిచాడు.

వీధిలోని ఆడమనిషి గంపతో సహా గడప దాకా వచ్చింది.



"ఏటి కావాలండి" అడిగింది.

"బేరం కుదిరితే అన్నీ తీసుకుంటాను"

"అయితే ఓ చెయ్యి ఇవ్వండి" అందామె తన భావలో, గంప దించమన్నట్టుగా.

పిచ్చయ్య గంప దించడంలో సహాయపడ్డా డు.

"ఈ కుంపటి ఎంత?" పరిశీలిస్తూ అడిగా డు.

"రూపాయి పావలా అండి"

"పావలాకి ఇస్తావా?"బేరం మొదలెట్టాడు.

ఆమె అవాక్కయింది అతని బేరానికి.

"అదేమిటి బాబు. పావలాకి టీ నీళ్ళే రావే" అంది.

"అది తర్వాత విషయం నువ్వు చెప్పావు నేను అడిగాను. నచ్చితే ఇస్తావు లేకుంటే మానేస్తావు. అది సరే పొయ్యి ఎంత?" అన్నా డు పిచ్చయ్య.

"రెండున్నర"

"అర్ధరూపాయికి ఇస్తావా?"

ఆమె ఏదో అనబోయి చప్పున ఆగి, "కిట్ట దు బాబూ" అంది.

"పోనిలే ఈ 'దాక' ఎంత?"

"రూపాయి ముప్పావలా" అనహనంగా చె ప్పింది.

"ముప్పావలాకి ఇస్తావా?"

పిచ్చయ్య బేరానికి ఆమె తల తిరిగిపో యింది. ఎవరైనా సరే మహా అయితే సగానికి సగం బేరమాడతారు. ఈయనేంటి మొదటి అంకె వదిలేసి రెండో అంకెనీ, రూపాయల్ని వదిలేసి పైసల్ని పట్టుకుంటాడు? అదిగానీ ఈయన అలవాటా? అనుకొంటూ "ఇయ్యను బాబూ" అంది ఖండితంగా.

"ఇవ్వకపోతే పోయావులే. సరే ఈ కుండ ఎంత?" ప్రశ్నించాడు.

అదే ఆమె దగ్గరగల ఆఖరి అయిటమ్. ఎలాగైనా ఈ కుండనైనా కొనిపించాలని అంది.

"పదిహేను రూపాయిలు బాబూ"

వాస్తవానికి ఆకుండ ఖరీదు మూడు రూపా యిలే అయినా అంతరేటు చెప్పిందంటే ఆ ధైర్యం మెచ్చుకోవాల్సిందే. పిచ్చయ్య ఆ రేటు కి గనుక విరుచుకుపడితే 'నువ్వు అంత తక్కువకి అడిగినప్పుడు లేదేంటి?' అని సమ ర్థించుకోవచ్చనుకుందామె.

కాని పిచ్చయ్య అలాంటిదేమీ చేయలేదు. ఎప్పట్లాగా అతని ముఖం ప్రశాంతంగా వుంది. బేరమాడే అలవాటుకొద్దీ పిచ్చయ్య "అయిదు రూపాయలికి ఇస్తావా?" అనడిగాడు.

ఆమె ముఖం వికసించింది.

ముఖచిత్రం & బొమ్మలు: ఉమా

"తీసుకోండి బాబు" అని ఆమె అనకుండా ఎలా వుంటుంది?

-కొల్లిమల్ల అప్పారావు

## గ్యారంటీ

పనంతా ముగించుకుని తీరిగ్గా ముందు గదిలో కూర్చుని పేపరు చదువుతోంది శైలజ. ఒకచోట ఆమె కళ్ళు అతుక్కుపోయాయి. వెయ్యి రూపాయలకే పోర్టబుల్ టెలివిజన్ అన్న అక్షరాలు ఆమె కళ్ళద్వారా మెదడులోనికి ప్రవేశించి అక్కడ స్థిరనివాసమేర్పరచుకున్నాయి.

మరుక్షణం పడక్కుర్చీలో కూర్చున్న భర్త వద్దకెళ్లి ఆ ప్రకటన చూపించింది.

అది చూసిన రాజారావు మౌనంగా తల వంకించి మళ్ళీ పైకప్పుకేసి చూడసాగాడు. శైలజ ఉత్సాహమంతా చప్పున చల్లారిపోయింది. "మాట్లాడ రేమిటండీ?" గద్దించింది భర్తను.

"ఏం మాట్లాడమంటావే?" అన్నాడు బెదిరిపోయిన రాజారావు.

"రెండు రోజుల్లో ఆ టి.వి- మనింట్లో ఉండాలి. మీ ఇష్టం" అని మరో మాటకవకాశమివ్వకుండా అక్కడనుండి వెళ్లిపోయింది శైలజ.

ఇక తప్పనిసరై ఆ ప్రకటన కింద ఉన్న చిరునామాకు బయలుదేరాడు రాజారావు.

ఆ షాపుముందు తన అప్పుల లిస్టుకన్నా పొడవైన 'క్యూ' ను చూసి ఆశ్చర్యపోయాడు. రెండు గంటలు క్యూలో నిలబడిన తరువాత తనవంతు వచ్చింది రాజారావుకు.

లోపలికి పోగానే ఆ షాపుయజమానినిచూసి ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని ఉండిపోయాడు. ఆ యజమానికూడా అదే పరిస్థితిలో ఉన్నాడు. కారణం, వారిద్దరూ చిన్ననాటి స్నేహితులు కావటమే.

"ఎలా ఉన్నావురా శంకరం?" అన్నాడు రాజారావు పరస్పర అభివందనలు పూర్తయ్యాక.

"ఇలాగే ఉన్నాను" అన్నాడు శంకరం షాపు చూపిస్తూ.

అప్పుడు రాజారావు "అవునూ, వెయ్యి రూపాయలకే టి.వి అమ్ముతున్నావట. ఏమిటి సంగతి?" అన్నాడు. కాఫీకి కుర్రాడిని పంపి రాజారావును లోపలి గదిలోకి తీసుకెళ్లాడు శంకరం.

"ఏముందిరా... వెరీ సింపుల్. చౌకలో టి.వి కొట్టేద్దామన్న హడావిడిలో ఎవరూ గ్యారంటీ కార్డు గురించి పట్టించుకోవడంలేదు. ఈ టి.వి లకు ఎంత లేదన్నా నెలకో రిపేరు గ్యారంటీ. ఇక్కడికొచ్చిన ప్రతివారూ ఎదురుగా ఉన్న టి.వి రిపేరు షాపు చూస్తారు కాబట్టి కొన్నవారిలో మూడొంతులమంది ఇక్కడికే రావడంకూడా గ్యారంటీ. వాడేమో ఏ రిపేరూ



పూర్తిగా చేయడు. అలా ఓ ఐదారుసార్లు డబ్బు వదిలించుకున్నాక విసుగుపుట్టి దాన్ని కొన్నవారు సెకండ్‌హాండ్ టి.విలు కొనే షాపుకోసం అన్వేషిస్తారు. అదికూడా మన షాపుకు కుడిపక్కనే ఉంది. చాలాసార్లు టి.వి రిపేరుకోసం వస్తారు గనుక వారు ఆ షాపును కూడా చూసే ఉంటారు. కాబట్టి ఆ టి.విలన్నీ పక్క షాపుకే చేరటం గ్యారంటీ" అని చెప్పటం ఆపి ఊపిరి పీల్చుకున్నాడు.

రాజారావు విసుగ్గా మొహంపెట్టి "నేనడిగిందేమిటి? నువ్వు చెప్పిన సోదేమిటి? అసలు దీనివల్ల నీ కొరిగేదేమిటి?" అన్నాడు.

"అదే చెప్పబోతున్నానురా! ఇప్పుడు మనమున్న ఈ షాపే కాకుండా నేను చెప్పిన ఆ రిపేర్ల షాపు, సెకండ్ హాండ్ టి.విలు కొనే పక్క షాపు అన్నీ నావేరా!"

- పి.వి.యల్.యస్. ప్రసాద్

# 'మానవి'పై సమీక్షలు

**డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన ఓల్గా నవల 'మానవి'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.**

## స్త్రీని అవమానపరచడమే

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

స్త్రీల సమస్యలను చర్చిస్తున్నామనే రచయిత్రులుకూడా ఆ సమస్యలపై తప్పుడు అవగాహనలను కల్పిస్తూ సమస్యను పక్కదారులు పట్టిస్తున్నారేమో అనిపిస్తుంది. నవలలో డాక్టర్ సురేష్ 20 ఏళ్ల సంసార జీవితాన్ని కాదని డాక్టర్ నీలిమను ప్రేమించడం, తనకోసం, పిల్లలకోసం 20 ఏళ్ళుగా శ్రమించి తనకంటూ ఏలాంటి జీవితాన్నీ మిగుల్చుకోని వసంతను వదిలెయ్యడం ఎంతవరకూ సమంజసం? డాక్టర్ నీలిమపై తనకు ప్రేమ ఉందనీ, తామిద్దరం ప్రేమించుకొంటున్నామనే డాక్టర్ సురేష్ డాక్టర్ నీలిమకు పుస్తకాలు, సంగీతం, హాస్పిటల్ తదితర ప్రపంచం గురించి తెలుసనీ, అందుకే ఆమెతో ఇష్టంగా, ప్రేమగా వుంటున్నానన్నాడు. ఒక స్త్రీ మంచి పుస్తకాలు, మంచి విషయాలు మాట్లాడినంత మాత్రాన ఆమెతో శారీరక సంబంధం వుంచుకొంటేనే ఆమెను గౌరవించినట్లా? ప్రేమించినట్లా? ఆమెను ఆమె తెలివికి ఒక వ్యక్తిగా, స్త్రీగా గౌరవించవచ్చుకదా. స్త్రీ స్వేచ్ఛను గురించి అభ్యుదయకరంగా వ్రాసే రచయిత్రులుకూడా శారీరక సంబంధంతోనే ఆ స్త్రీని గౌరవించమనడం ఆమెను అవమానపరచడమే. డాక్టర్ సురేష్ వసంతను మార్చడానికి ఏమాత్రం ప్రయత్నం చేసినట్లు నవలలో ఎక్కడా సూచించలేదు. మనం ఒకమంచి పుస్తకాన్ని చదివినపుడు మన స్నేహితులతో, కుటుంబ సభ్యులతో దాన్ని చదివించడం మన బాధ్యత. అలాగే "మంచి" సంగీతం తదితర మంచి విషయాలలోకూడా. డాక్టర్ సురేష్ వసంతకు తనకు తెలిసిన ప్రపంచాన్ని పరిచయం చెయ్యాల్సింది! డాక్టర్ నీలిమను తన ఇంటికి ఆహ్వానించి వసంత, నీలిమల స్నేహాన్ని పెంచి వుండాల్సింది.

నవలలో ఆ తర్వాత వసంత విషయాలను బాగా అర్థం చేసుకొని, అభివృద్ధిని ఒప్పుకొనే వ్యక్తిగా మారింది. అంటే భర్త వసంతను మార్చాలని ప్రయత్నించలేదనే. ఒక స్త్రీకి న్యాయం చేసే పేర ఇంకొక స్త్రీకి అన్యాయం చేయడం, మధ్యలో పురుషుడు మాత్రమే లాభపడడం జరిగింది. ఇది ఉంచుకొన్న స్త్రీలకు (ఈ మాట ఉపయోగించడం ఇష్టం లేదు అయినా వేరే పదంలేక) న్యాయం చేస్తున్నామంటూ భార్యకు అన్యాయం చేయడమే! పురుషుడు ఎంతమంది స్త్రీలనైనా ఎంజాయ్ చెయ్యొచ్చు, అతడు చేసే తప్పుడు పనులను సమాజంలో ఆమోదయోగ్యం చెయ్యడం, నేడు వస్తున్న శోభన్‌బాబు ఇద్దరు భార్యల సినిమాలను సమర్థించేట్లు చెయ్యడమే!

డాక్టర్ సురేష్‌కు నీలిమకంటే మరిన్ని ఎక్కువ విషయాలు తెలిసిన స్త్రీ పరిచయమైతే నీలిమను వదిలి ఆమెతో వుంటాడా? డాక్టర్ సురేష్ వసంతను మార్చడానికి ప్రయత్నించి, ఆమె మారకపోతే ఆమెకు విషయాలను స్పష్టంగా చెప్పి, విడాకులు తీసికొని, డాక్టర్ నీలిమతో వుండడం కొంతవరకు సమంజసం.

ఈ నవలలోని స్త్రీలు పురుషుడి అన్యాయాన్ని ఎదిరించక వాటికి బలైపోవడమే జరిగింది. వసంత, రాజ్యలక్ష్మి పురుషులద్వారా తమకు జరిగిన అన్యాయాన్ని వారి మోసాన్ని నీచత్వాన్ని బహిర్గతంచేసి తగిన గుణపాఠం చెప్పడం జరుగలేదు. నవలలో ప్రేమకే స్థానం వుండాలని, డబ్బుకు విలువనీయరాదని చెప్పడం సబబే కాని మగవాళ్లకు బుద్ధి వచ్చేట్లు, మానసికంగా, శారీరకంగా బాధకు గురిచేసి మరే పురుషుడు ఇలా ప్రవర్తించడానికి భయపడేట్లు చెయ్యాలి.





ఇక నవలలో రెండో విషయం పార్టీలో నవత పనిచెయ్యడం, వసంత వాళ్లకు సహాయం చెయ్యడం, పార్టీ రెండుగా చీలిపోవడం, ఏ పార్టీ అయినా పనిచెయ్యాలంటే సిద్ధాంతం మార్గదర్శకం. సిద్ధాంతంవల్ల సరియైన అవగాహన వెంటనే ఆచరణలోపెట్టడం సాధ్యమవుతుంది. రామ్మూర్తి వాళ్లు విడిపోవటం, రామ్మూర్తిని పార్టీనుండి బహిష్కరించడం అనేవి రహస్యకర పార్టీలలో అంతర్గత చర్చలు రెండు మూడేళ్లు కొనసాగి బయటికి వచ్చేవి. ఒక నాయకుడివలన మొత్తం పార్టీకి నష్టం వస్తుందనుకొంటే అతనిని తీసివేయడం సరియైన పద్ధతి. పార్టీలోని మెజారిటీ నిర్ణయానికి కట్టుబడాలి. అప్పుడే ఆరోగ్యకరమైన పార్టీ ఏర్పడుతుంది.

స్త్రీల మరియు సామాజిక సమస్యలను సరియైన దృక్పథంతో చర్చించడం, వ్రాయడం రచయితల బాధ్యత.

– ఆర్. ఉషారాణి, ఆదోని.

## యుగయుగాల సమస్య

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'**మానవి**' నవల దంపతులందరికీ చెందిన నవల. వాసంతికి కలిగిన చేదు అనుభవం అందరికీ జరగకపోవచ్చు. కానీ ఇలా జరిగితే ఎలా? అనే భయంతో వణికిపోకమానదు. ఈ భయం మగువ మనుగడకీ ఆర్థికసామర్థ్యానికీ చెందినది కాదు. మానసికమైన, హార్దికమైన ఐక్యతా రాహిత్యానికి పతీ పత్నిత్వానికి అద్వైత తత్వానికీ చెందినది. తరతరాలుగా వచ్చే కుటుంబ వ్యవస్థనే మళ్ళీ కూలంకషంగా తీర్చిదిద్దాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పేది. ఈ నవల విమర్శకుల మెదడుకు పదునుపెడుతుంది. ప్రశ్నలతో పఠితులను తలమునకలు చేస్తుంది. భర్త తననికాక మరో స్త్రీని ప్రేమిస్తే భార్య ఎందుకు బాధపడాలి. ఏ వ్యక్తీ తన భర్తగానీ భార్యగానీ మరొకరిని ప్రేమించడం ఎందుకు సహించలేరు? స్త్రీ పురుషులు ఒండొరులను ప్రేమించుకోడం వారి ఇరుకు మనస్తత్వానికి చిహ్నమా? ఒకరు ఒకర్ని ఎందుకు ప్రేమిస్తారు? ఏంచూసి? తనకు నచ్చిన గుణమేదో వారిలో ఉందా? అంతకంటే ఇంకా అధికంగా తనకు నచ్చిన గుణం ఇంకొరిలో ఉంటే ఈ ప్రేమ ఇక్కడ్నుంచి లేచి అక్కడ వాల్తుందా? మనవళ్ళు పుట్టుకొచ్చే వయసులో సురేష్ మరో స్త్రీతో ప్రేమలోపడటం భావ్యమేనా? అతని మనస్సునంత చెప్పుచేతల్లో పెట్టలేని బలహీనుడన్నమాటేగా. పోనీ ప్రేమ ప్రవాహంలో పడి నిలదొక్కుకోలేకపోయాడు అని అనుకున్నా పెళ్ళాన్ని నిర్లక్ష్యంచేసి నీలిమతో కాపురం పెట్టడం సబబేనా? ప్రేమకు విధిగా సెక్సుతో ముడి ఉండాల్సిందేనా? సెక్స్ లేకుండా ప్రేమ ఉండదా? ఇటు సురేష్ డాక్టర్, అటు శాంత విద్యాధికురాలు. ఒక విద్యాలయానికి ప్రిన్సిపాల్! పిల్లలకి నచ్చీలత గురించి, నీతి నిజాయితీ గురించి ఏం చెప్పగలుగుతుంది? చెప్పినా వారు వింటారా? ఆచరించలేని వారు చెప్పే బుద్ధులకు విలువ ఏంవుంటుంది. రోహిణి, నవత ఎవరుగాని సురేష్-నీలిమల అక్రమ సంబంధాన్నిగాని శాంతా-రాధాకృష్ణల అక్రమసంబంధాన్నిగాని ఖండించరు. పైగా రచయిత్రి ఈ సంబంధాన్ని శాంతవల్ల శారీరక అవసరంగానూ, సురేష్ వల్ల ప్రేమగానూ వర్ణించి వాదనను వారికి అనుకూలంగా మలచేందుకు ప్రయత్నించారు. ఇలాంటి చాటుమాటు వ్యవహారాలను ఏదో ఒక రీజన్‌తో సమర్థించేస్థాయికి రచయితలు దిగజారరాదు. వారు మంచినే చెప్పాలి. ఇచ్చిన సందేశంవల్ల కలిగే మానసిక పరిణామం పాఠకుల్లో ఎలా ఉంటుంది అని ఆలోచించాలి. మంచిచేయడానికి పదిమాట్లు ఆలోచించే మనిషి చెడుచెయ్యడానికి ఒక్కమాటు కళ్ళు మూసుకుంటే చాలు. ఏభయ్యేళ్ళు వచ్చినా ఇరవైఏళ్ళనుంచి సంసారం చేస్తున్న వ్యక్తి ప్రేమలో పడడానికి నీలిమ మాత్రం వెనకముందులు ఆలోచించనవసరంలేదా? "రాత్రి సురేష్ నా దగ్గర ఉన్నాడు" అని నిర్లజ్జగా చెప్తుందే. ఆధునిక స్త్రీలు ఇలా చెప్పడం గొప్పగా భావించే ప్రమాదం ఈ నవల చదవడంవల్ల కలగదు. ఎందుకంటే వసంత పడే వేదనను రచయిత్రి హృద్యంగా వర్ణించారు. పఠితలసానుభూతి వసంతకే దక్కుతుంది. సురేష్ శాంతలు చేసిన తప్పుకు



రచయిత్రి .ఎంతగా పాలిష్ పెట్టినా వారిని అసహ్యించుకోకుండా ఏ సహృదయుమూ ఉండదు. నిజానికి అదే తప్పుచేస్తున్న వ్యక్తులు సహితం వసంత కోసం హృదయంలో సానుభూతి చూపకమానరు.

సంసారమనే సుందర నందనవనమే తన జీవితానికి పరమార్థమని నమ్మింది వసంత. పరిస్థితుల ప్రభావంవల్ల భర్తా పిల్లలూ లేకపోయినా తనకు నచ్చినవాడితో సబ్బంగడుపుకుంటోంది శాంత. ఎవరికేది ఇష్టమైతే ఆ దారిలోనే నడవనీ. నచ్చకపోతే మనకెందుకని ఊరుకోవాలిగాని విమర్శించకూడదంటుంది రోహిణి. ఇక ముగింపు కప్ప నూతిలోనుండి చెరువులోకి వెళ్ళినట్లుంది. కాని భర్త నిరాదరణ చేసిన ప్రతి పడతికీ ఇలాటి వెసులుబాటువుండదు. భర్తచే నిర్లక్ష్యం చెయ్యబడ్డ స్త్రీయేకాదు. ప్రతి స్త్రీ హృదయంలోనూ సమాజం అంటే ఇంతటి ప్రేమాభిమానాలూ ఉండితీరవల్సిందే. స్త్రీకి అంతటిశక్తి వుంది. ఆమె తల్చుకుంటే ప్రపంచాన్ని తన స్వంత కుటుంబంలా ప్రేమించగలదు. కుటుంబమనే గిరిలో ఆమెను పురుషుడే మగ్గబెడ్తున్నాడు. బయటికి వెడితే మానభంగాలతో బెదిరిస్తూ కూపస్థమండూకంగా స్త్రీని కుంచించింది మదోన్మత్తుడైన పురుషుడే. ఈ నవలలో కథ సాధారణం, కథనం అసాధారణం, వస్తువు సామాన్యం, వస్తుచిత్రణ అసామాన్యం. సమస్య యుగయుగాలకి చెందింది. స్త్రీ పురుషులలో వివాహ వ్యవస్థలో ఉండే చెప్పలేని చెప్పరాని మౌలికమైన ఒక లక్షణం కూలంకషంగా ఇందులో చర్చించబడింది. నిజంగా దీన్ని గురించి ఒక మహా వ్యాఖ్యరాయాలని ఉబలాటంగా ఉంది. మీరు ఒక్క పేజీ కేటాయించారు మరి.

— డాక్టర్ దిట్టకవి శ్యామలాదేవి, హైద్రాబాద్.

## మగవాడి స్వార్థం

**(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

డిసెంబర్ 'చతుర' 'మానవి'లో స్త్రీవాద రచయిత్రి ఓల్గా అనేక అంశాలను స్పృశించింది. కొన్ని అద్భుతమైన వాక్యాలూ, సత్యాలూ దొర్లాయి. నవల మొదలుపెడుతూనే ఓ ప్రవాహంలోకి లాక్కువెళ్లినట్లయి, ఉక్కిరిబిక్కిరి చేసేసి ముగిసేదాకా వదిలిపెట్టదు. నవలలోని అన్ని అంశాలను పరిశీలించడం 'చతుర' సమీక్ష పరిమితులు అనుమతించవు. అందుకని ఒక కీలక అంశాన్నిమాత్రం తీసుకుంటాను.

సురేష్ దుర్మార్గుడు అని భార్య వసంతతోటి అనిపించి 'అభ్యుదయ' భావాలున్న కూతురు నవతతో కాదనిపిస్తుంది రచయిత్రి. సురేష్ ఇంకో యువతిని ప్రేమించి వసంతను ఎందుకూ కొరగాకుండా మిగిల్చినప్పటికీ అతడు ఎంతో మంచివాడు, సహృదయుడు అనిపించడానికి రచయిత్రి శాయశక్తులా కృషి చేసింది.

ఏ సమాజం, విలువలూ, పెళ్లిళ్లూ అయితే శాంతకు అడ్డంగా నిలిచాయో, సమస్యలు సృష్టించాయో అవే వసంతకూ సృష్టించాయి. పెళ్లి, భర్త, సంసారం ఇవితప్ప వేరే ప్రపంచం లేదన్న అభిప్రాయంతో ఇరవై ఏళ్లు పెరిగింది వసంత. మరో ఇరవై ఏళ్లు సంసారం చేసింది. "ప్రేమ అంటే ఏమిటో నాకు తెలియదు, నాకు నా భర్తకావాలి" అని వసంతతో అనిపించి 'అటువంటి వ్యక్తితో మనసున్న ఏ మగవాడైనా ఎలా కాపురం చేస్తాడు' అన్నభావం కలిగేట్లు చేస్తుంది రచయిత్రి. వసంత మొదటి ఇరవై ఏళ్ల బతుకుతో సురేష్‌కి ఎటువంటి సంబంధంలేదు. తరువాత ఇరవై ఏళ్లలో అతను నిర్వహించిన పాత్ర ఏమిటి అన్నదే ప్రశ్న. పెళ్లి కాగానే "మై ప్రెట్టీ లిటిల్ వైఫ్" అని అందరికీ పరిచయం చేశాడట, 'నువ్వు భార్యవి కావటం నా అదృష్టం' అని పొగిడాడట. 'ముత్యాల్లాంటి పిల్లలనిచ్చావని' ఎంతో ముద్దుచేశాడట. పెళ్లయిన పందొమ్మిదవ సంవత్సరంలోనూ ఆమె గుండెలని ముఖానికి హత్తుకుని అవి "నాకు పిచ్చెక్కిస్తున్నా"యని ఊపిరాడనివ్వకుండా అదుముకున్నాడట. ఇంతచేసి లిటరల్‌గా ఒన్ ఫైన్ మార్నింగ్ "నీకు ప్రపంచమంటే తెలియదని" వసంత నెత్తిన పెద్ద బండవేస్తాడు.




"నువ్వంటే కోపంలేదుగాని నీలిమ అంటే ప్రేమ" అని చేతులు దులుపుకుంటాడు.

తన ప్రపంచమనుకున్న భర్తనీ, పిల్లల్నీ కూడా సరిగా తెలుసుకోలేకపోవటం వసంత కారెక్టర్‌లో భాగం. వాళ్లని నిజంగా తెలుసుకోవటమంటే వాళ్ల ప్రపంచాలకి వాళ్లని వదిలేసి తన ప్రపంచాన్ని తాను నిర్మించుకోవటమే. కాని వసంత తనను తాను సంసార ప్రపంచంలో బంధించుకోవటమే కాదు మిగతా వాళ్లనీ బంధించాలని చూసింది. లావణ్య సంసార ప్రపంచంలో తెలికగానే బందీ అయ్యి తల్లినికూడా తన అవసరాలకు మాత్రమే ఉపయోగపడే మనిషిలా చూసింది. సవత ఎప్పటికప్పుడు తన వ్యతిరేకతను స్పష్టంగా తెలియచేస్తూ వచ్చింది. నాన్నను గుండీలుకూడా కుట్టుకోవటం చేతగానివాడిగా చేశావని విమర్శిస్తూ వచ్చింది. ఎటొచ్చీ సురేష్ పయోముఖ విషకుంభంలా వ్యవహరించాడు. భార్యతో అన్ని సేవలూ చేయించుకుని పొగిడి చివరికి ఆమెకు ఎటువంటి విలువా లేకుండా చేశాడు. "నాతో ఎప్పుడన్నా పదిరోజులు సెలవుపెట్టి గడిపారా?" అన్న వసంత ప్రశ్నకు "నేనిప్పుడు నీతోనే ఉంటున్నాగా" అని సురేష్ జవాబు. మరి ఇతనితో 20ఏళ్ల సాంగత్యంలో వసంత ఎదగలేదంటే అది సురేష్ లోపం కాదా? వసంతతో "పిల్లలు లేకపోతే ఏమీ బాగా లేదుకదా" అనేదీ సురేషే ఆమెతో, "ఇంటి విషయాలుతప్ప మాట్లాడటానికి ఏమీ ఉండవు" అనేదీ సురేషే.

వసంత విషయంలో సురేష్ ఇరవై సంవత్సరాలలో సాధించలేనిది సవత ఒక సంవత్సరంలో సాధించగలిగిందంటే దుఃఖమూ, సురేష్‌పట్ల కోపమూ పెల్లుబుకుతాయి. వసంతలో ఉన్న 'మానవి' సురేష్‌కి భార్యగానూ, పిల్లలకు తల్లిగాను ఉన్నంతవరకు వెలికిరాలేదంటే సురేష్ దుర్మార్గం బయటపడుతుంది. నలభై ఏళ్లప్పుడు జీవితం మొదలుపెట్టడంకంటే ఇరవై ఏళ్లప్పుడు మొదలుపెట్టడం తేలికకాదా? వెంకట్రావ్‌ల దాష్టీకానికి జానకీలు ఆ బంధనాలు తెంచుకోవాలనుకుంటారు. కాని సురేష్‌ల కపటత్వాన్ని గుర్తించక వసంతలు తమ వ్యక్తిత్వ వికాసాన్ని పక్కకుపెట్టి జీవితాంతం బానిసలుగానే ఉండిపోతారు. అందుకే వెంకట్రావ్ దుర్మార్గుడయితే సురేష్ దుర్మార్గుడు, పరమ దుర్మార్గుడు, మహా దుర్మార్గుడు.

— కె.అనసూయ,కురుమద్దాలి.

## మనిషిగా - మనీషిగా మానవిగా

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**యె**వరైనా మనిషిగా, స్వేచ్ఛగా బ్రతకాల్సిన అవసరం నేటి సభ్యసమాజంలో యెంతవుందో తెలియజేస్తూ ఆసక్తిదాయకంగా చదివించింది, ఓల్గా నవల 'మానవి'. మొదటిభాగంలో- తన కుటుంబంకోసం, తనవారి సర్వసౌఖ్యాలకోసం తన స్వేచ్ఛనూ- సరదాలనూ దూరం చేసుకొని తననో సమిధగా మార్చుకున్న స్త్రీమూర్తి జీవితగాథనూ; రెండవభాగంలో- ఆస్త్రీమూర్తిని పాతస్నేహితులూ, ప్రజాఉద్యమాలు యెలా ప్రభావితంచేసి మనిషిగా- మనీషిగా- మానవిగా మార్చినవైనాన్నీ దర్శించగలం.

నవలనిండా "ఖరీదైన" వాతావరణం వుంది. కథ ఆదినుంచీ అంతంవరకూ విద్యాధికులైన వ్యక్తుల మధ్యనూ- ఖరీదైన జీవితాన్ననుభవిస్తున్న వ్యక్తులమధ్యనూ నడుస్తుంది. వసత, శాంత, రోహిణీ ముగ్గురూ చిన్ననాటి స్నేహితులేకాక మూడురకాలైన జీవితాల్ని అనుభవిస్తున్న సజీవభూమికలీ నవలలో. వసంత పాత్రలో తనకుటుంబంకోసం, తన సమస్య పరిష్కారంకోసం పడే మానసికవేదన... స్త్రగుల్ కనిపిస్తుంది. మిగతా రెండు పాత్రల్లోనూ జీవితంమీదా- అది మనిషిమీద చూపే ప్రభావాలపైనా పూర్తి అవగాహన కనిపిస్తుంది, తమకైతాము స్వతంత్రంగా ఆలోచించడమూ- మనోనిబ్బరతతో నిర్ణయాలు తీసుకోవడమూ కనిపిస్తుంది. అనుక్షణం మార్పులకు లోనవుతూ సాగిపోతున్న యీ సమాజంలో- యీ మూడుపాత్రలలోని ఏఒక్క పాత్రనూ తప్పుగానూ, తక్కువగానూ అంచనా వేసేందుకు వీల్లేదు. ఎందుకంటే ఎవరి అభిరుచులు వాళ్ళకున్నాయి. ఎవరి వ్యక్తిత్వాలు వాళ్ళకున్నాయి. ఎవరి జీవితాలు వాళ్ళవిగానే



తను నిరసించి స్వయంప్రతిభతో జీవించా లనే స్వేచ్ఛాపూరిత పాత్రలుగా అవి మలచబ డ్డాయి. నవలలోని ప్రతిపాత్రలోనూ స్వేచ్ఛ కోసం పోరాటం, సమానత్వంకోసం ఆరాటం, సౌభాతృత్వంకోసం తపన కనిపిస్తుంది. మనిషి మనిషిగా బ్రతకాలనుకోవడంలోని అంతర్యంలోని అర్థం గోచరిస్తుంది. భవిష్యత్తు మీద వీళ్ళకున్న పూర్తి నమ్మకమూ- ఆశాస్ఫూర్తి అడుగడుగునా కనిపిస్తాయి. ఖరీదైన జీవనస రళిననుభవిస్తున్న వీరు ఏ విషయాన్నైనా ఆలో చించగలరు, ఆచరించగలరు, స్పోర్టివ్‌గా తీసుకోగలరు. అయితే మధ్యతరగతి మనుషు ల్లో యిందుకు పూర్తి భిన్నంగా వుండొచ్చు- నవలలో చెప్పినంత తేలికగా మార్పు సంభ వించకపోవచ్చు.

సురేష్, నీలిమ వంటి పాత్రలేకాక విద్యార్థి వుద్యమాల్లోని కొన్నిపాత్రలూ, లావణ్యపాత్ర కే వలం అతిథిపాత్రలుగానే పరిచయమైన ట్లుంటాయి. స్వలాభాపేక్షలో పూర్తిగా మమ్మీ అయిన పాత్రలో లావణ్య పాత్రనూ, తన వారు అనే ఊబిలో కూరుకుపోయిన పాత్రగా వసంత పాత్రనూ మలిస్తే-, రేపటి యువతకు ఆదర్శ ప్రాయంగా, నవచైతన్యవంతంగా 'నవత' పాత్రను సృష్టించడం జరిగింది.

శాంత జీవితంలో ఓ అజ్ఞాత పురుషుడున్నా డని తెల్సి ఆమెను చులకనగా చూసిన వసంత, తనభర్త జీవితంలోనూ మరో అజ్ఞాత స్త్రీ దాగివుందని తెల్సి శాంతతో 'మరో ఆడదాని ఉసురుపోసుకోకు' అనటం ఎబ్బెట్టుగా అని పించింది.

రెండవ అధ్యాయంలో ఆధునిక భావాలకు ప్రతీకలైన విద్యార్థుల వుద్యమాలూ, నవత ఆలోచనలూ, వసంత 'మానవి'గా మారడమూ కనిపిస్తుంది. అయితే వుద్యమాల గురించి అంతగా చర్చించకపోవడం శోచనీయం. తన గతజీవితాన్ని గురించి ఆలోచించే వ్యవధిచి క్కని పనులతో సతమతమయ్యే వసంత, గ్రా డ్యుయేషన్ చేసిన మహిళ గావడంతో ఆ విద్యార్థివుద్యమాలవల్ల ఆకర్షితురాలవడం చాలా సహజమైన విషయం. విశాలమైన ధృ





రించుకొని మానవిగా ఆమె మారడం హర్ష ణీయం. చివరగా లావణ్య ఉత్తరానికి సమాధా నంగా గత జీవితంతో 'కమిట్' అయ్యే ప్రశ్నేలే కుండా వసంత వ్రాసిన ఉత్తరం నవలకే ప్రాణం!

ఒడుపుగా- నేర్పుగా కథను కొనసాగిస్తూ, ఎక్కడా కథావస్తువులో కూరుకుపోకుండా కథ ను నడిపారు ఓల్గా.

– కనగాల రామచంద్రరావు, వెంకటపాలెం.

## జాగృతి

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

"మానవి" నవల మామూలుగా కాలక్షే పానికి చదివే నవలకాదు. ఈ నవలలో కుటుంబంలో 'స్త్రీ' ఎంతగా ఇమిడిపోతున్నదీ, కుటుంబంవట్ల స్త్రీ పురుషులు చూపే విలువ లలో గల తేడాను చాలా చక్కగా వివరించారు. స్త్రీలలో మానసిక చైతన్యాన్ని ఆలోచనను కలి గించేదిగా వుందీనవల.

వసంత పాత్ర నేటి మన సమాజంలోని నగటు స్త్రీ పాత్రకు అద్దంవంటిది. సురేష్ పాత్ర అవకాశవాది అయిన పురుషుడిది. నవ లలో రచయిత్రి పురుషుడి యొక్క బాధ్యతా రాహిత్యాన్ని పలాయనవాదాన్ని ప్రేమరా హిత్యాన్ని స్త్రీలోని ప్రేమగుణాన్ని బేలత్వాన్ని చాలా చక్కగా వివరించారు. సురేష్ వసంత ను "షి ఈజ్ మై ప్రెట్టీవైఫ్" అని తన ఫ్రెండ్స్‌కు ఎంతో ఇష్టంగా పరిచయంచేసి ఇరవయ్యేళ్ళ తరువాత వివాహానికి ఎదిగిన కూతుళ్ళు వున్న వయసులో మరొక స్త్రీతో సంబంధం పెట్టుకొని అన్నేళ్ళూ తన కష్టసుఖా లలో భాగం వంచుకున్న అర్ధాంగితో నువ్వంటే నాకు అసహ్యం లేదు. కాని, నీలిమ అంటే ఇష్టం. ప్రేమ అని ఇంకొక స్త్రీ గురించి చెప్పగ లిగాడంటే అది అతని పురుషాధిక్యత కూడిన అహం మాత్రమే. భార్య తన కారణంగా ఆత్మహత్యా ప్రయత్నం చేసిందని తెలిసి కూడా తను కల్పించవలసిన రక్షణను కల్పించక ఆ బాధ్యత మరొకరికి అప్పగిస్తాడు తప్ప తన సుఖం మాత్రం వదులుకోడు.

స్త్రీ దేనినైనా సహిస్తుంది, భరిస్తుంది కాని తన భర్తను మరో స్త్రీతో పంచుకోవటం మాత్రం

ఘంటలలు. తల్లితండ్రిచాటు బిడ్డగా, వివాహం తరువాత భర్తచాటు భార్యగా నిశ్చింతగా తన జీవితాన్ని గడిపిన వసంత ఇరవయ్యేళ్ల తరువాత తన జీవితంలో ఏర్ప డిన పెనుతుఫానుకు కలిగిన మానసిక వేదన ను రచయిత్రి హృదయానికి హత్తుకునేలా వివరించారు. ఏ విషయాన్ని అయితే తన ప్రాణస్నేహితురాలిని చూడకుండానే అస హ్యించుకుందో కలలో ఊహించటానికి కూడా ఇష్టపడలేదో అదే పరిస్థితి తనకు ఎదురయ్యే సరికి ఆమెలో కలిగిన మానసిక సంఘర్షణ కంటతడిపెట్టించేదిగా వుంది.

ఈ నవలలో రోహిణి పాత్రను రచయిత్రి అద్భుతంగా చక్కని వ్యక్తిత్వంగల యువతిగా మలిచారు. ఈమె వసంత స్నేహితురాలు. ఒకానొక సందర్భంలో వసంతతో, ఆమె "వివా హానికి నీవు ఎక్కువగా విలువను ఇచ్చావు. అది వుంటే ఇక మిగిలినది ఏవీ అక్కరలేదను కున్నావు" అని అన్నది. ప్రతి విషయాన్ని చక్కగా ఎనలైజ్‌చేసి సమగ్రంగా అవగాహన చేసుకున్న వ్యక్తిగా రోహిణి పాత్రను ఎంతో ఉన్నతంగా మలిచారు.

తరువాత చెప్పుకోదగ్గ పాత్ర సవతది. ఈమె వసంతకు కూతురైనప్పటికి విశిష్ట వ్యక్తిత్వం కలిగి ఒక స్నేహితురాలిగా తన తల్లికి చేయూ తనిచ్చింది. జీవితం అంటే భర్త+పిల్లలు మాత్రమే కాదు- నీకంటూ కూడా ఒక జీవి తంవుంది అని తెలియచెప్పింది. తన తల్లి తనలోని విలువను గుర్తించేటట్లు చేసి ఆమె ను 'మానవి'గా తీర్చిదిద్దింది.

'స్త్రీ' ఆలోచనలను జాగృతిపరిచేవిధంగా వున్న ఈ నవలకు 'మానవి' అనే టైటిల్ కూడా ఎంతో సముచితంగా వుంది.

— బి.సుధామాధురి, మహబూబాబాద్.

## 'అమ్మ' పోకడలు?

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

పెంటకుప్ప సాహిత్యంగా ఎన్నదగు నవల లు పుంఖానుపుంఖంగా వచ్చేస్తున్న ఈ రోజు ల్లో, మౌలికమైన సామాజిక విలువల్ని ప్రతిపా దించే మంచి నవలను రాసిన 'ఓల్గా' గారికి, ప్రచురించిన 'చతుర'కి అభినందనలు తెల్పా కతప్పదు. స్త్రీ పురుష సంబంధాలు ఏ ప్రాతిప దికమీద ఏర్పడితే బాగుంటుంది? జీవితం పరిపూర్ణతని సంతరించుకోవాలంటే ఎలాంటి సామాజిక చైతన్యం మనలో రావాలి? యిత్యాది ముఖ్యమయిన సమస్యల్ని చర్చిస్తుంది 'మా నవి'. విశ్వవిఖ్యాత రచయిత గోర్కీ పాత్ర 'అమ్మ'కూ, ఓల్గాగారి వసంతపాత్రకూ కొన్ని పోలికలున్నాయనడం అతిశయోక్తి కాదేమో! ఊబిలాంటి జీవితంనుండి బయటపడి క్రాంతిదిశగా పయనించిన వసంతలో, 'అమ్మ పోకడలు' కన్పిస్తాయి. 'నాయిల్లు, నాపిల్లలు, నాభర్త, నాసంసారం' అనే నూతిలో కప్ప ప్రపంచంనుండి, సంకుచిత ప్రలోభాల్నుండి బయటపడి "మనందరం కలిసి సమాజాన్ని మార్చాలనుకొని ఏదోఒక ఆటంకం రాగానే ఆగిపోతామా! మనకు మంచిదనిపించింది ఏదోఒకటి చేద్దాం- సమాజానికి పనికివ చ్చేది, ఎన్ని పరిమితుల్లోనైనా, ఎంతచిన్నదైనా చేద్దాం" అనే విశ్వజనీన ప్రపంచంవైపు వసంత పయనించడం ఎంత గొప్పవిషయం!

"భార్యాభర్తల బంధంలేని ప్రతి ప్రేమలో నూ స్త్రీ పురుషుడికి వుంపుడుగత్తె అయింది. నాకు భార్యగా వుండడంకంటే వుంపుడుకత్తెగా వుండడమే బాగుంది. అది అగౌరవం అనుకో ను" (పేజి 15) అని శాంత అన్నప్పుడు మనం తృళ్లిపడడం సహజం- ఓల్గాగారు యింతటి అతివాద దృక్పథం తీసుకున్నారే ఏటి చెప్మా అని. అయితే నవలని పూర్తిగా చదివేక ఓల్గాగారు చెప్పదలచుకున్నది "అవ గాహన, సర్దిపుచ్చుకోడం, మారుతున్న పరిస్థి తుల్ని గ్రహించి మార్పులకనుగుణంగా సంపూర్ణవ్యక్తిత్వాన్ని నిజమైన అస్తిత్వాన్ని సంతరించుకోడం" అని గ్రహిస్తాం. జీవితం అంటే పోరాటమేకాదు, సర్దుకుపోవటం కూడా ను అని 'మానవి' చెప్తోంది. హెమింగ్వేలా పాత్రల సంభాషణ విధానంలో కథని నడి పించే అరుదైన రచనాశిల్పం కనపరిచేరు ఓల్గాగారు. ఎన్నోరకాలుగా ఓ మంచినవలని చదివేం అన్న తృప్తిని పాఠకునికి మిగిల్చిన 'మానవి' నవలా రచయిత్రి ఓల్గాగార్ని మరీ మరీ అభినందించడం కనీస ధర్మం.

— ఎ.వి.రెడ్డిశాస్త్రి, చేడవరం.



ఫిబ్రవరి: 1990

# చతుర

సంపుటి: 13
సంచిక: 1

పువ్వు పువ్వునా వాలే భ్రమర ప్రవృత్తి అతనిది. గులాబీ రేకుల సౌకుమార్యాన్నీ, మల్లెపూల లాలిత్యాన్నీ కలబోసుకున్న నునులేత చిగురాకు మనసు ఆమెది. ఇద్దరూ కలిసి సంసారనావలో పయనిస్తున్నా వారి భావాలూ, ఆలోచనలూ, గమ్యాలూ వేరువేరు. అతనికి ఆమె అంటే పంచప్రాణాలు. ఆమెకీ అతనంటే ఇష్టమే. అయినా ఆమెలో ఏదో అసంతృప్తి! తన జన్మసార్థకం చేసుకోవాలనే తపన! ఒక కోరిక! ఆమెలో రగుల్కొని స్త్రీత్వాన్ని నిద్రలేపింది. తన మనసుని చంపుకోలేక, అతనిపై పెరుగుతోన్న ఏహ్యాభావనని అదుపుచేయలేక కంపించిపోయింది. అలాంటి స్థితిలో తన మనసులో చెలరేగిన సంఘర్షణలకు, సమస్యలకు స్వాంతన ఎలా సంపాదించుకోగలిగిందామె? ఆడది ఆటబొమ్మనుకున్న అతని కళ్ళేలా తెరిపించగలిగింది?

నిత్యజీవితంలో ప్రతివారూ ఎదుర్కొంటున్న దాంపత్యసమస్యల్ని సమర్థవంతంగా విశ్లేషిస్తూ సాగిన కె.టి. గట్టి కన్నడ నవలకు ఉమాదేవి అనువాదం 'కామయజ్ఞం' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

పొద్దున్నే నాలుగుగంటల ప్రాంతంలో మెలుకువ వచ్చిందతనికి. నలభైఆరవ పుట్టినరోజు తరువాతిరోజు అది.

"ఓ... నలభైఅయిదు నిండిపోయాయి కదూ" అనే భావం ఎక్కణ్ణించో ఉబికివచ్చి అతన్ని పూర్తిగా జాగృదావస్థలోకి లాక్కొచ్చింది. ఆ భావంలో వుండే వగరు అతనిలో ఏదో అలజడిని, ఉద్వేగాన్ని రెచ్చగొట్టి ఎగసిన అలలా శరీరంనిండా, మనసునిండా మధువు మత్తు అలముకున్నట్టుగా అలముకుంది.

వెలుగునెరుగని... బహుశా వెలుగుని నిరీక్షిస్తున్న పరిసరప్రపంచం మౌనంలో కరగిపోతున్నట్టుంది. జీవులన్నీ మెలకువరావడానికి కొద్దిసేపు ముందు అనుభవించే గాఢ సుషుప్తిలో మునిగే వేళ, తనకెందుకిలా వున్నట్టుండి మెలకువ వచ్చేసింది - అనే దిగులు నిండిన ప్రశ్న అతని అంతరాంతరాల్లోంచి ఒళ్ళువిరుచుకుని తలఎత్తింది. అతని గుండెల్లో విరిసిన ఉద్వేగభావాలమాటున ఒక నిగూఢమయిన భయం, నిరీక్షణ అతని హృదయాన్ని చిన్నగా వణికించాయి.

మామూలుగా అయితే...

అతను ఏడూ... ఎనిమిది గంటలమధ్య నిద్రలేస్తాడు. లేచాక కూడా తను నిద్రమేలుకున్న విషయం గురించిన గుర్తింపు ఆలోచన దొరకనంత బిజీగా వుంటాడు.

ఇవాళ... అనుకోకుండా మరీ తెల్లవారుఝామునే మెలకువ వచ్చేసింది. నిన్నరాత్రి... హొటల్లో... చల్లటి వాతావరణంలో అహ్లాదంగా... నైలాన్ దీపాల మసకవెలుతురులో... ముగ్గురు స్నేహితుల్తో కలసి తన నలభై ఆరవ పుట్టినరోజుని సింపుల్‌గా జరుపుకున్నాడు. కంపెనీ పనిమీద కలకత్తా రావడం వల్ల పుట్టినరోజును ఇంట్లోనే జరుపుకోలేకపోయాడు. మామూలుగా పండుగలు అవీ ఆర్భాటంగా చేసే అలవాటులేదు. అయినా అతని పద్ధతిలో అతనికి దేవుడంటే భక్తిశ్రద్ధలు మాత్రం ఉన్నాయి.

జీవితంలో నలభై అయిదేళ్ళు గడిచిపోయాయి. ఇంకెన్నాళ్ళీ జీవితం వుండచ్చు?- అనే ఆలోచన తల్లోకి వచ్చింది. ఛ... ఇదేం ఆలోచన అని దాన్నిమనసులోని ఓ మూలకి నొక్కేసాశాడు. గడచిపోయిన నలభై అయిదేళ్ళ జీవితాన్ని దాని లోతుని అంచనావేయడానికి ప్రయత్నించాడు. ఇన్నేళ్ళలోనూ తను జాగృదావస్థలో వున్నకాలం ఎంత? అప్పుడు తను నిజంగా మేలుకునే వున్నాడా? అయితే... మరి ఆరోజులు సజీవంగా కళ్ళముందుకు రావడంలేదే- అని ఆశ్చర్యపడ్డాడు. గుండెల చప్పుడు అధికమయినట్టనిపించింది. అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాల వేగం ఎక్కువై ఆ బుసలు ఆ నిశ్శబ్దంలో మరింత స్పష్టంగా వినిపించాయి.

ఈ నలభై అయిదేళ్ళలో తన జీవితం, అనుభవం నిజంగా ఎంత? అర్థవంతంగా ఎన్నాళ్ళు జీవించి వుంటాడు? మహా అయితే ఐదేళ్ళేమో.

నల్లూరిలో ఇసుక తిన్నెలపై... పొలంగట్ల వెంట గలగలపారే చల్లని కాలువ నీటిలో, అస్తమించే సూర్యుని అందమైన రంగుల్ని ప్రతిఫలించిన కడలికెరటాలతో ఆడుకున్న ఆటల్లో... సుఖసంతోషాలను తమ గొంతుల్లో నింపుకుని కువకువలాడే పక్షుల గళాల్లో... వున్నట్టుండి విసురుగా కురిసి తడిపేసే వాన జల్లుల్లో...

ఇసుక తీరంలో పరుగులు పెడుతూ... పడుతూలేస్తూ... కేరింతలు కొడుతూ... మేనిపై ఇసుకని విరజిమ్ముకుంటూ... ఎండ్రకాయల వెంటపరుగులు పెట్టి వాటిని పట్టాలని పంతాలకు పోతూ... అవి బొరియల్లో దూరినప్పుడు వాటికోసం పట్టుదలగా బొరియల్లో చేతులుపెట్టి... అవి కసుక్కున కరిస్తే హడిలిపోయి... విదిలించుకుని... విసిరివేసి బెదురుగా నుంచున్న ఆరోజులు...

ఐదేళ్ళు! ఆ ఐదేళ్ళలో ప్రతి నిమిషం... ప్రతిక్షణం ఎంత సత్యమైనవి! ఎంత నిత్యమైనవి!

కాని అవి ఐదేళ్ళుకావు. అది తప్పు... ఏ రెండు మూడేళ్ళో అయ్యుంటాయంతే. ఎందుకంటే సుమారు ఏణ్ణర్థం వరకు సరిగ్గా నడక చేతనయ్యేటంతవరకు ఆ నాలుగైదేళ్ళు ఎంజరిగిందో స్పష్టంగా గుర్తుండదు. ఎనిమిదో ఏడు జరుగుతుండగా నల్లూరు వదిలేసి బొంబాయి





వచ్చేశాడు తను. కారులో సుదీర్ఘ ప్రయాణం బాగా గుర్తుంది. సుమారు ఐదు నుంచి ఎనిమిది ఏళ్ళ అవధిలో అయిన అనుభవాలే గాఢంగా, లోతుగా మనసులో నాటుకుపోయుంటాయి.

మళ్ళీ ఒక జ్ఞాపకం... నాన్నతో బొంబాయి బయల్దేరడానికి కొద్దికాలం ముందు చాలా మంది కలసి ఒక విశాలమైన స్థలంలో గోరీల మధ్య అమ్మని ఒక గొయ్యిలో పెట్టి మట్టితో కప్పెయ్యడం.

అతని మనసు ఆ జ్ఞాపకంతో మరింత ఉద్విగ్నం చెందింది. 'ఛ... ఇదొకటి నన్నెందుకిలా వెంటాడి వేధిస్తోందో' - అని ఆ జ్ఞాపకం మీద విసుక్కున్నాడు.

కాని, మళ్ళీ నల్లూరు సముద్రపొద్దున తిరిగి రావాలి. ఆ విశాలమైన ఇల్లంతా తిరుగాడాలి. అమ్మ సమాధిని చూడాలి అని గాఢంగా అనిపించింది.

హితమైన జ్ఞాపకాలు... నొప్పించే జ్ఞాపకాలు... బాధించే జ్ఞాపకాలను పక్కకి తోసి, సుఖకరమైన జ్ఞాపకాలని తిరగదోడుకుందుకు ప్రయత్నించాడు.

పారేనీటి చల్లదనం... తొలకరి గాలుల చల్లదనం... తొలకరి జల్లులలో బుగ్గలు తడిసినప్పుడు అనుభవించిన సుఖం... గిలిగిలి.

జీవితంలో జ్ఞాపకాలుగా మిగిలినవెన్ని? ఆ జ్ఞాపకాలే జీవితమా?

టెలిఫోన్ మోగింది. జిజ్ఞాస లోపలికి తప్పుకుంది.

అరె... ఈవేళప్పుడు ఫోన్ చేసేదెవరు? అనుకుంటూ కొద్దిగా మంచం చివరకి జరిగి, పడుకొనే రిసీవర్ చేతిలోకి తీసుకున్నాడు.

"హలో... ఎవరు?"

ఒక్కక్షణం ఫోన్‌లో ఏ శబ్దమూ వినపడలేదు.

సన్నటి నవ్వు వినపడిందంతే. రాంగ్ నెంబరయ్యుంటుందిలే అనుకొని పెట్టేశాడు.

ఒక నిమిషం ఆగి మళ్ళీ మోగింది ఫోన్. కాసేపు పూరుకున్నాడు. ఫోన్ మోత పూరుకోదల్చుకోలేదు. విసుగ్గా రిసీవరెత్తి 'హలో' అన్నాడు. 'ఎవరు?' అని అడిగాడు విసుగ్గానే.

"తెలియలేదా?"

"లేదు"

"మర్చిపోయారా?"

"మర్చిపోయుండను, ఎవరో తెలియలేదంతే! గొంతు కూడా అంత స్పష్టంగా వినవడ్డంలేదు"

"పాత స్వరాలెప్పుడూ అస్పష్టంగానే వుంటాయిలే" కిలకిలనవ్వు.

"ఆఁ... ఇప్పుడు తెలిసింది"

"తెలిస్తే ఏంలాభం? కలకత్తా రాగానే నేను గుర్తురాలేదుగా?"

"గుర్తొచ్చావు జమునా"

"గుర్తొచ్చాను... తీరికలేదు అంతేనా?" ఆమె మళ్ళీ నవ్వింది.

"అదికాదు... నిన్నంతా బొత్తిగా-"

అతన్ని మాట్లాడనివ్వకుండా.

"సరేలే... ఇవన్నీ మామూలేగాని.. ఇప్పుడయినా గుర్తొచ్చిందికదా! సుధ ఎలా వుంది?" చిటపటలాడుతూ అడిగింది.

"బాగానే వుంది..."

"కలకత్తా ఎప్పుడొచ్చారు?"

"నిన్న పొద్దున్న. అస్సలు టైము దొరకలేదు. పదిగంటలకల్లా కాన్ఫరెన్స్ మొదలు. అంతా హడావుడి. స్నానం చేసి..."

"హాఁ హాఁ... తెలిసింది తెలిసింది. ఇదేం కొత్తకాదులెండి. అయినా మిమ్మల్నేం సంజాయిషీ అడగలేదుగా" అని గట్టిగా నవ్వేసింది.

పిచ్చి నవ్వు! అయినా అందులో ఆదరకమైన మత్తు!

"జమునా... అపార్థం చేసుకోకు"

"అదేం లేదుగాని, మీరు బ్యాంక్ ఛైర్మన్ అయినట్టున్నారే" అని మళ్ళీ నవ్వింది.

"వేళాకోళం మొదలెట్టకు. రూరల్ బ్యాంకింగ్ సిస్టమ్‌ని అభివృద్ధిచేయడానికి కొత్త పథకాలు ఎలా వెయ్యాలో చర్చించడానికి బ్యాంక్‌లన్నీ కలిసి జరిపే కాన్ఫరెన్స్‌లో పాల్గొడానికి నన్ను పంపించారు. మా బ్యాంక్‌లో కొత్తగా ప్రారంభించిన రూరల్ బ్యాంకింగ్ డెవలప్‌మెంట్ సెక్షన్‌కి చీఫ్‌ని నేనేగదా! అదీకాక



శ్రీ అనుపమ ప్రొడక్షన్స్





# పోలీసోడి పెళ్ళాం



Vaani Krishna





రేలంగి నరసింహారావు

బలరామ్

ఓంకార్



నా థీసీస్ కూడా ఇదే విషయం మీదనన్న సంగతి నీకు..."

"తెలుసు బాబూ ... తెలుసు - మీ థీసీస్ సంగతంతా తెలుసు. రూరల్ బ్యాంకింగ్ ఎండ్ అర్బన్ లవ్!" జమున గట్టిగా నవ్వింది.

అతను మౌనంగా వూరుకున్నాడు.

"ఆనంద్..." ఆమె పిల్చింది.

"ఏమిటి?"

"రావా?"

"ఇంట్లో...."

"ఎవరూలేరు. నాన్నగారు పొద్దున్నే ఢిల్లీవెళ్ళారు. ఇల్లు ఖాళీగా వుంది" నవ్వుతూ అంది ఆమె.

"జమునా..."

"ఊఁ"

"నువ్వు మళ్లీ పెళ్లిచేసుకోకూడదా?"

"చేసుకునుండచ్చుగాని..."

"ఏమిటి అడ్డు?"

"మరీ ఆలస్యం అయిపోయింది"

"ఎంత... మహా అయితే ముప్పయ్యో ముప్పయ్యేకటో, అంతేగా పెద్ద ఆలస్యం ఏమీకాదు"

"అది శరీరానికి. నా మనసుకి అప్పుడే ఏభై దాటిపోయింది" అని మళ్ళీ ఉన్మాదకరంగా నవ్వింది.

అతను వూరుకున్నాడు.

ఆ నవ్వు అతన్ని భయపెడుతుంది. అతను ఎన్నోసార్లు చెప్పాడు.

"జమునా... అలా నవ్వకూడదు"

"ఎందుకని?" ఆమె నవ్వుతూనే అడిగేది.

"ఆడదలా నవ్వితే బాగుండదు"

"నేను ఆడదాన్నని మీకెవరు చెప్పారు?"

జమునతో వాదన పెట్టుకుని గెలవడం కుదిరేపని కాదు.

"ఎన్నాళ్ళుంటారు?" నా ఆలోచనల్ని చెదరగొడుతూ అడిగింది.

"ఇంకో రెండురోజులు. మూడురోజుల కాన్ఫరెన్స్"

"రేపొస్తారుగా. ఎల్లుండి నాన్నగారొస్తున్నారు"

"ప్రయత్నిస్తాను"

"ప్ర-య-త్ని-స్తా-ను" అంటూ అతని న్వరాన్ని అనుకరిస్తూ వెక్కిరించి, గట్టిగా నవ్వేసి, 'బైబై' అని ఫోన్ పెట్టేసింది.

ఆనంద్ లేచి కిటికీ తలుపు తీశాడు. ఇంకా సూర్యోదయవు వేళ కాలేదు. ఆకాశంలోని నక్షత్రాలన్నీ భూమ్మీద పరుచుకున్నట్టుగా వున్నాయి. తననలు భూమ్మీదున్నట్టు అనిపించడంలేదు. ఎక్కడో ఆకాశంలో బుల్లి గ్రహంమీద వున్నట్టుంది. అది పదహారవ అంతస్తు. మిల్కీవేకి మరీదగ్గరగా వున్నట్టనిపిస్తోంది. తను భూమ్మీదలేనప్పుడు- దీన్ని భూమి అని అనుకోడం ఎలా?

అతనిలో ఒక విలక్షణమైన ఆనందం గోచరించింది - అదీ ఒక్కక్షణమే.

అంతలోనే ఒక్కసారిగా విలక్షణమైన భయం అతని గుండెల్లో ప్రవేశించింది. ఇప్పుడు వున్నట్టుండి ఒక్కసారిగా భూకంపం వస్తే ఈ 'మిల్కీవే హోటల్' గతేమవుతుంది? అంతలో బలంగా గాలివీచింది. భవనం కంపిస్తుందేమోనన్న చిత్రమైన భయంతో కూడిన భావం కలిగింది. చటుక్కున కిటికీ తలుపు మూసేశాడు.

వెంటనే తన వూహలకి, ప్రవర్తనకి తనకే నవ్వొచ్చింది. గట్టిగానే నవ్వేశాడు. తనెందుకిలా ప్రవర్తిస్తున్నాడా అని ఆశ్చర్యపడ్డాడు. గడచిన రాత్రి విస్కీ డోసు ఏమయినా ఎక్కువయిందా అని శంకించాడు. ఒంట్లో ఏమన్నా తేడా చేసిందేమోననుకున్నాడు.

కిటికీ పరదా జరిపి గాజు అద్దాల్లోంచి తూర్పు దిక్కువైపు చూశాడు. దిగంతాల అంచున వున్న దట్టమైన మేఘాలకి అంటుకొంటున్న ఆ రంగు... నిన్నరాత్రి చూసిన క్యాబరే డాన్సర్ తొడల రంగు...

విస్కీ ఎక్కువై వుంటుంది... నిజమే!

టేబుల్‌మీద చెల్లాచెదురుగా పడున్న తన విజిటింగ్ కార్డ్సు కనిపించాయి.

"డాక్టర్ ఆనంద్, ఎం.కాం, ఎల్లెల్బి, పి.హెచ్.డి., రూరల్ బ్యాంకింగ్ డెవలప్‌మెంట్ సెక్షన్, బ్యాంక్ ఆఫ్ ఇండియన్ పయొనీర్స్, బొంబాయి"

గర్వంగా అనిపించింది. రొమ్మువిరుచుకొన్నాడు. గంభీరంగా తల వంకించాడు. చిరునవ్వు నవ్వుకున్నాడు.

మరుక్షణం- అవును ఇంతకీ ఎవరీమనిషి! తనేనా? - అనుకున్నాడు.

ఒక విజిటింగ్ కార్డుని చేతిలోకి తీసుకొని చూసి - ఈ వ్యక్తి, ఈ మహావ్యక్తి తనుకాదు, మరెవరో అన్న భావంతో చూశాడు. ఆ వ్యక్తి ప్రతిభని, సాధనని మెచ్చుకున్నాడు. ఆ వ్యక్తిని ప్రశంసించి, భుజం తట్టాలనిపించింది.

తన ధోరణికి, ఆలోచనలకి తనే నవ్వుకుని కార్డుకింద పెట్టేశాడు.

అయినా ఆ రకమయిన ఆలోచనలు అతన్ని విడవలేదు. తను మరో వ్యక్తి అయ్యింటే ఎలా వుండేదో! తను వేరే వ్యక్తి ఎందుకు కాడు? ఈ కార్డులో వున్న మనిషి తను ఎందుకు ఒకటవుతారు?

ఆలోచనల మధ్య గడియారం చూశాడు.

అయిదుంపావు

ఇంక నిద్రరాదు

తొమ్మిది గంటలకి కాన్ఫరెన్స్‌కి తయారవాలి. ఇప్పుడే గడ్డం గీసుకుంటే ఎలా వుంటుందనుకుంటూ నిలువుటద్దం ముందు కుర్చీలో కూర్చున్నాడు.

అద్దంలోని వ్యక్తి తనే; అయినా అతనిలో ఏదో ప్రత్యేకమయిన మార్పు కలిగినట్టు అనిపిస్తోంది.

తనకి వయసు పైబడ్డట్టనిపిస్తోంది. అతని జుట్టు ముందుభాగాన ఇదివరకు అక్కడొకటి ఇక్కడొకటిగా కనిపిస్తూ వుండిన తెలుపు మరికాస్త విస్తరించినట్టు అనిపించింది. కంటి చివరల ఒకటి రెండు కొత్త ముడతలొచ్చాయి. తెల్లటి ముఖవర్చస్సులో ఏదో పేలవత్వం కనిపించింది. విశాలమైన, సుందరమైన.... అందులోనూ జమున ఎంతో ఇష్టపడే కళ్ళల్లో ఇప్పుడేదో బడలిక.... వడిలి చిన్నవైనట్టు అనుమానం తోచింది. నల్లటి కంటిపాపల చుట్టూ ఏదో బూడిదరంగు కొత్తగా కలిసినట్టుంది. కనుబొమలు కొద్దిగా కిందకి వాలినట్టున్నాయి. వల్చగా మెరిసే పెదవులు కోమలత్వం పోగొట్టుకొని మొరటుగా తయారయినట్లు, గడ్డంకింద చర్మం కొద్దిగా వేలాడుతోందేమోనన్నట్టూ అనిపించింది.

అంతరాంతరాల్లోంచి ప్రతిఘటన! 'ఛ... ఇది నిజం అయ్యుండదు. కేవలం భ్రమ కావచ్చు లేదా ప్రయాణం బడలిక వల్ల అలా అనిపిస్తోందేమో. అందులోనూ రెండు రాత్రులనుంచీ నిద్రకూడా సరిగ్గాలేదు'.

నైట్ కోటు తీసి మంచం మీదకి విసిరేశాడు. ఒక్షణం ఆగి పైజామా కూడా వద్దనిపించి తీసిపారేశాడు.

అవును ... ఆ బందిఖానాలాంటి బట్టల్లో వుండబట్టే తను అలా కనిపిస్తున్నాడేమో. ఈ చిన్న డ్రాయర్ తొడుక్కుని ఎంత చక్కగా కనిపిస్తున్నాను - అనుకుంటూ బలమైన తన తొడల్ని తట్టుకొని ఆనందించాడు. దృఢమైన బాహువుల్ని దట్టమైన నల్లని రోమాలతో నిండిన విశాలమైన వక్షస్థలాన్ని చూశాడు. ఐదడుగుల ఎనిమిదంగుళాల ఆకర్షణీయమైన విగ్రహంతో, ఎందరో తరుణులు మెచ్చుకొన్న తన రూపం, అవయవ సౌష్టవం, ఆకారాల్లో ఏమీ పెద్ద మార్పొచ్చినట్లు అనిపించలేదు. నలభై అయిదేళ్ళయితేనేమిటి, ఇంకా పది సంవత్సరాలు గడిచినా ఇవన్నీ ఇలాగే వుంటాయనుకున్నాడు.

కాని ముఖంలో ఏదో తేడా కనిపిస్తోంది. శరీరంలో తనకి కనపడని భాగం, ఈ ముఖం, వీపునైనా చూసుకోవచ్చునేమోగాని ముఖాన్ని చూసుకోలేం. ముఖం అలాగే వుందని నిర్ణయించలేరుకదా!

ఈ ముఖం ఇలాగే వుంటుందని ఎవరైనా నిశ్చయంగా చెప్పగలరా? దీని సహజత్వాన్ని స్వభావాన్ని కనిపెట్టడం సాధ్యమయ్యేవనేనా? అద్దమయినా ముఖం అసలు స్వరూపాన్ని చూపించగలదా? అసలు అద్దాలన్నీ ఒక్కలాగే వుంటాయా ఏమిటి? ఈ నిలువుటద్దంలో దోషం లేదనుకోడం ఎలా? అసలు దోషమేలేని అద్దమంటూ వుంటుందా? దోషపూరితమైన అద్దంలో కనిపించే ప్రతిబింబం నిజం కాగలదా? తనవరకు నిజం అని నమ్మినదేమిటి? అంతా నిజమేనని అనుకోవచ్చా? ఏదీ నిజంకాదని అనుకోవాలా? సుధా నన్ను చూసుకునే




పద్ధతి, నేను ఆమెకి కనిపించే రీతి నిజమేనా? జమునకిగాని, మీనాక్షికిగాని నేనుండే పద్ధతి నిజమేనా? నేను ఈ అద్దంలో కనిపిస్తున్నట్టే వాళ్ళకీ కనిపిస్తానా? లేకపోతే మరోరకంగా కనిపిస్తానా? వాళ్ళ దృష్టిలో దోషం లేకుండా వుండుంటుందా? ఒక వ్యక్తి అందరి కళ్ళకి ఒకేలా కనిపిస్తాడా? అందరి దృష్టికి ఒక వస్తువు ఆకారం, రూపం ఒకేరకంగా కనిపిస్తుందా?

ఒకడికి రుచిగా వున్నది మరొకడికి బాగుండదు. ఒకడికి ఇంపుగా వున్న గొంతు మరొకడికి కర్కశంగా వుంటుంది. ఒకడి కంటికి అందంగా వున్న వస్తువు మరొకడి కంటికి అందంగా లేనట్టు కనిపిస్తుంది. తను మీనాక్షికొకరకం వ్యక్తిలా, జమునకి ఇంకొకరకం వ్యక్తిగా, సుధకి మరోరకం వ్యక్తిగా... ఇలా తనెరిగిన పది పదిహేను మందికి పది పదిహేను రకాలుగా కనిపించచ్చు.

మళ్ళీ అతని దృష్టి విజిటింగ్ కార్డుమీద పడింది. తను తనేనా - అన్న ప్రశ్న వదలటం లేదు. ఏదైనా మీడియం లేకపోతే ఎలా కనిపెట్టడం?

డాక్టర్ ఆనంద్ అద్దం ముందు మైమరచి కూర్చున్నాడు. తను కలగంటున్నాడా అన్న అనుమానం వచ్చింది. అవును ... ఇది కల కావచ్చు. మెలకువ అనడానికి ఆధారం ఏమిటి, సాక్ష్యం ఏమిటి? ఎవరు నిరూపిస్తారు? ఎలా నిశ్చయంగా చెప్పడం?

ఇది మెలకువే కాకపోవచ్చు. అతని ఆలోచనకి అతనే ముసిముసిగా నవ్వుకున్నాడు. ఆ నవ్వు అద్దంలో ప్రతిబింబించింది.

“హేయ్! నేనేనువ్వు. నువ్వే నేను. నేను 'నిజం' అయితే నువ్వూ నిజమేగా” అని గట్టిగా నవ్వాడు.

దఢాల్న కిటికీ తెరుచుకుంది. బలంగా వీచిన గాలికి విజిటింగ్‌కార్డ్సన్నీ ఎగిరి కిందపడ్డాయి.

“అరె... కిటికీ బోల్టు వెయ్యడం మర్చిపోయానే” అనుకుంటూ లేచాడు.

చటుక్కున తను నగ్నావస్థలో వున్న సంగతి స్పృహకి వచ్చింది.

గదిలో ఎవరూలేనప్పుడు నగ్నత్వం ఏముందిలే అని నవ్వుకుని లేచివెళ్ళి కిటికీ మూసి వచ్చాడు.

* * *

అందమైన భార్యలున్నా మగవాళ్ళలో చాలా మంది పరాయి ఆడవాళ్ళకేసి కళ్ళప్పజెప్పి చూస్తారనడానికి నా భర్తే నిదర్శనం. అలాగని నేను అందగత్తెనని పరోక్షంగా చెప్పుకోవాలన్నది నా ఉద్దేశం కాదు. అయినా నేను అందంగా వుండడం, నా భర్త అటువంటి స్వభావాన్ని కలిగి వుండటం-రెండూ పచ్చి నిజాలు.

ఈ ఆధునిక ప్రపంచంలో రకరకాల ఉద్యోగాల్లో, వివిధ రంగాల్లో ప్రతిభని, ప్రత్యేకతనీ చూపుకోగలిగే అవకాశం చాలా వరకు మగవారికి వుంది. కొందరు ఆడవాళ్ళకీ వుంది. మగవారికి ప్రసిద్ధిపొందడానికి తెలివి ప్రధాన సాధనం అయితే, ఆడవారికి రూపం కూడా ముఖ్య అంశం కావచ్చు.

నా భర్త ఆనంద్. డాక్టర్ ఆనంద్. అతని డాక్టరేట్. అతని ఉద్యోగం, అతని కీర్తి.. వీటితో నాకేం సంబంధం లేదు. ఆనంద్ కేవలం నా భర్త అంతే.

నేను అనామకురాల్నికాదు. అంటే, ఆనంద్ పెళ్ళాన్ని అన్నదొక్కటే నా ఐడెంటిటీ కాదు. అలాగని నేను పేరున్న మహావ్యక్తినేం కాదు. ఒక ప్రైవేట్ కాలేజిలో ఉద్యోగం సంపాదించుకుందుకు మాత్రం నా 'ఎం.ఏ.' ఉపయోగపడింది. నేర్చుకున్న ఇంగ్లీషు సాహిత్యానికి, నేర్పుతున్న ఆంధ్ర సాహిత్యానికి కొద్దిగా సంబంధం వుండటం కొద్దిగా సంతోషించదగ్గ విషయం. ఉద్యోగం విషయంలో నాకు అదే తృప్తి. నేను లోపల్లోపల షేక్స్‌పియర్, బెన్‌జాన్సన్, గోల్డ్‌స్మిత్, షెరిడన్, బెర్నార్డ్‌షా మొదలైనవాళ్ళ నాటకాల్లో ఏయే పాత్రల వ్యక్తిత్వం నాలో వుంది, ఆనంద్ ఏయే పాత్రల్ని పోలుతాడు అని ఆలోచిస్తూ వుంటాను. ఒక్కొక్కసారి ఒక్కోరకం పాత్రలలో సామ్యం కనిపిస్తుంటుంది. ఓసారి రోమియోలా, ఒక్కోసారి ఏంటోని, మరోసారి ఇయాగో, ఇంకోసారి ఫాల్‌స్టాఫ్ ఇలా రకరకాలుగా కనిపిస్తాడు.

నేను?

అదే నాకు స్పష్టంగా అర్థంకానిది. అతను రోమియోలాగ వున్నప్పుడు నేను జూలియట్నయ్యానా? అతను ఏంటోనిని పోలినప్పుడు నేను క్లియోపాత్రానయ్యానా? అతను హామ్లెట్ లాగ కనిపించినప్పుడు నేను ఒఫీలియానయ్యానా?

లేదు, నేనేమీ కాలేదు. నేను నేనుగానే వుండిపోయాను. నేనేమిటో నాకు స్పష్టంగా అర్థంకానప్పుడు అలా అయ్యాను, ఇలా అయ్యాను అని అనుకోడం ఇంకా అర్థంలేని సంగతి. అదేవనిగా ఒకరినొకరు పోలివుండరెవరూ కొన్ని అంశాల్లో మటుకు అందరూ అందర్నీ పోలి వుంటారు. ఈ పరిస్థితిలో 'నేను' అనే విశ్లేషణ నాకు కలగడమే కష్టం.

ఆనంద్ ఎన్ని రూపాలుగా కనిపించినా నావరకూ 'భర్త' అంతే. భర్తగా అతడు భార్య కంటికి కనిపించే తీరవేరు. బహుశః అదే అతని నిజమైనవ్యక్తిత్వం కావచ్చు. బయట మిగతావారికి ప్రదర్శించేది కృత్రిమం కావచ్చు. ముఖ కవచమూ కావచ్చు.

సుమారు పన్నెండేళ్ళక్రితం ఆనంద్‌తో నా వివాహం జరిగింది. నా జీవితంలో కొత్త



అధ్యాయం ప్రారంభమయింది.

పన్నెండు సంవత్సరాలు... ఎంత దీర్ఘ కాలం!

ఆ అధ్యాయం పూర్తయి మరో అధ్యాయం ఇటీవల ఐదారు నెలల క్రితమే మొదల యింది.

పెళ్ళయిన మొదటి రాత్రి!

తొలిరాత్రి ప్రతి స్త్రీకి తన పురుషుడు, ప్రతి పురుషుడికీ తన స్త్రీ అందంగానే కనిపిస్తారు. కాని నేను ఆరోజు అతని అందాన్ని గమనించి నట్టు లేదు. ఆ అందంవెనుక, హృదయం లోతుల్లో ఏముందా అని తెలుసుకోడానికి ప్ర యత్నించాను. కంటికి కనిపించినదాన్ని కని పించినట్టుగా స్వీకరించకుండా దాని వెనుక ఏముందా అని వెతుకులాడేవాళ్ళు సుఖపడ్డా నికి నోచుకోరు. సుఖపడదల్చుకొన్నవాళ్ళు అన వసరమైన విషయాల్ని అంచనావేయాలనే పనికిమాలిన ఆలోచనల్ని పెట్టుకోరు.

పెళ్ళికి ముందు అతన్ని నేను మూడు నాలుగుసార్లు చూశాను. అదీ అతను మా ఇంటికొచ్చినప్పుడు. అతన్ని బాగా దగ్గర్నుంచి చూశాను, మాట్లాడాను కూడా. తాకే అవకాశం దొరకలేదు. తల్చుకుంటే అదేమీ అసాధ్యం కాదు. అయినా అందుకు ప్రయత్నించే ఉత్సాహం కలుగలేదంటే అతను తమా యించుకునూరుకున్నట్టు అనిపించింది.

అతను చాలా అందగాడు. చురుకైన, తెలి వయిన మాటలు, ఆకర్షణీయమైన చిరునవ్వు. నాకంటే బాగా పొడుగు. నేను కొద్దిగా పొట్టి. ఐదడుగుల రెండు అంగుళాలున్నానంతే. హై హీల్స్ చెప్పులు వేసుకోకపోతే మరీ పొట్టిగా కనిపిస్తాను. సన్నగా తీగలాగుండేదాన్ని. ఆనంద్ తన రెండు అరచేతులూ కలిపి నా నడుం చుట్టు వేసి పట్టుకుంటే రెండుమూడు అంగుళాల నడుంభాగం మూతపడకుండా మిగుల్తుందంతే. తెల్లటి తెలుపు అందమైన బుల్లినోరు. కొద్దిగా పెద్దనుదురు. నా ముఖంలో సెక్స్ అప్పీల్ని పోతు పోస్తుందే విశాలమైన ను దురు. నా నడుమొంపులు కూడా చక్కంగా వుంటాయి. కొద్దిగా సన్నగా వుంటే బాగుండే దని ఎన్నిసార్లో అనిపిస్తుంది. పెద్ద పెద్ద కళ్ళు. అవే సుధకి ఆకారాలు. సుధ అంటే నేనే. కొన్నిసార్లు నేనుండేది ఆ కళ్ళల్లో మాత్రమే అనిపిస్తుంది కూడా. ఎవరో నర్తకిని గుర్తుచేసే లాంటి మెడ, దృఢమైన మొనతేలిన గడ్డం, గడ్డానికి కొద్దిదూరంలో ఎత్తయిన గుండెలు... ఎవరిచూపైనా గడ్డం మీదనుంచి కిందకి వాల వలసిందే... కొద్దిగా ఎర్రగా వున్నా మెత్తటి పొడవైన కేశరాశి. పెద్దనుదుటి వల్ల పోగొట్టుకు న్న సెక్స్ అపీల్ ఈ పొడవాటి జుట్టువల్ల సంపాదించుకోగలిగానేమోనని అపిస్తుందొక్కొ క్కసారి.

ముప్పయ్ రెండేళ్ళ ఈ వయసులో కూడా ఎవరూ నాకు పాతికేళ్ళకంటే ఎక్కువ ఉంటుందనుకోరు. ఆనంద్‌కీ, నాకూ పదమూ డేళ్ళ తేడా వుంది. పెళ్ళికి ముందు 'అతను నాకంటే బాగా పెద్దవాడుగదా?' అని మధనప డ్డాను. అమ్మ, నాన్న, బంధువులు-అంతా "ఈ మాత్రం వయసుతేడా వుండచ్చు. ఇది సామా న్యమే" అని నచ్చచెప్పాక, "సరే... ఈ మాత్రం వుండొచ్చులే" అని సరిపుచ్చుకున్నాను.

ఈ పన్నెండేళ్ళలో నాలో పెద్ద మార్పులేమీ రాలేదు. ఏభయ్యేళ్ళ పడిలో కూడా నడివయసు దాటినట్టు కనిపించరు కొందరాడవాళ్ళు. నేనూ ఆ జాతికే చేరినదాన్నేమో. పిల్లల్ని కనివుంటే నేనూ ఇలా వుండేదాన్ని కాను.

పెళ్ళయిన మొదటిరోజు రాత్రి ఆనంద్ నాకు దగ్గరగా నుంచుని నన్ను తదేకంగా చూశాడు. అదే మొదటిసారిగా నన్ను చూస్తు న్నట్టుగా... ఒక ప్రతిమనో, తైలవర్ణ చిత్రాన్నో చూస్తున్నట్టుగా.. అతని ముఖంలో ఉరకలేస్తు న్న సంతోషాన్ని చూసి నా రూపం అతన్ని ఎంతగా ఆకర్షించిందో తెలుసుకోగలిగాను. ఆ తెలియడం వల్ల నేనేమీ ఉబ్బిపోలేదు. ఎందు కంటే ఆక్షణంలో అది అంత ముఖ్యం కాదు. అతనిలో ఆ రకమైన ఉల్లాసం నన్నేమీ స్పందింపజేయలేదు. బహుశా ఎం.కాం. పాస యినప్పుడు, డాక్టరేట్ సంపాదించినప్పుడూ అతను అటువంటి సంతోషాన్నే, ఉల్లాసాన్నే, ఉద్వేగాన్నే పొందివుంటాడు.

నాకు ఆ క్షణంలో మాటలు అవసరం లేదు. అయినా అతనూ మాట్లాడేపక్షంలో ఏం మాట్లా డతాడో చూద్దామనే కుతూహలం మాత్రం వుంది. అంతకంటే ముఖ్యంగా అతను నన్నేవి

ధంగా స్పృశిస్తాడు? ఏవిధంగా అర్థం చేసుకుంటాడు? అనే కుతూహలం; ఏవిధంగా అనుభవం కలుగుతుంది? అనే కుతూహలం.

ఆనంద్ సడన్‌గా నా భుజాలమీద చేతులేసి నా ముఖంలోకి చూస్తూ "సుధా... ఎంతందంగా వున్నావ్" అన్నాడు.

అది మామూలే. ఆ మాటంటాడని నేనెదురు చూస్తూనేవున్నాను. కాని నేను కోరుకున్నదదికాదు. అతడు నా రూపాన్ని కంటికి కనిపిస్తున్న దాన్ని పొగడాలని, గమనించాలనీ నేను కోరుకోలేదు. ఆనంద్ ఇంకేమన్నా మాట్లాడితే బాగుండేది. అతను నా దేహం గురించి మాట్లాడే బదులు మా భావిజీవితం గురించి ఇంకేమయినా చెప్పివుంటే నేను ఆనందించేదాన్ని.

బహుశా నేను అతని స్థానంలో వుండి వుంటే నేను సుధని దగ్గరకు తీసుకుని "ఇవి మన జీవితంలో ఎంత మధురక్షణాలు" అనేదాన్ని. సుధ పరవశంగా చిరునవ్వు నవ్వేది. అప్పుడు నేను ఆమె ముఖాన్ని సున్నితంగా పైకెత్తి మరింత దగ్గరకులాక్కుని ముద్దుపెట్టుకునేదాన్ని. చెంపకి చెంప చేర్చి నా గుండెల్లో దాచుకునేదాన్ని.

అహఁ కాదు ... నేను అతని స్థానంలో వుంటే అసలు మాట్లాడేదాన్నే కాదు.

సరే... ఆనంద్ మాటలకి చిరునవ్వు నవ్వాను. కాని ఆ చిరునవ్వుని అట్టేసేపు ముఖంమీద వుంచుకోలేకపోయాను. అతని ముఖంలోకి సూటిగా చూశాను. ఎందుకో అతను మరోవేపు చూస్తున్నాడు. నేను ఊహించని మార్పు. ఎందుకో కొద్దిగా భయంవేసింది. అతనిలో ఒకసారి అస్పష్టంగా గంభీరమైన భావం ఏదో కమ్మి మాయమైనట్టు తోచింది. అతనే దాన్ని బలవంతంగా తొలగించినట్టున్నాడు.

మళ్లీ అతను చిరునవ్వు నవ్వినా సగం నిర్జీవంగా వున్నట్టుగానే అనిపించింది. అందమైన అతని కళ్ళు కళాహీనంగా అనిపించాయి. ముఖంలోని ఎరుపు మెరుపు తగ్గినట్టుగా అనిపించింది.

నేనేమన్నా మాట్లాడాల్సింది? మాట్లాడతానని అతను నిరీక్షిస్తున్నాడా? నా రూపం గురించి అతను చేసిన కామెంట్‌కి నేనేం జవాబివ్వగలను. నాలో మాటలేలేవు. మాటకారి అయిన ఆనంద్ కూడా మాట్లాడగలిగేలా అనిపించటంలేదు. ఏమన్నా మాట్లాడదామని నా హృదయం తవనపడింది. ఇంతలో అతనే ఆ సమస్యని పరిష్కరించాడు.

"దీపం ఆర్పెయ్యనా?"

నేనేమీ మాట్లాడలేదు. అతను దీపం ఆర్పేసి నన్ను మంచం మీదకి లాక్కున్నాడు. నా కంటికొనల్లోని నీటిబొట్లను ఎవరయినా చూడగలగడం ఎలా సాధ్యం?

★ ★ ★

నలభై అయిదేళ్ళు గడిచిన విషయం గురించి ఆనంద్ కొంచెం ఉద్విగ్నమనస్కుడైవున్నాడనే చెప్పొచ్చు. ఆ నలభై అయిదేళ్ళనీ బాల్యం, యవ్వనం.. ఇలా ఘట్టాలుగా, దశలుగా విభజించడానికి ప్రయత్నించాడు. అయినా ఏమీ స్పష్టమైనట్టుగా తోచలేదు. ఇప్పుడు తను యువకుడు కాదేమో, వృద్ధాప్యానికి సమీపంలో వున్నాడేమోనన్న భావం అతని ఉద్విగ్నతని అధికం చేసింది. అయితే నాలో తారుణ్యం అంతరించిపోయిందా? వృద్ధుడినైపోయానా? జమున ఏమనుకుంటుందో?

జమునని చూడాలంటే అతనికి భయంగా వుంది. అయినా చూడాలనే నిశ్చయించుకున్నాడు.

కాలింగ్‌బెల్ నొక్కగానే తలుపు తెరిచింది. ఆమె ... జమున!

"ఓ... డాక్టర్ ఆనంద్! రండి రండి"

ఎంత అద్భుతమైన చిరునవ్వు! ఎంత మోహంలో ముంచెత్తుతుంది! దాని వెనువెంటనే మత్తుని రేకెత్తించే విచ్చలవిడితనపు నవ్వు. కళ్ళు, చెవులు వున్నవాడెవరైనా సరే పిచ్చెక్కిపోవలసిందే. తనుమాత్రం ఈమెనెప్పుడైనా ఒదులుకోవాలని అనుకున్నాడా? ఊహుఁ... తనూ ఒక పిచ్చివాడే, అంతా పిచ్చివాళ్ళే అయ్యుంటారని నవ్వుకున్నాడు.

సంభాషణ కొనసాగించింది.

"డాక్టర్ ఆనంద్! నిన్నటి మీ ఉపన్యాసం 'రూరల్ బ్యాంకింగ్ డెవలప్‌మెంట్ ఎండ్ ది అప్‌లిఫ్ట్‌మెంట్ ఆఫ్ పెసెంట్స్' అమోఘంగా వుంది" అంటూ జమున గట్టిగా ఒళ్ళూపై తెలియనంతగా నవ్వింది.

'అబ్బే... నిన్నటి నా ఉపన్యాసం దాని గురించి కాదు' అని చెప్పాలనుకున్నాడు. కాని చెప్పనిస్తేకదా! ఆమెకి ఆ విషయంలో కుతూహలమే లేదు. తనేమన్నా చెప్పినా ఆమె ఇంకా పిచ్చిగా నవ్వచ్చు. ఆ నవ్వుకి అర్థం-'అయ్యో ముద్దుమొహమా, నిన్ను ఆ సంగతివ్వు దెవరడిగారు?' అని అయ్యుంటుందంతే.

ఇంచుమించు సుధ వయసే. ఒకటి రెండేళ్ళు పెద్దదయినా కావచ్చు. సుధ కంటే పొడుగు. అంతే సన్నం. ఈ రెండేళ్ళల్లో పెద్ద మార్పు కూడా లేదు. ఈమె తనలోని జ్వాలనెలా చల్లార్చుకుంటుంది? అదే గులాబీవర్ణపు మేను. ఎత్తయినసన్ననాలు. ఈ పదివన్నెండేళ్ళలో పెద్ద చెప్పుకోదగ్గ మార్పులేమీ లేవు. పెళ్ళి, కాన్పు, విడాకులు-ఇవేవీ కూడా ఆమె మీద పెద్ద ప్రభావాన్ని చూపినట్టులేదు. బుగ్గలు తగ్గాయంతే. రెండేళ్ళక్రితం చూసినప్పుడూ ఇలాగే వుంది.

"కూర్చోరా!" చిరునవ్వు.

"ఎలావున్నావు జమునా?" అర్థంమైన పలకరింపు.

"పేరు గుర్తుంది కదా! థాంక్స్" కృత్రిమమైన ఆశ్చర్యంతో విప్పారిన అందమైన కళ్ళు అదోరకంగా మాట్లాడుతుంది. ఏం చెప్పినా దండగే.

"బాబేడి?" అడిగాడు.

ఇప్పుడు జమున మామూలుగా మాట్లాడవచ్చు అని ఊహించాడు. అతని ఊహ రైటే. ఆమె ఆ నవ్వునాపింది.

"అమ్మ తీసుకెళ్ళింది" అని జవాబిచ్చింది.

'అమ్మ తీసుకెళ్ళడం కాదు, ఈమే నిన్న తీసుకెళ్ళి అక్కడ వదిలిపెట్టి వచ్చి వుంటుంది' అనుకున్నాడు.

అమ్మ ఒకచోట, నాన్న ఒకచోట! ఇదీ కొన్ని విధాల ఉపయోగమే!

"స్కూలుకి వెళ్తున్నాడా?"

"ఇంకా లేదు"

ఆనంద్ నుంచునే మాట్లాడుతున్నాడు.

"కూర్చోరన్నమాట! సరే, లోపలికి పదండి" అని నవ్వి లోపలికి కదిలింది జమున.

ఆనంద్ ఆమె వెనకనే వెళ్ళాడు.

"కూర్చోండి" అని మంచం చూపించింది.

అతను కూర్చున్నాడు.

ఆమె డ్రింక్స్ క్యాబినెట్ తెరిచింది.

'ఏమివ్వను?"

"నేనే తీసుకుంటాను"

జమున సోఫాలో కూర్చుంది.

విస్కీ ఒంపుకుంటూ అడిగాడు,

"నాన్నగారెలా వున్నారు?"

"హాఁ?"

అతను ఆమె ముఖంలోకి చూశాడు. భావవికారం లేదు. ఆమె జవాబిచ్చింది.

"మూడవ ఎటాక్ కోసం ఎదురుచూస్తున్నారు" నవ్వు.

"జమునా... నువ్వెందుకు అన్నింటికీ నవ్వుతావు" అని అడిగితే 'మై నర్స్ ఆర్ మేడ్ ఆఫ్ లాఫ్టర్'-ఇదీ జవాబు. దాని వెంటనే విన్నవాళ్ళ గుండె ఝల్లుమనేలాంటి నవ్వు.

"అయామ్ జస్ట్ నర్స్! కొన్ని సరీసృపాలుంటాయే, అలాగ! నో బ్రెయిన్, నో హార్ట్, ఆల్ నర్స్"

"అమ్మ ఇప్పుడూ ఇక్కడికి రాదా?"

"నాన్న వుండగానా?.... లేదు."

"నువ్వు?"

"నాదేముంది? నేనెప్పుడు కావాలంటే అప్పుడు అమ్మని చూడ్డానికి వెళ్ళచ్చు. అయామ్ ఎ ఫ్రీబర్డ్" అంది నవ్వి. "క్రితం నెల నాన్నగారు సింగపూర్ వెళ్ళారు. ఇంటిమేట్ తెచ్చారు. ఒక సీసా తీసికెళ్ళండి. ఇంటిమేట్ మాత్రం. మ్యాస్కలిన్ కాదు సుమా! బజార్లో కొన్నానని చెప్పండి, ఫరవాలేదు" అని గట్టిగా నవ్వింది.

ఆమె మాటలు విననట్టుగా అడిగాడు.

"అమ్మ ఎలా వున్నారు?"

"బాగున్నారు."

"నీ బ్రదర్స్, సిస్టర్స్ అంతా..."

"మా అమ్మకి నేనొక్కత్తినే" ఆమె మెల్లగా నవ్వింది. ఎప్పుడూ చెప్పే మాటలే.

"ఆ సంగతి తెలుసునాకు"




"ఓహెూ! వాళ్ళా? ఎక్కడెక్కడో వున్నారు. నాకసలు సరిగ్గా గుర్తే వుండదు. ఎక్కడెక్కడో... ఇరాన్, కువైట్, అమెరికా, ఇంగ్లాండ్... నాకేదీ సరిగ్గా గుర్తు లేదు బాబూ! డ్రాయింగ్‌రూమ్‌లో వాళ్ళందరి ఫొటోలు తగిలించి పైన వాళ్ళు ఉండే దేశాలపేర్లు రాసిన కాగితాలంటిద్దామ న్నాను మానాన్నతో"

"ఏమన్నారు?"

"స్టుపిడ్ అన్నారు" అంది నవ్వి.

"వాళ్ళెవరూ ఇక్కడికి రావడం లేదా?"

"ఎందుకురారు? ఎప్పుడైనా ఎవరో ఒకరు వస్తుంటారు. టి.వి., టూ ఇన్‌వన్, సెంట్స్.... ఇలాంటివన్నీ తెచ్చి ఇంట్లో నింపిపోతుంటా రు. వాటి మొహం చూసేవాళ్ళు లేక మురిగిపో తూ వుంటాయి, మనుమల్లాగే" అని నవ్వి మళ్ళీ తనే చెప్పింది.

క్రితంనెలలో అమెరికావాడొచ్చాడు.

"రామ్ కదా"

"ఊం! వాడి భార్య కూడా వచ్చింది"

"పెళ్ళయిందా"

"ఊం, అమెరికా పిల్ల, తనూ డాక్టరే" జమున ఫక్కున నవ్వింది.

"ఎందుకూ నవ్వు?"

"రామ్ భార్య అన్న మాటలు గుర్తొచ్చి."

"ఏమంది?"

"ఎవ్రీ గ్రామ్ ఆఫ్ యు ఈజ్ ఈక్వల్ టు గోల్డ్" అంది. అంటే సుమారు నలభై అయిదు కిలోల బంగారం. గట్టిగా నవ్వింది జమున.

"ఆవిడన్నమాట నిజమే" విస్కీ చప్పరిస్తూ అన్నాడు.

"అమెరికా బంగారం ఎలా వుంటుందో తెలుసునాకు. నాలుగు రోజుల్లో ఏదైనా బంగారం అయిపోతుంది. కాని ఈ దేశంలో రాళ్ళూ రాళ్ళే, బంగారమూ రాళ్ళే"

జమున తండ్రి ఫారిన్ సర్వీస్‌లో వున్న మనిషి. జమున కూడా తండ్రితో భూప్రద క్షిణం చేసి వచ్చింది.

"అంతా తెట్టు, నురగమీది తెట్టు"

ఎవరిగురించి అలా మాట్లాడుతోందో ఆనంద్‌కి స్పష్టంగా అర్థం కాలేదు. బహుశః స్వగతం కాబోలు అనుకుని విస్కీ సిప్ చేస్తూ వచ్చి మంచం మీద కూర్చున్నాడు. ఆమెనే చూస్తున్నాడు. ఆమె దృష్టి ఎక్కడో వుంది.

"మూడేళ్ళయింది కదా ఇక్కడికొచ్చి"

"లేదు, రెండు రెండున్నరేళ్ళు"

"చాలా చురుకైన బుర్ర" జమున నవ్వింది.

అప్పుడర్థమైందతనికి మూడేళ్ళన్నమాట సరదాకి అందని.

"నాలో మార్పేమీ లేదా?"

ఆమెనోసారి పరకాయించి చూసినట్టు చూసి "ఏమీ కనిపించడంలేదే!" అన్నాడు.

"బాబుకి ఐదేళ్ళు".

అందువల్ల నీలో మార్పేమీ లేదు.

"వాడి అమ్మని నేను కాదుగా!"

"మరెవరు?"

"నా అమ్మ!" నవ్వింది.

"సుధ ఎలావుంది?" ఆమె అడిగింది.

'అలాగే వుంది"

"అప్పటి తన ఫొటో ఇంకా నా దగ్గరుంది. తనది ఇప్పటి ఫొటో చూపించరూ?"

"చూపిస్తాను"

"నాదొక ఫొటో ఇస్తాను. సుధకివ్వండి" అంది. పెదవులు బలవంతాన బిగించి ఇంక ఆపుకోలేక గదిగోడలు ప్రతిధ్వనించేలా ఘొ ల్లున నవ్వింది.

ఆనంద్ గుండె ఝల్లుమంది. ఊపిరి సలు పనివ్వని నవ్వు ఇది. అద్భుతమైన నవ్వు! రికార్డు చేసుకోవాలి. ఈ నవ్వుని శాశ్వతం అయ్యేలా ఒక కేసెట్ నిండా రికార్డ్ చేసేసుకో వాలి. ఇటీజ్ యునిక్ అనుకుని విస్కీని సిప్ చేసాడు. హృదయం శాంతించింది.

ఆమె అతడినోకసారి కళ్ళెత్తి చూసి అంది, "మీకిప్పుడు నలభై ఆరొచ్చింది"

"ఊం"

"మొన్ననే మీ నలభైఆరవ పుట్టిన రోజుని మిల్క్‌వేలో పూర్తి చేసుకున్నారు."

అన్నీ ఎంత బాగా గుర్తుంచుకుంటుంది! ఎంత కరక్ట్‌గా వూహిస్తుంది! ఈమెకేమన్నా అతీంద్రియ గ్రహణ శక్తులున్నాయోమో.



ఎన్నోసార్లు తన అంచనాలతో ఇతని తల క్రిందులు చేసింది. హడలగొట్టింది.

"పూర్తిచేసుకోవడం ఏమిటి?"

"ఓ! ఫినిష్డ్ అంటే తప్పేమో. సెలబ్రేటెడ్ అనాల్సిందికాబోలు. రెండింటికీ నా దృష్టిలో ఒకటే అర్థం. ఒక సంఘటన గురించి, ఆరంభం గురించి చెప్పినా అంతంగురించి చెప్పినా అర్థం ఒకటే, అది 'జరిగింది' అని."

అతను మౌనంగా వూరుకున్నాడు. ఆమెతో వాదించడానికి తనకున్న తెలివి చాలదనీ, ఆమెకున్న తర్కజ్ఞానం తనకి అపరిచితం. అది చాలా విశిష్టమైనది కూడా. ఆమె అలా మాట్లాడినప్పుడు ఆనంద్‌కి తన ఎం.కాం, ఎల్లెల్బీ గుర్తొస్తుంది. జమున ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకుంది. నరదాకి ఎం.ఎ. చదివాను. పాసవలేదంతే. ఆఫ్టాల్ ఈ డిగ్రీలు అవీ నాన్సెన్స్ అని అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నట్టుగా నవ్వుతుంది. అందుకే తను పాసవలేదు అంటుంది గాని, ఫెయిలయ్యాననదు.

"మీరు పదేళ్ళు చిన్నవారిలా కనిపిస్తున్నారు" అని గలగల నవ్వింది. పూలతీగలాంటి ఆమె మేను వయ్యారంగా కులికింది.

అతను విస్కీ గ్లాసు ఖాళీ చేశాడు.

రండి అంటూ మరో గది తలుపు తెరిచింది.

అతను ఆమె వెనకాలే లోపలికి నడిచాడు.

"దిసీజ్ మై యూనివర్స్, ది సేమ్ ఆల్‌ది టైమ్!"

ఆ బెడ్ రూంలో వ్యాపించిన పరిమళం చాలా గొప్పగా వుంది. పెద్ద అద్దం ముందు రోజ్‌వుడ్ టేబుల్ మీద దంతంతో తయారుచేసిన రాధాకృష్ణుల విగ్రహం. ఇన్నాళ్ళూ ఎక్కడుందో ఎవరన్నా బహూకరించారేమో!

"అబ్బే... నేనే కొనుక్కున్నాను" అంది.

అతను ఉలిక్కిపడ్డాడు. తన ఆలోచనలని చదివినట్టుగా అలా జవాబులెలా చెప్తుంది?!

ఆమె అట్టహాసంగా నవ్వుతూ పరచివున్న విశాలమైన పరుపుమీద వాలింది. ఆ నవ్వు శబ్దరూపంలో కేవలం చెవుల్లో మాత్రమే కాకుండా, ఎక్స్ కిరణాల్లా దేహం మొత్తంలోకి ప్రవేశించినట్టుగా అయింది.

ఆ నవ్వు ఆగినప్పుడు అదొక శూన్యక్షణం. పరిపూర్ణమౌనం. జమున తన గదిని సౌండ్ ప్రూఫ్ చేయించుకుంది.

"దిసీజ్ మై యూనివర్స్! ఐ డాన్స్! ఐ సింగ్, ఐ లాఫ్, ఐ స్క్రీమ్, ఐ గో మ్యాడ్, ఐ డై, ఐ కమ్ టు లైఫ్ అగెయిన్. ఐ టర్న్ ఇన్‌టు యాష్ ఎండ్ ఐ స్ప్రింగ్ ఫ్రం ది యాష్ లైక్ ది సాలమండర్ జస్ట్ లైక్ దిస్" అంటూ పడుకున్న చోటనే తన దేహాన్ని మెలికలు తిప్పి కులికించి నవ్వింది.

అతడు ఆమెని చూశాడు. అతడి హృదయంలో జాలి ఉప్పొంగింది.

అతను వెళ్ళి ఆమెకి దగ్గరగా కూర్చున్నాడు. ఆమె నవ్వుతూనే అతన్ని మంచం మీదకి దొర్లించింది.

యూనివర్స్ అనేది మనిషికెప్పుడూ అభేద్యమైనది అనే సంగతి జమునకి బాగా తెలుసు. అందువల్ల ఏదో అదృశ్యమైనదానిని హస్తగతం చేసుకుని 'ఇది నా యూనివర్స్' అంటోంది అనుకున్నాడు. అందులో అన్నీ ఆమే. అన్నీ ఆమె ఇష్టమే. అన్నీ ఆమె అధీనమే.

అతని మనసు ఆలోచనల్లో తేలసాగింది.

ఇది కలా? నిజమా? స్యానిటీనా? ఇన్‌స్యానిటీనా? బాల్యమా? యౌవనమా? వృద్ధాప్యమా? బహుశా ఏమీకాదు. కేవలం సజీవమైన ఒక్క క్షణం. 'రూరల్ బ్యాంకింగ్ ఎండ్ అర్బన్‌లవ్' అని జమున ఎప్పుడూ నవ్వుతుంటుంది. పాపం ఒంటరిజీవితం! స్వతంత్రం వున్న ఒంటరి! స్వతంత్రం వున్నా బందీయే. తను? బందీనా? స్వతంత్రుడా? ఏది నిజం? ఏది మిథ్య?

అంతా మిథ్యే. నక్షత్రాలని చుంబించే హర్మ్యం, చుట్టూ ఆవరించిన ఆకాశం, భూకంపం అన్నీ అసత్యాలే.

మరి ఏది సత్యం? 'ఈ క్షణం' అంతే! ఇది ఇసుకతిన్నెలు నల్లూరి సముద్రతీరం. మట్టి, చేపలు, పసిరిక... వీటి సుఖకరమైన వాసన! ఉదయమే వెచ్చదనం మొదలై తాకిన ప్రతిచోటూ, నడచిన ప్రతిబాటా, పడుకున్న ప్రతి తావు, ఆనందంగా దొర్లిన ప్రతి స్థలమూ అన్నింటా... అందం, పరిమళం!





సుషుప్తి లోతులకి సాగినకొద్దీ మనసు జాగృతమవుతుంది. ఇది మనసా, మరేమన్నానా? - అని ఆశ్చర్యం కలుగుతుంది. సుషుప్తిలో మునిగేది దేహం, జాగృతమయ్యేది ఆత్మ, అంతరాత్మ కావచ్చు అనుకుంటాడు. ఎడం చెయ్యి పొడుగ్గా వుంది. ఎక్కడ వడుందో తెలియదు. కుడిచేతికి వట్టువంటి మెత్తని దేహం ఏమిటది? ఏమిటోమరి? అన్నింటికీ ఒకటే - స్పర్శానుభవం.

ఎందుకో గబుక్కున అతని హృదయంలో వున్నట్టుండి అదేదో దాహం.

మీనాక్షి! మీనాక్షి! మీనాక్షి!

సంస్కృత కవులు తమ కావ్యంలో వర్ణించిన సౌందర్యానికి ప్రతీక... మీనాక్షి! ఆమె అవయవాల అందం చూసితీరాలి! ఆమె స్వరంలో దివ్యమైన సంగీత స్వరాల మేళవింపు. చిరునవ్వు నవ్విందంటే గులాబీ పూలు విరిసినంత అందం. నవ్వితే కమలం విరిసినట్టే. సౌందర్యానికి పిచ్చెక్కించేశక్తి వుందంటే, అది ఆమెలోనే వుందని చెప్పాలి. తను ఆమె సాన్నిధ్యంలో వున్నాడంటే తననితాను మరచి ఆమెలో లీనమైపోయేవాడు. తన చుట్టూ ఏమున్నా ఎవరున్నా తనలో లీనం చేసుకునేశక్తి... అద్భుతమైన సమ్మోహకశక్తి ఆమెలో వుంది. ఆమె కంటి కొసలలో, మృదువైన చేతివేలి కొసలలో, మొగలిపూరేకుల వర్ణంలో మెరిసిపోయే ఆమె శరీరపు ప్రతికోణంలో, ప్రతి కొసలో జీవం నిండివుంది.

అప్పుడు ఆ అనుభవం అంతా జాగృతిలో ఒక భాగమేకదా! ఇప్పుడదేమిటి... నిజమా? మిథ్యా?

అవకాశం దొరికితే ఆమెతోబాటు బంగాళాఖాతం లోతులకి పోడానికి కూడా ఆనంద్ సిద్ధమే.

అవకాశం ఎందుకు దొరకడంలేదు. తనవల్లా? ఆమెవల్లా? తనవల్లే అయ్యుంటుంది.

ఆమె ఒక్కతే వెళ్ళింది. ఆమె చనిపోయిందన్న వార్తని నమ్మలేకపోయాడతను. ఇవాళ్టికీ నమ్మలేదు. నమ్మడానికి అతని మనసు ఒప్పుకోడంలేదు. మళ్ళీ వెళ్ళి సముద్రతీరంలో, విహార స్థలాల్లో, హొటల్స్ వెనుక నుండే పూపొదరిళ్ళల్లో వెతికితే ఆమె కనపడుతుందేమో! 'మీనాక్షి' అనే వ్యక్తి ఎక్కడయినా వుంటుందేమో!

వెతకాలనే ఉద్దేశంతో ఉద్వేగం చెందుతాడు. మిగిలిన జీవితాన్ని ఆసక్తితో, ఉత్కంఠతో, వికాసంతో జీవించాలనుకుంటాడు. ఇప్పుడు అతని కుడిచెయ్యి ఎక్కడుందో తెలుస్తోంది. జబ్బని స్పృశిస్తున్నదేమిటో తెలుస్తోంది. వెచ్చదనం తగ్గిపోయిన ఊపిరి ముఖంమీద తాకడం తెలుస్తోంది.

ఈ స్పర్శ సృష్టించే సంవేదనవల్ల దేహం మళ్ళీ మేలుకుంటుంది. లోపలి చింతా జాగృతి చటుక్కున మాయం అవుతుంది. ఆలోచనలు స్థగితమవుతాయి. అతను ఆమెని చూస్తాడు. నిద్రలో ఏ దాపరికం లేకుండా, బంగారు సాలభంజికలా, నిగూఢమైనదేదీ లేదు.... అంతా ఇదే... నగ్నసత్యం అంటున్నట్టుగా, తన 'యూనివర్స్'లో లేకపోయినా ఉన్నానన్న భావనతో....

ఆ క్షణంలో అతన్ని వేధిస్తున్న ప్రశ్న ఏమిటంటే, అతని 'ఉనికి', ఉంటే, ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ? అదే ప్రశ్న మళ్ళీ మళ్ళీ అన్నివేపులా ఉదయిస్తుంది. ఆ సౌండ్ ప్రూఫ్ రూమ్‌లోని మౌనంలో అది మరింత శక్తిని పొందుతోంది.



ఆనంద్ విషయంలో తను అభిమానపడవలసింది ఏముంది? రూపమా? తెలివా? ఉద్యోగమా? సంఘంలో అతడి స్థానమా?

ఇవేవీకాక మరేమయినా అతనిలో వుందా?

ఉండే వుంటుంది.

పరస్పరం అభిమానించుకోవలసిందేమీ



లేకపోయినా కూడా భార్యాభర్తలుగా బతికేస్తూ ఏ తగువులూ లేకుండా రోజులు దొర్లించేవాళ్లూ వున్నారు. ఆ లెక్కన భార్యాభర్త బాంధవ్యానికి అర్థం ఏమిటి?

అదేంకాదు, అదొక అర్థశాస్త్ర సంబంధమైన, కామశాస్త్ర సంబంధమైన ఒప్పందంకాక మరేమిటి? పరస్పరం కొన్ని సౌకర్యాలని పంచుకుందుకు, ఇబ్బందుల్ని నివారించుకుందుకు ఒక ఒప్పందం.

నేను ఆనంద్ గురించి ఆలోచించినప్పుడల్లా ఇలాంటి ఆలోచనలే వస్తాయి.

ప్రేమ ద్వేషమై వుంటుంది. ద్వేషం ప్రేమ యొక్క మరొక ముఖమై వుంటుంది. ఎందుకంటే అపరిచితుల్ని ఎవరూ ద్వేషించరు. పరిచితుల్నే ద్వేషిస్తారు. ప్రేమింపబడని వ్యక్తి ద్వేషానికి గురవడు. ద్వేషాగ్నికి బలయ్యేది ప్రేమ పొందే వ్యక్తే. అత్యంతపరిచితుడై, ప్రేమపాత్రుడైన వ్యక్తే మళ్లీ అపరిచితుడిలా మారిపోగలడు. పరిచయం అత్యంత గాఢమైనప్పుడే అవతలి వ్యక్తిపట్ల మనం గుడ్డివాళ్లం అవుతాం. అవతలివ్యక్తి గురించి గుడ్డి నిర్ణయాలు తీసుకుంటాం. పిల్లల విషయంలో తల్లిదండ్రులు, తల్లిదండ్రుల పట్ల పిల్లలు, భార్యపట్ల భర్త, భర్తపట్ల భార్య ఎప్పుడూ ఇలాగే వుంటారు.

ఎవరైనా దీన్ని విరోధాభాసం అనొచ్చు. విరోధాభాసానికి అర్థంలేదని ఎవరైనా అంటేమాత్రం నేను ఒప్పుకోను. మన జీవితం విరోధాభాసాల పంచాంగం మీదే ఆధారపడివుంది. క్షణికమైనదాన్ని శాశ్వతమనుకోడం, ఏది అశాశ్వతమో దానికోసం పాకులాడటం, చావు తప్పదని తెలిసికూడా చావు లేనివాళ్ళలా ప్రవర్తించడం ఒకటా రెండా? అనేకం!

బహుశః అదే కదా జీవితం? జీవితం ఒక విరోధాభాసం, ప్యారడాక్స్.

ఆనంద్ ఎం.కాం, ఎల్లెల్బీ చదివి, ఐ.ఎ.ఎస్‌లో రెండుసార్లు ఫెయిలయ్యాక, బ్యాంకింగ్‌లో అదేదో విచిత్రమైన ఒక విషయం మీద పి.హెచ్.డి చేశాడు. ఆ తరువాత ఒక కాలేజీలో లెక్చరర్అయ్యాడు. పెళ్లయ్యాక నా తండ్రి ఇన్‌ఫ్లుయెన్స్‌వల్ల బ్యాంక్‌లో ఉద్యోగం సంపాదించాడు.

ఆనంద్‌ని తలచుకున్నపుడు ఒక వ్యక్తి తనకి తనెలా కనిపిస్తాడు? అలాగే అతను ఇతరులకి ఎలా కనిపిస్తాడు అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఎందుకంటే అతను బ్యాంకు మిత్రులకి టిప్‌టాప్‌గా, ప్యాంటు, కోటు, టై ధరించి కనిపించే తరహా వ్యక్తికి, 'ఆనంద్' అనుకోగానే తన మనసులో ఏర్పడే చిత్రానికి, స్వతః ఆనంద్ మనసులో 'తను' అంటే తనకున్న భావచిత్రానికి చాలా తేడాలుంటాయి. నేను ఆనంద్ గురించి చెప్పాలంటే, నేనెరిగిన ఆనంద్ వేరు, అతని సహోద్యోగులెరిగిన ఆనంద్ వేరు, మా ఇరుగుపొరుగువాళ్లకి తెలిసిన ఆనంద్ వేరు. మా స్నేహితులైన మహేష్, శీలా, రాకేష్‌లకి తెలిసిన ఆనంద్ వేరు.

ఈ ఆనంద్‌లందరి సంగతి అలా వుంచితే, ఇంకెంతమంది ఆనంద్‌లున్నారో. ఈమాట బుద్ధున్నవాళ్లెవరైనా సరే చెప్పగలరు.

ఎం.కాం ఫస్ట్‌క్లాస్‌లో పాసయిన తన తెలివి గురించి, చాలా కష్టమైన సబ్జెక్టుమీద రీసెర్చి చేసి, డాక్టరేట్ సంపాదించిన తన గొప్పతనాన్ని గురించి రోజూ గొప్ప చెప్పుకుంటాడు. ఇక బ్యాంక్ ఉద్యోగం వచ్చినప్పట్నుంచీ ఈ దేశంలో ఈ విషయంమీద పి.హెచ్.డి చేసినవాళ్లు కేవలం ఇద్దరో ముగ్గురో మాత్రమే వున్నారనీ, అందువల్ల బ్యాంకే తనని పిలిచి ఈ ఉద్యోగం ఇచ్చిందనీ, సందర్భం వున్నా లేకపోయినా అస్తమానూ చెబుతూనే వుంటాడు. ఈ విషయాలు చెప్పడానికి అతనికి ఏనాడూ బోర్‌గా అనిపించదు. ఇప్పటికీ చిన్న అవకాశం దొరికినా ఇదే డబ్బా వాయించుకుంటాడు. అంతేకాక సందర్భం దొరికినప్పుడల్లా భార్య అందాన్ని పొగుడుతుంటాడు. ఆమె ముఖం తీరుని, పొడవాటి కురుల సౌందర్యాన్ని ఆమె నడకలోని ఒయ్యారాన్ని ఆమె స్వర మాధుర్యాన్ని - ఇలా వేటివేటినో పొగడ్డం మొదలెడతాడు.

తొలి రాత్రి ఎలా గడిచిందోకూడా చాలా వివరంగా, రసవత్తరంగావర్ణించి తన కొలీగ్స్ దగ్గర చెప్పాడని విన్నాను. ఇలాంటి విషయాలు మరొకరి దగ్గర చెప్పుకుంటారా అని ఆశ్చర్యపోయాను. అబ్బ... ఎలాంటి మనుషులుంటారు బాబూ అన్న ఆశ్చర్యం కలిగింది, ఆనంద్‌వాచాలత్వానికి. అప్పటికే ఆ వాచాలత్వం అంటే విసుగ్గా వుండేది నాకు. ఇది ఏ కోవకి చెందే వాచాలత్వమో నిర్ణయించలేక సతమతమయ్యాను.

కాని చిత్రం ఏమిటంటే - అతను తన మిత్రులకి వర్ణించి చెప్పుకున్నట్టుగా ఏమీ జరగలేదు.

పెళ్ళవగానే మేం కాశ్మీరు వెళ్ళాం. ఎందుకో నాకు అర్థంకాలేదు. ఆనంద్‌కి అర్థం కాలేదనే అనుకుంటాను. నేను సంతోషంగా బతకడానికి నేచుకోలేదనుకుంటాను. అక్కడ తిన్నాం, తాగాం, తిరిగాం, కలిసి పడుకున్నాం. ఏం చూశామో గుర్తులేదు. ఏమీ చూడలేదనే చెప్పొచ్చు. ఒకే ఒక్క అందమైన జ్ఞాపకం ఏమిటంటే- ఒక భార్య భర్త తమ మూడు నాలుగేళ్ళ బిడ్డతో ఈ ప్రపంచాన్ని మరచిపోయి ఆటలాడి, గంతులేసి, నాట్యమాడి నవ్వుకుంటూ గడిపిన దృశ్యం.

కాశ్మీరు నుంచొచ్చాక ఆనంద్‌కి చెప్పుకోడానికి మరో విషయం దొరికింది. కాశ్మీరు అందాలు, తామెలా అక్కడ విహరించారో ఆ వివరాలు, ఎలా ఆనందించారో అన్నీ వర్ణించి వర్ణించి చెప్పేవాడు.





కాని అవన్నీ ఉత్తిమాటలే. అవేమీ జరగలే దు. కాశ్మీరు అంత మహా గొప్పగా ఏమీలేదు అప్పుడు. కాని విన్నవాళ్ళు నమ్మితీరేటంత నేర్పుగా చెప్పగలడతడు. ఇలా మాటల్తో హార్మ్యాలు నిర్మించి, శబ్దాలతో నులిమెత్తని పట్టుచీరని చేసెయ్యగలిగే కళని చూసి నేను ఆనంద్‌ని అభిమానించాలా?

ఆనంద్ మాట్లాడేటప్పుడు చూస్తే మాటల్లో అతనికంటే తన్మయత్వం, దట్టమైన కనుబొమల విరుపుచాటున మెరిసే నల్లని కళ్ళు, రంగుతేలే చెక్కిళ్ళు, ఉత్కంఠని సూచించే కంఠం చూస్తే ఇదేమన్నా కామోద్రేకమా - అనిపిస్తుంది నాకు. నేను ఆనంద్‌ని క్రియాపూర్ణంగా, చైతన్యవంతంగా చూసేది ఆ రెండు సందర్భాలలో మాత్రమే. కాని ఆ రెండింటిలోను ఏదో అవాస్తవికత, ఏదో నాటకం, హిపోక్రసీ వుందన్న సంగతి నేనేరోజో కనుగొన్నాను. ఈ విషయం నాకు 'తెలిసిపోవడం' అన్నది నాలోని సంతోషాన్ని నాశనం చేసేసిందని పిస్తుంది. భార్యాభర్తల సంబంధం విషయంలో స్త్రీ సంతోషంగా వుండాలంటే ఆమెకి తన భర్త గురించి ఏమీ తెలిసి వుండకూడదు. తెలుసుకోడానికి ఆమె ప్రయత్నించకూడదు. తనకి దక్కినదేదో మహాప్రసాదం అని సంతోషపడాలి. దక్కనిదాని గురించి తెలుసుకోడానికి ప్రయత్నించడంగాని, విచారించడంగాని చేయకూడదు. దక్కనిదానిని కోరుకోకూడదు. సంతోషంగా బతికే భార్యలందరూ చేసేపని ఇదే.

చాలాసార్లు ఆనంద్ నన్ను తాకినప్పుడు చికాగ్గా వుంటుంది. అయినా ఆ సంగతి అతనికి తెలియకుండా జాగ్రత్త పడేదాన్ని. ఆ తరువాత అలా నటించకపోయినా నష్టం లేదనిపించింది. పరాయి ఆడవాళ్ళని చూసి ఉద్రేకం పొందే వాళ్ళకి భార్య ఎలావున్నా ఫరవాలేదనిపించింది. అదొక్క విషయానికి మాత్రం ఈ మాట వర్తిస్తుందనుకుంటాను.

★ ★ ★

కారుంది కనుక భార్యాభర్తలిద్దరూ కలిసే బయల్దేరతారు. భార్యని కాలేజీ గేటుదగ్గర దింపి మరీ తన ఉద్యోగానికి వెళ్తాడతను.





భార్యాభర్తలిద్దరూ ఎప్పుడూ జంటగానే తిరుగుతారు. వీధిలో, బజార్లో ఎక్కడికెళ్ళినా అంతే. సుధ ఒంటరిగా ఎప్పుడూ కనబడదు. ఎప్పుడూ ఒకళ్ళని వదిలి ఒకళ్ళు వుండనంత అన్యోన్యంగా అతుక్కునుంటారు. అన్నివిధాల అపురూపమైన దాంపత్యం. చూసిన కళ్ళు మెచ్చుకుతీరవల్సిందే.

కలకత్తా నుంచి రాగానే - ఆహారం మార్పులవల్ల కడుపు చెడిందేమో, ఆకలి లేదనేవాడు ఆనంద్. తరువాత జ్వరం అని పడుకున్నాడు. బొత్తిగా నిస్సత్తువగా వున్నాడు.

అనారోగ్యం అయితే డాక్టర్ని వెతుక్కెళ్ళాల్సిన అవసరంలేదు. పిలిస్తే పలికేటంత దూరంలోనే డాక్టర్ మహేష్ వున్నాడు. అతనింట్లో ఫోనుంది. ఆనంద్‌కీ వుంది. ఆనంద్‌ది స్వంత ఇల్లు కాదు. మహేష్‌ది మాత్రం స్వంతఇల్లే.

ఫోన్ చెయ్యగానే మహేష్ వచ్చాడు. అతన్తో బాటు అతని భార్య శీలా కూడా వచ్చింది.

ఆనంద్‌ని పరీక్షించి-

"వైరల్ ఫీవర్. అంతే" అని మందు రాసిచ్చాడు.

"టైఫాయిడేమోననుకొన్నాను" అన్నాడు ఆనంద్.

"ఎప్పుడూ పెద్ద జబ్బుల గురించే ఆలోచిస్తావు కదా! జలుబు, ఫ్లూ అంటే బొత్తిగా ఇంట్రస్ట్ వున్నట్టు లేదే" అని నవ్వాడు మహేష్.

"బిగ్ పీపుల్ థింక్ బిగ్"

ఆనంద్ కృత్రిమమైన చిరునవ్వుతో అన్నాడు.

"అయితే ఒక విషయం మర్చిపోకు. మహా మహా వ్యాధులన్నింటి వెనుక వుండేది అతి చిన్నదైన సూక్ష్మక్రిములు- వైరస్" అని నవ్వాడు మహేష్.

"ఎలావుంది కలకత్తా?" శీలా తన రెండు చేతుల్ని చెరోవక్క నగ్నంగా వున్న తన జబ్బల మీద వేసుకుని ఆకర్షణీయ భంగిమలో కూర్చుని అడిగింది.

ఆమె గుండెలమీదుగా పరచుకున్న చేతుల్ని చూసి, మహేష్ వైపు తిరిగి-

"చాలా బాగుంది. తీరా వెళ్ళాక సుధని కూడా తీసుకెళ్ళాల్సిందని చాలాసార్లు అనుకు

న్నాను. ఫైవ్‌స్టార్ హోటల్ మిల్కీవే పదహారో అంతస్థులో బ్యాంక్‌వాళ్ళే ఎకామడేషన్ ఏర్పాటుచేశారు"

సుధ వంటింట్లోకి వెళ్ళింది. ఆమె ముఖంలో చిరునవ్వు! అది మామూలే. ఆమె ముఖంలో చిరునవ్వు లేకుండా ఎప్పుడూ వుండదు. "ఐ థింక్ యువర్ బార్న్ విత్ ఎ స్మైల్" అంటాడు డాక్టర్ మహేష్.

ఆనంద్ అనారోగ్యం సగం పారిపోయిందప్పుడే. అతను మంచం మధ్యలో కూర్చుని కలకత్తా విశేషాలు చెప్పడం ఆరంభించాడు. అవన్నీ మూడేళ్ళక్రితం విన్నమాటల్లాగే అనిపించాయి. సుధకి కొత్తవిషయాలేమీ లేవు. మహేష్, శీలామాత్రం రెండవసారి కూడా అంతే ఆసక్తిగా అతని పర్యటన విన్నారు. ఆసక్తిగా ప్రశ్నలడిగి జవాబులు విన్నారు.

వర్ణించడంలో ఆనంద్ ఒక ఎత్తయితే, డాక్టర్ మహేష్ మరో ఎత్తు.

ఆనంద్ తను కలకత్తాలో కొనుక్కున్న ఇంటిమేట్ గురించి చెప్పాడు "అతని దగ్గర ఒక్కటే బాటిల్ వుంది. లేకపోతే మీకొక్కటా ఒకటి కొని తెచ్చేవాడిని" అన్నాడు.

పాపం అంత ఖరీదయిన ఇంటిమేట్ ఎలా కొన్నాడబ్బా అని ఆశ్చర్యపోయింది సుధ.

"అందులో ఏముందిలే. ఏం ఫరవాలేదు. మేము బోలెడన్ని బాటిల్స్ ఖాళీ చేసాం. నైరోబీలో వుండగా! శీలా కొన్నిసార్లు అందులోనే స్నానం చేసేదని కూడా చెప్పొచ్చు." మహేష్ గట్టిగా నవ్వేసాడు.

"మీరు మరీ విపరీతం!" అని శీలా మోహకంగా నవ్వి గడ్డంలో సొట్ట తెప్పించి మరీ అంది. అది సహజంగా వచ్చే సొట్టకాదు. డయటింగ్ చేయడంవల్ల వచ్చిన సొట్టలు. పెదవులని కదిపితేచాలు సొట్టలు ప్రత్యక్షం!

మహేష్ తన ప్రియమైన సబ్జెక్ట్ కెన్యా నివాసం గురించి కథ మొదలెట్టాడు.

ఎం.బి.బి.ఎస్. పూర్తిచేసిన నెల్లాళ్ళకల్లా రెండొందల ఏభైజీతంతో బొంబాయిలో ఒక దరిద్రపు ప్రైవేట్ క్లినిక్‌లో పనిమొదలెట్టిన మహేష్‌కి కెన్యాలోవున్న బంధువొకాయన సహకరించడంవల్ల నైరోబీలోని ఒక పెద్ద హాస్పిటల్లో ఉద్యోగం దొరికింది. ఐదారేళ్ళల్లో బాగా డబ్బు సంపాదించాడు. తర్వాత శీలా తండ్రి పోవడంతో, జుహూలో ఆయన ఇల్లొకటి ఖాళీగా పడుండటంతో, అయిష్టంగానే నైరోబీ వదిలి బొంబాయి వచ్చి ఆ ఇంటికి బోర్డు తగిలించాడు. మహేష్ డాక్టరు మాత్రమే కాక, మార్వాడీ పనికూడా చేయడంవల్ల డబ్బుకేనాడూ ఇబ్బంది పడలేదు.

మార్వాడీ మాత్రమే కాదు 'నటుడు' కూడా అనుకుంది సుధ. అతను కొందరు రోగులతో మాట్లాడే పద్ధతి చూసి, రోగాన్ని నయంచేయడమే కాకుండా రోగికి సంతోషం కలిగించడం కూడా ముఖ్యమే అనేది అతని ఫిలాసఫీ అయ్యుండవచ్చు అనుకుంది సుధ.

నైరోబీలో గడిపిన పది సంవత్సరాల తియ్యటి అనుభవాలు, ఒకసారి యూరోప్, ఇంగ్లాండు వగైరా యాత్రల గురించి, ఇంకోసారి అమెరికా, జపాన్ చుట్టివచ్చినప్పటి మహత్తర అనుభవాలు, జ్ఞాపకాలు... ఇదే మహేష్ మాట్లాడే ముఖ్యాంశాలు. బహామాస్ ద్వీపాన్ని సందర్శించడానికి వెళ్ళినప్పుడు ప్రసిద్ధ హాలీవుడ్ తార ఒకవిడ పరిచయం అవడం... ఆవిడ మహేష్ రూపాన్ని చూసి మోహించడం... అదుపు చూసి, శీలా కళ్ళుకప్పి, ఇతనితో క్రీడించడం... మొదలైనవన్నీ సవివరంగా ఆనంద్ ఇక్కడే వున్నప్పుడు చెప్పాడు. ఏదో సినిమా వస్తే దానికి లొకేషన్లు, ఆ తారని తెరమీద చూపించి ఆనంద్ నోట నీరూరించాడు. అతను చెప్పిన దాంట్లో నిజమెంతో, అబద్ధమెంతో ఆనంద్‌కి తెలియదు. అతను ఆలోచించాలనుకోడు కూడా. మహేష్ చెప్పినదంతా అతను కావాలనే నమ్ముతాడు. అలా నమ్మడంలో ఒక సుఖం, థ్రిల్లు వున్నాయి. మహేష్ కూడా ఏ అపరాధభావమూ లేకుండా ఇదేజీవితం, జీవితమంటే ఇలాగే... ఇదే సుఖం...జీవితంలో ఇంతకుమించిన ఎక్సైట్‌మెంట్ మరేమీలేదు అనే ధోరణిలో మాట్లాడతాడు. సుధ, శీల దగ్గరలేకపోతే వాళ్ళిద్దరూ తమతమ జీవితాల్లోని అన్ని వ్యవహారాల గురించి మాట్లాడుకుంటారు. తన కాలేజీ విద్యార్థి జీవితంలో తన ఆకర్షక రూపాన్ని చూసి మాయలో పడ్డ ఆడపిల్లలకి లెక్కలేదు.

ఏభైమంది ఆడపిల్లల్ని ఎంజాయ్ చేసానని ఆనంద్ అంటే, నూట ఏభైమందిని ఫినిష్ చేసానని మహేష్ అంటాడు. అయితే వాళ్ళెవరే, ఏమిటో పేర్లు చెప్పడంగాని, చూపించడంగాని చెయ్యడు ఆనంద్. మహేషయినా హాలీవుడ్ తారపేరు, నైరోబీ సుందరీమణుల కొందరిపేర్లు చెబుతాడు. కాని వాళ్ళెవరో ఆనంద్‌కేమాత్రం తెలియదు.

ఆనంద్ చెప్పినదంతా మహేష్ వెళ్ళి తన భార్య చెవిలో వూదుతాడు. శీలా మళ్ళీ అదంతా తెచ్చి సుధ ముందు పరుస్తుంది. కాని నోటివెంట ఒక్కమాటయినా బయటికి రావడం అసాధ్యం. సుధ నేలని కరచుకుని విస్తరించే పాదయితే, శీలా గగనంలో విహరించే విహంగంలాంటిది. తన భర్త గురించి ఏం తెలిసినా సుధ లోపల్లోపల దాచేసుకుని ఏమీ ఎరుగనిదానిలా నటిస్తూ కాపురం చేస్తుంది. ఆమెకి అది తప్పనిసరి. మహేష్ గురించి సుధకి తెలిసినదానికంటే శీలాకి ఎక్కువగానే తెలుసు. అయినా నాకు దాన్తో ఏమీ లెక్కలేదన్న ధోరణిలో భర్తపట్ల నడుచుకుంటుంది. అందువల్ల వారిద్దరిమధ్య సంపూర్ణ సామరస్యం వుంది. వారిద్దరి సంబంధంలోనూ సంతోషం వుంది, థ్రిల్ వుంది. ఇద్దరూ రాజారాణీల్లాగా వుంటారు. బహుశః సుఖంగా వుండేవాళ్ళంతా, పొలంపన్లు చేసుకునే పాలేళ్ళయినా, నగరంలో జీవించే నాగరికులయినా బతికేదీ, బతకాల్సింది ఇలాగే కాబోలు అనుకుంటుంది సుధ. కాని అలావుండటం ఆమెకి చేతకాదు.

శీలాకి, సుధకి పోలికల్లేవు. అయినా శీల భర్త పాడు అంటే పాడుతుంది, ఆడు అంటే ఆడుతుంది. అలా చేసి అతనిని గెలుచుకుంటుంది. తనకి తన భర్త దేవుడు. తను అతడి దేవకాంత అన్నట్టుంటుంది ఆమె ధోరణి. పదిమందున్నా కూడా భర్త దగ్గర ముద్దులు గునవడం అలవాటైన మనసు ఆమెది. బొంబాయి కాన్వెంటులో చదివి, సోషల్‌స్టడీస్‌లో ఎం.ఎ. చేసి అందరిలోకీ ఫార్వర్డ్ అనిపించుకున్నదామె.

మహేష్ హాలీవుడ్ సుందరి గురించి చెప్పినకథ ఒకరోజు ఆనంద్ శీలాకి చెప్పేసాడు. ఆనంద్, శీలా అలాంటి విషయాల్ని విచ్చలవిడిగా చర్చించేటంత ముదిరిపోయారు. ఇందులో వాళ్ళకేమీ తప్పుగా అనిపించదు కూడా. శీలాని చూస్తే ఆనంద్‌కి ఒళ్ళు తెలియదు. ఆమె కంటే పదిరెట్లు అందమైనదైన తన భార్యని కూడా మర్చిపోతాడు. శీలా కేవలం ఆడదికాదు. ఆమె ఒక ఆడ కళాకారిణి. సెక్స్ అపీల్ ప్రాణం పోసుకున్న బొమ్మ. ఆమె నడక, మాట, నిలబడ్డం, కూర్చోవడం, నవ్వడం ప్రతీదీ ప్రత్యేకంగానే వుంటుంది. ప్రతీదాన్ని ఆమె తీర్చిదిద్దుకుని పరిపూర్ణతకి తెచ్చుకుంది. అన్నీ అలావుంచి, ఆవిడ ముంగురుల్ని వెనక్కి సర్దుకునే భంగిమ మహా ఆకర్షణీయంగా వుంటుంది. తన భార్య అలా వుండటంపట్ల మహేష్‌కి చాలా గర్వం. తన భార్య అనే కళాకోవిదురాలి గురించి అతనికి గర్వం. స్త్రీ స్త్రీలాగ, భార్యలాగ వుండటం అనేది ఒక కళ. తన భార్య చూపరుల నోట నీరూరించేలా వుండాలన్నది అతని వాంఛ. అతని కోరికకి తగ్గట్టే వుంటుంది శీలా. ఫ్యాషన్ పెరేడ్‌లో, అడ్వర్టయిజ్‌మెంట్లలో, సినిమా తెరపైన ఆడవాళ్లని చూసి మగవాడు ఏమేం కలలుకంటాడో, ఆ కలలకి ప్రతిరూపంలా వుటుంది శీలా.

అలాగని శీలా నీతిమాలినది మాత్రం కాదు. ఒకసారెప్పుడో ఒళ్లుతెలీని స్థితిలో ఆమె ఒంటిమీద అసభ్యంగా చెయ్యివెయ్యబోయిన ఆనంద్‌కి శృంగభంగమయింది.

"డోన్ట్‌బి ఎ ఫూల్! యుమస్ట్‌నో హౌటు కంట్రోల్ యువర్ ఎమోషన్స్" అని చీవాట్లు వేసి అతను క్షమాపణ కోరేటట్లుచేసింది. "ఏం చేసినా, పశ్చాత్తాపానికి కారణం అయ్యే పనులు మాత్రం చేయకూడదు" అని మందలించి వదిలేసింది.

మహేష్ ప్రేమించే వస్తువులు ఈ ప్రపంచంలో మూడే మూడున్నాయి. డబ్బు, శీలా, కొడుకు శైలేష్ అంతే. శీలాకీ మూడే ప్రాణం. ఆ మూడూకాక మరో ఫ్యాన్సీ వుంది. అది - 'పింకు'. అదొక చిన్న కుక్కపిల్ల. పిల్లిలావుండే కుక్కపిల్ల. ఒకటి చచ్చిపోతే ఇంకొకటి, అది చచ్చిపోతే మరొకటి. మొత్తమ్మీద ఎప్పుడూ ఒక కుక్కపిల్ల వుండాలి. ఒకటి చచ్చిపోయినందుకెప్పుడూ ఏడవదు. వెంటనే దానిస్థానంలో మరోటి రావల్సిందే. రాకపోతే అనే ప్రశ్నే లేదు.




వచ్చి తీరాలి. మరొకటొచ్చేదాకా ఆవిడ నిద్రపోదు. అంతవరకూ దానిపేరేదయినా సరే, ఆవిడ పెంపకంలోకి రాగానే దానిపేరు పింకు అయిపోతుంది. కుక్కపిల్లలు చస్తాయిగాని, పింకు చావదు.

కాని శీలా అన్నిటికంటే ఎక్కువగా ప్రేమించేది.... తననే. శీలా అనే సెక్స్ సింబల్‌ని, తను ఎంత సెక్సీగా కనిపిస్తే అంత ఇష్టం ఆమెకి. కాలేజిరోజుల్లో ఎవరయినా ఫ్రెండ్స్ "నువ్వివాళ చాలా సెక్సీగా కనిపిస్తున్నావు" అంటే చాలు అమాంతం వాళ్లని వాటేసుకుని ముద్దుపెట్టేసుకొనేది. ఇప్పటికీ, పెళ్లయి ఎనిమిదేళ్లయినా తన సెక్సీ అపియరెన్స్‌ని ఇంప్రూవ్ చేసుకుందుకు ఎక్కువకాలం అద్దం ముందే గడుపుతుంది. కేవలం నలభై నలభై అయిదు కిలోల బరువున్న గడకర్రలా కనిపించే శీలా అంత ఆకర్షణీయంగా తయారవుతుందంటే ఆమె మనోబలం వల్లనే అని చెప్పచ్చు. ఆమె చెక్కిళ్లలోంచి ఎముకలు పొడుచుకొస్తాయి. జబ్బల్లో కండరాలు బొత్తిగా తక్కువగా వుంటాయి. నడుము మరీ బక్కగా వుంటుంది. కళ్లు చుట్టూ రంగు నలుపుకి దగ్గరగా వుంటుంది. గుండెల్ని ఏదో మంత్రశక్తితో నిలబెట్టినట్టుంటుంది. పెదవుల రంగుని దాచడానికి లిప్‌స్టిక్ తప్పదు. ముసుపు డయట్‌చేసేది. ఇప్పుడేం చేసినా అలాగే వుంటుంది. "నేను అమెరికన్ డామ్సెల్‌లా వుంటాను" అంటుంది శీలా. మహేష్‌కూడా అలాగే గొప్పగా చెప్తాడు. కుక్కపిల్ల చచ్చిపోయిన రోజుమాత్రం కొద్దిగా నీరసంగా వుంటుంది. మళ్లీ మామూలే.

ఆమె అలావున్నా మగవాళ్లుమాత్రం ఆమెని చూస్తే వెర్రెక్కకుండా వుండరు.

సుధ సౌందర్యంతో పోలిస్తే శీలా ఎందుకూ పనికిరాదు. ఆడదంటే కంటికి కనిపించే రూపం మాత్రమేకాదు; ఖరీదయిన బట్టలు, నగలు మాత్రమే కాదు; ఎముకలు, మాంసం, జబ్బలు, తొడలు మాత్రమే కాదు; ఆమె 'శక్తి' అన్నా చాలదు. సూర్య శక్తీ కాదు. ఆమె ఒక నది. షి ఈజ్ ఎఫోర్స్.

సుధని కౌగిలించుకుని పడుకోగానే స్త్రీ ఒక నదిలా ఆనంద్ మనసులో ప్రవహిస్తుంది. జమున, మీనాక్షి, శీలా, రీటా, సుమన, ఊర్మిళ, జెస్సీ....

ఆ ప్రవాహంలో అతని మనసు ఒక ఆకులా తేలుతుంది. అతనిని ఏమని అంచనా వెయ్యాలి? ఎవరు అంచనా వెయ్యగలిగే వారు? అసలతన్ని ఆసాంతం చూసిన వారెవరు?

✶ ✶ ✶

తన తండ్రి మరణించడానికి ముందుగా తనకి పెళ్లవకపోయుంటే తను పెళ్లే చేసుకునేది కాదేమో.

సుధ తండ్రి వకీలు. అయితే ఆయన గడించినదేమీ లేదు. స్నేహితుల బలగం ఒకటే ఆయన గడించిన ఆస్తి. ఇల్లు వాకిలి ఏంకట్టుకోలేదు. "ఎవరికోసం ఇల్లు? సుధకి తోడబుట్టినవాళ్లెవరూ లేరు. తను పెళ్లయి వెళ్లిపోతే మాకింక ఏంకావాలి?" అనేవాడు. కట్నంపేరుతో ఆనంద్‌కి ఇచ్చినది ఒక స్టాండర్డ్ కారు. అతను 'అవి కావాలి ఇవి కావాలి' అని పేచీలేంపెట్టలేదు. ఎందుకంటే సుధకి తోడబుట్టినవాళ్లెవరూ లేరుగనుక మామ సంపాదనంతా తనపరమే అవుతుందని ఆశ పెట్టుకున్నాడు. అయితే మామ సంపాదన చిల్లిగవ్వకూడా లేదని అతనికి తెలిసింది మామ పరలోకయాత్ర చేశాకనే.

భర్త పోయాక అత్తగారు రెండు నెలలు మాత్రమే కూతురింట్లో వున్నది. అసలే ఆవిడకి అల్లుడంటే పడదు. అతని ఆశ్రయంలో రోజులు వెళ్లబుచ్చడం కూడా ఆవిడకి ఇష్టం లేదు.

పూనాలో అత్తగారి పేర రెండెకరాల పొలం వుంది. దాన్ని ఆమె అక్క, బావ సాగు చేస్తున్నారు. దాన్ని అమ్మేసి బొంబాయిలో ఒక ఇల్లు కట్టుకోవాలన్నది ఆనంద్ ఆలోచన. ఐదారు లక్షల ఖర్చుతో ప్లాన్‌కూడా సిద్ధంచేసుకున్నాడు.

ఈ ప్రస్తావన వచ్చేవరకు ఆనంద్ అత్తగారి పట్ల ఆదరాభిమానాలతోటే నడచుకున్నాడు. ఆస్తినమ్మడానికి ఆవిడ సిద్ధంగా లేదన్న సంగతి తెలుసుకుని ఆనంద్ ఆవిడని పనికిరాని వస్తువుని చూసినట్టు చూడసాగాడు. అసలే అల్లుడుగారి అంతరంగం గురించి అతడి భార్యకంటే బాగా అర్థంచేసుకున్న ఆవిడ 'నాకింక చచ్చేకాలానికి ఇతని ధర్మభిక్ష

అవసరం లేదు. పుట్టిపెరిగిన గడ్డమీదే ప్రాణా లొదులుతాను' అంటూ పూనా వెళ్లిపోయింది. ఆమెకు తన అక్కతో మంచి అన్యోన్యత వుంది. అదీకాక తన భూమి అక్కడుండటంవల్ల తను ఆమెకి భారం అని అనుకోవలసిన అవసరం లేదు.

ఆమె కూతురితో-

"నేను పోయాక ఆ భూమి నీదే సుధా! అందుకు ఏర్పాటుచేస్తాను. కాని అది నీదిగానే మిగలాలి. నేను దాన్ని అమ్మడానికి ఇప్పటికీ సిద్ధమే. కాని అతను కట్టించే ఇల్లు నీ పేరున వుండాలి" అంది.

"ఎవరిపేరిట వుంటేనేమిటమ్మా" అంది సుధ.

"నీకేమీతెలీదు... నువ్వొట్టి అమాయకురాలివి. ఈ మగవాళ్ళని నమ్మడం కష్టం. ఒకతెని వదిలేసి మరొకతెని కట్టుకోడం మన మగవాళ్ళకి చాలా సులభం. అలాంటిదేమన్నా జరిగితే నువ్వు దిక్కులేనిదానివైపోకూడదు"

అమ్మ చెప్పేది నిజమే. తనని ఆనంద్ ప్రేమగానే చూసుకుంటాడుగాని, అతనికి ష్టంలేనిదేమన్నా జరిగితే అతని అవతారం ఎలా మారిపోతుందో ఆమెకి అనుమానమే. తమ పెళ్ళయి రెండేళ్ళు మాత్రమే అయింది. అప్పటికి, ఆనంద్ ప్రేమలో, ఆదరణలో లోపమేమీలేదు. అయినా ప్రేమకి ద్వేషానికి పెద్ద అంతరమేమీ లేదు. ఒకటి మరొకటిగా ఇట్టే పరివర్తన పొందగలదు-అనడానికి బోలెడు నిదర్శనాలని చూసిందామె.

"నేనేం దిక్కులేకుండా అయిపోను-నాకు ఉద్యోగంవుంది" అంది సుధ.

"అది తిండికి, బట్టకి సరిపోతుందనుకో, రేపు పిల్లా-పావలు పుట్టుకొచ్చాక ఏంచేస్తావు? ఏదో అనుకోని పరిస్థితి రావచ్చు. నువ్వు వేరుగా వుండాల్సొస్తుందనుకో... అలా అవుతుందని, అవాలని అనునుగాని, అయితే? ఈ లోకం బహు చెడ్డది. ఈ రోజుల్లో ఇద్దరి, ముగ్గురి వెంటపడనివాళ్ళు చాలా అరుదు. అందుకని వున్నకాస్త భూమి అమ్మి, దారిలేకుండా చేసుకోదల్చుకోలేదు. అది నా ఒక్కజీవితానికే సంబంధించినది కాదు, నీకూ సంబంధించినదే"

"మీ అమ్మ ఆ భూమిని తను చచ్చేడప్పుడు వెంట పట్టుకుపోతుందా?" అని సుధనడిగాడు ఆనంద్. ఆ మాటలు అత్త వినాలనే వుద్దేశంతో గట్టిగానే అన్నాడు.

మర్నాడే ఆమె పూనాకి ప్రయాణంకట్టింది.

ఆనంద్, సుధతో-

"నువ్వికమీదట అక్కడికి వెళ్ళకూడదు. ఆవిడ ఇక్కడికి రాకూడదు" అన్నాడు.

"ఆవిడ నా తల్లి"

"ఆవిడ నీ తల్లయితే ఈ తేడాలెందుకు? నిన్నొకలా నన్నొకలా చూడ్డం ఎందుకు?"

అదే సుధకి అర్థంకాలేదు.

ఆనంద్ ఒక కారణం చెప్పాడు.

"బహుశః నువ్వింకా తల్లివి కాలేదుకదా? అందువల్ల నేను మరో పెళ్ళి చేసుకుంటానేమోనని మీ అమ్మ వంకరబుద్ధికి తోచివుంటుంది"

సుధ మౌనంగా వూరుకుంది.

తల్లివెళ్ళి ఏడాదయినా సుధ తల్లిని చూడ్డానికి వెళ్ళలేదు. ఆనంద్ రాయిలా కూర్చున్నాడు.

ఒకసారి ఆమె కన్నీళ్ళు పెట్టుకుంటూ కూర్చుంటే అన్నాడు.

"కావాలంటే ఆవిడనేవచ్చి ముద్దుల కూతుర్ని చూసుకెళ్ళమను. నువ్వుమాత్రం వెళ్ళడానికి వీల్లేదు"

కన్న కడుపుమరి! ఒకరోజు రానే వచ్చింది. అయినా తల్లీకూతుళ్ళు కలిసి కూర్చుని ఐదు నిమిషాలు మాట్లాడ్డానికి అవకాశం దొరకలేదు. పొద్దున్నే భార్యాభర్తలిద్దరూ కలిసి వెళ్ళిపోయేవారు. మళ్ళీ మధ్యాహ్నం ఇద్దరూ కలిసే భోజనానికి వచ్చేవారు. సాయంత్రంకూడా ఇద్దరూ కలిసే వచ్చేవారు. ఒక్కతే వెళ్ళిరాడానికి ఆనంద్ అనుమతించడు. ఇంట్లోకూడా అంతే. ఆనంద్ ఎప్పుడేగొంతే వినిపించేటంత దూరంలో వుండేవాడు. రాత్రంతా అమ్మతో మాట్లాడుతూ కూర్చోవాలని కోరిక సుధకి. తల్లికీ అదే కాంక్ష. కాని సుధ ఆనంద్ మంచంలోతప్ప మరెక్కడా పడుకోడానికి వీల్లేదు.

నాలుగురోజులు నరకయాతన అనుభవించి, పోస్లే కంటితోనైనా చూడగలిగానని





ంతోషించి పూనాకి ప్రయాణమయింది సుధ తల్లి.

వెళ్ళేపూట కూతురి చెవిలో,

"భూమి నీపేరిట పెట్టాను సుధా! ఆమాట అతనికి చెప్పు, సంతోషిస్తాడేమో. కాని ఇప్పుడే అది నీకు దక్కదు. నేను మరణించాకనే అది నీదవుతుంది. నేను ఆరోగ్యంగా వుండ టంచూసి అతనికి కడుపు మండుతూవుండ చ్చు. మండితే మండనీ. నేను చచ్చాకయినా అది నీదవుతుందనే ఆశతో నిన్నుబాగా చూసు కుంటాడేమో. నేను దాన్ని అమ్మేస్తానేమోనని మాత్రం బెంగపెట్టుకోవద్దు"

అమ్మకి ఆనంద్ అంటే ఇష్టంలేదు. పైగా అతనంటే ద్వేషం కూడా. అందుకు వేరే కారణాలు ఏవో వుండివుంటాయి. ఆనంద్ గురించి ఏదో ముఖ్యమైన విషయం అమ్మకి తెలిసివుంటుంది అనిపించింది సుధకి.

"ఎలాంటివాడిని పెళ్ళాడావు తల్లీ! దేవుడి లాంటి మనిషి మీ నాన్న. ఇతను చూస్తే నా...ఎందుకులే చెప్పకుండావుంటేనే మంచిది" అని ఆపేసింది తల్లి.

కానీ, నాన్నకెందుకో ఆనంద్ చాలా నచ్చా డు. అతని నయ వినయాలు, వాక్చాతుర్యం అన్నీ ఆయనకి ఆకర్షణీయంగా కని పించాయి. కాని అదంతా హిపాక్రసీ అని తండ్రికి అర్థంకాలేదు. తండ్రికిగాని, తనకిగాని ఆ సంగతి అర్థమయి వుంటే తను ఈ పెళ్ళి చేసుకునేదేకాదు. అదే బాగుండేదేమో అను కుంది సుధ.

ఒక స్త్రీ తన భర్తని అర్థంచేసుకునేది ఎప్ప టికి? పెళ్ళికి ముందు మాట్లాడినా, కలిసి తిరిగినా, అంతెందుకు శరీర సంబంధం వున్నాకూడా అతడి పరిపూర్ణవ్యక్తిత్వం ఆమెకి అర్థమవుతుందా?లేదు. అతను ఏమిటి, ఎటు వంటివాడో అని అర్థమయ్యేది వివాహ బంధంలో ఒప్పందప్రకారం బంధింపబడ్డ తరువాతనే. ఇదొక అసహాయ పరిస్థితి పెళ్ళికా కుండా వ్యక్తిని తెలుసుకోడం కష్టం. పెళ్ళ య్యాక తెలుసుకొని ఉపయోగంలేదు. అందు వల్ల ఈ విషయంలో స్త్రీ అదృష్టంమీద ఆధార పడిందని ఒప్పుకోక తప్పదు.

పరిచితమయినది అపరిచితంగా మారిపో దంచూసి ఇదేరకం ఫినామినా? అని ఆశ్చర్య పోయింది సుధ. ప్రపంచంలో వ్యక్తికి-వ్యక్తికి గల సంబంధంలో ఇటువంటి విచిత్రస్థితి కూడా వుంటుందన్న సంగతి అర్థమయిందా మెకి.

అయితే నాలెడ్జివల్ల ఆమెకేమీ ఉపయో గంలేదు.



ఆనంద్, డాక్టర్ మహేష్, శీలా కబుర్లకి కూర్చుంటే వాళ్ళమధ్య బొమ్మలా కూర్చుంటా న్నేను.

మొట్టమొదట్లో శీలా,

"ఏం సుధా! ఒంట్లో బాగోలేదా?" అని అడిగేది. రాను రాను ఆమెకే అర్థమయింది నా స్వభావం అంతేనని.

కాని పెళ్ళికి ముందు నేనిలా వుండేదాన్నికా దు. ఇదివరకు, పెళ్ళి అనేది మనిషి వ్యక్తిత్వా న్ని ఎలా మార్చేస్తుంది అని ఆశ్చర్యపోయేదా న్ని. అది నాకే జరిగిన తరువాత 'ఇలా' అని తెలిసింది.

ఒక్కోసారి వాళ్ళ అభిప్రాయాలు ఎంత ఛాందసంగా, గుడ్డిగా వుంటాయంటే వాళ్ళని చదువుకున్నవాళ్ళనుకోవాలో, అంతో ఇంతో తెలివితేటలున్న నాగరికులనుకోవాలో, మూర్ఖు లని వదిలివెయ్యాలో తెలియకచాలా కష్టపడ తాను.

ఒక్కోసారి వాళ్ళు తాము చాలా గొప్పవా ళ్ళం అన్న గర్వాన్ని ప్రకటించుకుంటూ వుంటారు. సంఘంయొక్క పై అంతస్థుపై నుంచుని కిందకిచూసి మాట్లాడతారు. వాళ్ళ దృష్టిలో వాళ్ళస్థాయికి 'పైన' ఇంకేమీ లేదు.




లోకంలో మిగతా వ్యక్తుల గురించి వాళ్ళ వ్యాఖ్యానాలు వింటుంటే నాకు ఒళ్ళు మండి పోతుంటుంది. తమకున్న 'ఐ.క్యూ' చాలా గొప్పదని నిరూపించుకునే తాపత్రయంలో వాళ్ళ మాటలు, చూపులు, నడత, తీరు ఎంత కృత్రిమంగా అయిపోతాయో చెప్పలేను. ధ్వని, శైలి, ఉచ్చారణ అన్నీ కృత్రిమంగా తయారవుతాయి. వీరిమధ్యకి ఒక కొత్త మనిషివచ్చాడంటే అతడెంత ప్రతిభాశాలి అయినప్పటికీ దారి-తెన్ను తోచకుండా గింజుకోవలసిందే. ఆ వ్యక్తిని నేలకరిపించడానికి వీళ్ళనేక గిమ్మిక్స్ ఉపయోగిస్తారు. అయ్యో! మానవుడా, నువ్వు కేవలం మానవుడిగా ఎందుకుండలేకపోతున్నావు? అని నా హృదయం ఉడికిపోతుంది. కాని అదంతా నివురుగప్పిన నిప్పులాంటిది అంతే. మౌన ఘోష. దేన్నయినా మార్చవచ్చుగాని చదువుకున్న ఛాందసుల్ని తెలివిగల మూర్ఖుల్ని మార్చలేం-అనే అభిప్రాయానికివచ్చి ఆ నిప్పుమీద మరింత బూడిదని గుమ్మరిస్తాను. మౌనానికి చిరునవ్వుని పైవస్త్రంగా కప్పుతాను.

ఇలా మెల్లమెల్లగా జీవితంవల్లగల ఆశ్చర్యాలు, ఆసక్తులు, నిరీక్షణలూ అన్నీ తగ్గిపోతాయి.

అన్నీ తెలుసుకున్న నా మనసు 'ఫాస్టస్' అవుతుంది. జీవితంవల్ల అన్నివిధాల ఆసక్తి అంతరించిననాకు మిగిలిందేమిటి? కేవలం 'ఫాస్టస్-మెఫిస్టోఫిలిస్' సంబంధం మాత్రమే నేమోననిపిస్తుంది. ఆ మెఫిస్టోఫిలిస్‌ని ఆనంద్ ముఖంలో మాత్రమే కాదు, ఆనంద్ ముఖాన్ని ప్రతిబింబించే సమాజంలో కూడా కనిపెట్టటంతో పిచ్చిపట్టినట్లయింది. ఎక్కడికేనా పారిపోదామా అనిపిస్తుంది.

ఒకరి గురించి ఒకరికి పూర్తిగా తెలియకపోతేనే ఈ సమాజంలో సుఖశాంతులతో బ్రతకడం సాధ్యం అనిపిస్తుంది.

మహేష్ మాటలతో బ్రతికిన రోగులే ఎక్కువ మ ందున్నారేమోననిపిస్తుంది.తన చేతిలో మరణించినవారి మాట అసలతను ఎత్తడు. అతని అనుభవం, హస్తవాసి వీటిగురించి నాకు సందేహమే. కిన్యాలో అతను 'చెప్పిందే రోగం, ఇచ్చినదే మందూ'గా రోజులు గడిచిపోయుంటాయి. అయితే అతనికి తండ్రినుంచి వంశపారంపర్యంగా వచ్చిన మర్యాదీ మాటల



చాతుర్యంతో సగం రోగాన్ని నయంచేయగలడు. నయం చేయలేకపోయినా బిల్లు వసూలు చేయగలడు-అన్నసంగతి మాత్రం ఖాయం.

ఒకసారి నేను నలతగా పడుకున్నాను. ఫ్లూ అయ్యుండచ్చు అనుకున్నాను. ఆనంద్ వెళ్ళి డాక్టర్ మహేష్‌ని తీసుకొచ్చాడు.

మహేష్ పరీక్షచేసి ఏకంగా నాలుగైదు మందులు రాసిచ్చాడు. "ఒకటి విటమిన్, మరోటి నొప్పులు తగ్గడానికి, ఇంకోటి ఏంటిబయోటిక్, ఆఖరిది బలానికి టానిక్' అని చెప్పాడు.

రెండురోజులు ఆ మాత్రల్ని మింగినా నాలో లేచినుంచోడానిక్కూడా ఓపిక రాలేదు. ఏమయినాకాని నేను మందువేసుకోడం పూర్తిగా మానేసి "వేసుకుంటూనే వున్నాను" అని ఆనంద్‌కీ, మహేష్‌కీ అబద్ధంచెప్పాను.

నేను కొంచెం కోలుకుంటుండగా ఒకరోజు మధ్యాహ్నం మూడు గంటల వేళప్పుడు మహేష్ వచ్చాడు. ఆనంద్ లేని సమయం. నేను పడుకుని వున్నాను. బెల్లు విని లేచి వెళ్ళి తలుపు తీసి నుంచోడానికి ఓపికలేక మళ్ళీ పడుకున్నాను.

"వాటీజ్ ది మేటర్ విత్ యు? యు లుక్ వెరీ వీక్' అని కంగారు పడుతూ మహేష్ వచ్చి నా కనురెప్పలు విడదీసి చూశాడు. "యు ఆర్ ఎనిమిక్' అన్నాడు. టెంపరేచర్ వుందా? అని నా నుదురు ముట్టి అడిగాడు.

"లేదు" అన్నాను.

అతను మంచం పక్కనున్న స్టూల్‌మీద కూర్చుని నా నాడిని పరీక్షించాడు. నాలుక జాపి చూపించమన్నాడు. తరువాత స్టెతస్కోప్ తగిలించుకుని నాపై దుప్పటి తొలగించి చాలా ఏకాగ్రతగా నా గుండె చప్పుళ్ళని పరీక్షించసాగాడు. నేను బ్రా వేసుకోలేదు. వదులుగా వున్న జాకెట్టు తొడుకున్నాను. అతను స్టెతస్కోపుని రొమ్ములమీద పెట్టి, రొమ్ముల మధ్యపెట్టి, రొమ్ముల అడుగున పెట్టి రకరకాలుగా పరీక్షించాడు.

నేను దవడ ఎముకలు కరచిపట్టి మౌనంగా వున్నాను. అతని పరీక్ష చాలా శ్రద్ధగా సాగింది.

అతని పరీక్ష పూర్తయ్యాక "హయ్యో! మగవాడా?" అని మూల్గింది నా హృదయం.

"ఎవ్రీతింగ్ ఈజ్ ఓకే, అవే మందుల్ని తీసుకోండి. రెండ్రోజుల్లో అంతా సర్దుకుంటుంది" అన్నాడు.

నేను వూరికే తలూపాను.

అతని పరీక్షలోని విశిష్టత స్పష్టంగా అర్థమైంది. అతనికి తీవ్రమైన వుద్దేశాలేం లేవు. ఎందుకంటే నేను సగం పీనుగలాగున్న విషయం కళ్ళకి కనిపిస్తూనే వుంది. మహేష్ తెలివయినవాడు. కేడీ అన్నా తప్పు లేదు. అతను తప్పటడుగు వెయ్యడు. అతనికి పెద్ద 'కాంక్ష' ఏమీ లేదు. కొద్దిపాటి చాపల్యం. కేవలం లాలన అంతే. ఉట్టిలాలన అంత అపాయకారి కాదు. చాలామంది మగవాళ్ళింతే నన్న సంగతి నాకు తెలుసు. భార్య అప్సరస అయినా సరే, పరాయి ఆడవాళ్ళ సగం తొలగిన పయిట చాటు అందాలు, సగం సగం తొంగి చూసే పొట్టలు వాళ్ళకి ఎక్కువ అందంగా కనిపిస్తాయి. ఈ సంగతి అందరు ఆడవాళ్ళకీ తెలుసు. అందుకే వాళ్ళూ రకరకాల వేషాలు వేస్తారు. అందులో ఇతరులూ తమ అందాన్ని చూడాలన్న కోరిక వుంటుంది. తమాషా ఏమిటంటే కొందరు మగవాళ్ళూ తమ భార్యలు ఆ విధంగా అలంకరించుకోవాలని కోరుకుంటారు. నేనూ కొన్ని కొన్ని సార్లు సగం సగం ఒళ్ళు కనపడేలాంటి బట్టలు తొడుగుతాను. నాకు ఇష్టమైకాదు, ఆనంద్‌కి ఇష్టమని. ఎవరయినా నన్ను మెప్పుదలగా చూస్తే ఆనంద్‌కి సంతోషం.

అలాగని ఎవరయినా నా ఒంటిమీద చెయ్యేస్తే వాళ్ళని ఖూనీ చేసినా చెయ్యగలడు. అది వీలవకపోతే ఆత్మహత్య అయినా చేసుకుంటాడు.

నల్లూరులో నన్ను నెత్తిన కొంగుతో దాచిన మనిషే బొంబాయిలో నేను బొడ్డు కిందకి చీరకట్టినా, సగం వీపు కనిపించేలా, స్తనాగ్రాలు స్పష్టమయ్యేలా జాకెట్లు తొడుకున్నా ఆనందిస్తాడు, మెచ్చుకుంటాడు అంటే అంతా నమ్మరు కాని ఆ మాట నిజం. మనిషి విరోధాభాసాల బురద గుంట.

నాకు అలా ఒళ్ళు చూపించుకోవాలన్న కోరిక లేదు. చాలామందిలో ఆ కోరిక





వుంటుందన్న సంగతి నాకు తెలుసు. నేను ఆనంద్ కోరిక ప్రకారం నడుచుకుంటున్నానంతే. ఈమధ్య నాకెలాంటి బట్టలు కట్టుకున్నానా అన్న ధ్యాసే వుండదు. దేహం మీద మోహం పోతుంటే బట్టల ప్రాధాన్యతే ముంటుంది గనుక!

మహేష్ నన్ను ఆ విధంగా పరీక్షించేటప్పుడు అతని మనసేవిధంగా వుంటుంతో నాకు తెలుసు. ఏమయినా నాకెటువంటి వికారమూ లేదు. అతన్ని వల్ల నాకు ఏ భయమూ లేదు. ఎందుకంటే అతను ఆనంద్ లాంటి మనిషి కాదు. నేనతన్ని కోరుకుంటేనే అతను మీద పడతాడు గాని, తనంతట తను పైనబడి లోకువ అవడన్న సంగతి నాకు తెలుసు. ఒకవేళ నేనేమన్నా అతన్ని మీదకు లాక్కుంటే ఆ సంగతి శీలాకి గొప్పగా చెప్పకుండా వుంటాడనడానికి లేదు. అటువంటి మర్మంలేని మనసతనిది. శీలా కూడా దాపరికం లేని మనిషే.

అలా దాపరికం లేకుండా వుండాలని నాకూ అనిపిస్తుంది. కాని ఏదో అవరోధం, అది భయం అని చెప్పలేను. ఒక రకమైన నియమం అంతే. ఆ కోరిక కాంక్ష కాదు. ఇప్పటికీ సజీవంగా వున్నటువంటి ఒక చిన్న స్పందన. ఎన్నోసార్లు అమ్మ దగ్గరో, నాన్న దగ్గరో వున్నప్పుడు ఏదన్నా చిన్న బాధ కలిగి హృదయం గిజగిజలాడినప్పుడు వాళ్ళు నన్నొక్కసారి దగ్గరికి తీసుకోకూడదా అనిపిస్తుండేది. అంత ముద్దుగా నన్ను పెంచి పెద్ద చేసిన నాన్న నన్ను దగ్గరికి తీసుకున్న గుర్తే నాకు లేదు. సుమారు ఏడేళ్ళ తరువాత అమ్మ కూడా దగ్గరకి తీసుకోడం మానేసింది.

ఆనంద్ నన్ను వెయ్యిసార్లు కౌగలించుకుని వుండచ్చు కాని దానిని 'ఆలింగనం' అనలేను. కొన్నిసార్లు పెద్ద పెద్ద బండల్ని చూసినప్పుడు వాటిని కౌగిలించుకోవాలని అనిపిస్తుంది. కొన్నిసార్లు ఈ 'కౌగిలి' కావాలన్న తపన ఎంత తీవ్రంగా వుంటుందంటే నాకు కళ్ళనీళ్ళు నిండిప్రవహిస్తాయి. నా తలగడని పిండి పిప్పిచేసేస్తాను. కొన్నిసార్లు ఆ తలగడని ఒక పసిపాపలా హృదయానికి అదుముకుంటాను.

అంటే నేను దుఃఖంతో పరితపిస్తున్నానని మాత్రం అనడానికి లేదు. నేను దుఃఖాన్ని దూరంగా వుంచడం నేర్చుకుని చాలా రోజులయింది.

నా క్లాస్‌మేట్ అనేది, "మనసుతో ఎన్నో పనులు చెయ్యగలం కదా? దైహికంగా అవన్నీ చెయ్యలేం అనే కారణం వల్ల దైహిక వ్యవహారం మాత్రం అపవిత్రం, మానసికమైనది అపవిత్రం కాదు అని అర్థమా?"

నేను జవాబు చెప్పలేకపోయాను. "ఈ పవిత్రం అపవిత్రం అనే శబ్దాలు సృష్టించినది అపాధభూతిగాళ్ళ"ని.

ఆనంద్ శీల వొంటిమీద చెయ్యివెయ్యడానికి ప్రయత్నించినప్పుడు శీలా మందలించిన సంగతి తరువాత శీలా నాతో చెప్పింది.

ఆమె తన భర్తతో ఆ విషయం చెప్పినప్పుడు అతను నవ్వి, "మంచి పని చేశావు. నువ్వు సంస్కారం వున్న దానివి గనుక రచ్చ చేయలేదు. ఇలాంటి విషయాల్లో రచ్చకెక్కకూడదు. మగవాడికి బుద్ధి చెప్పి వూరుకోవాలి. గొడవ చేసి నలుగురికీ ప్రచారం చేసే ఆడవాళ్ళు వాళ్ళేదో చాలా అందమైన వాళ్ళని, ఆకర్షణీయంగా వున్నారనీ కోరికుండే వాళ్ళన్నమాట. కొంతమంది అలా చెప్పుకోడం కోసం లేనిపోని కథలల్లుతారు. అని చెప్పి అయితే ఈ ఆనంద్‌కి ఓసారి పాఠం చెప్పాల్సిందే అన్నాడు. "ఏం పాఠం?" అని శీలా అడిగింది. "తరువాత చెప్తాలే. అతనిది బొత్తిగా ఆడహృదయం అన్న సంగతి నీకు తెలుసు కదా, జన్మలో మర్చిపోడానికి వీల్లేకుండా బుద్ధి చెప్తాను" అన్నాడు డాక్టర్ మహేష్.

ఓ రోజు ఆనంద్ డాక్టర్ మహేష్ క్లినిక్‌కి వెళ్ళినప్పుడు మహేష్ అతనితో గుట్టుగా "ఆపరేషన్ ఎలా జరుగుతుందో చూడాలని సరదాగా వుందా?" అనడిగాడు.

"అవునవును నేనింత వరకు చూడనేలేదు. ఎలాంటి ఆపరేషన్?" అనడిగాడు ఆనంద్

"రా చూపిస్తాను అని ఆనంద్‌ని లోపలి గదిలోకి తీసికెళ్ళాడు. "మజాగా వుంటుంది చూడు" అని ఒక ఓవర్ కోట్ తొడిగి, ముఖానికి మాస్క్ కట్టి అతన్ని ఆపరేషన్ రూమ్‌కి తీసికెళ్ళాడు.

ఎత్తు ఎక్కువగా లేని ఆపరేషన్ టేబు[ల్] మీద ఒక పాతికేళ్ళ యువతి పడుకుని వుంది.

ఆమె సౌందర్యం అద్భుతంగా వుంది. పాలనురగ వంటి శరీర వర్ణం, గుండ్రటి ముఖం చిత్తూరు పద్మినిని గుర్తుకు తెచ్చేలా వుంది. ఆమె కళ్ళు - కనుబొమలు వాటి అందమే అందం. ఆమె వెల్లికిలా పడుకున్నా ఆమె స్తనాలు పాలరాతితో చెక్కారేమో అన్నంత స్థిరంగా నిలబడ్డాయి.

ఆమె చీర గోడకున్న మేకుకి వేలాడుతోంది.

ముఖానికి తెల్లటి బట్ట కట్టుకున్న నర్సు ఒకామె రెడీగా నుంచుంది.

"అంతా రెడీనా?" మహేష్ అడిగాడు.

ఆమె తలూపింది.

మహేష్ ఆ స్త్రీ ఒంటిమీద కప్పిన దుప్పటి తీసేశాడు.

నడుము కిందకి బట్టలేమీ లేవు. లంగా పైకి సర్ది వుంచారు.

దంతపు రంగులో ఆకర్షణీయంగా, నిండుగా వున్న తొడలు ఎంతందంగా వున్నాయంటే, కటి భాగంలోని నల్లని రోమరాశి ఆ దంతపు రంగుకి కళనిచ్చాయి. మహేష్ దుప్పటి తొలగించిన మరుక్షణంలోనే ఈ అందం చూసి ఆనంద్ తలకి మత్తెక్కి తల గిర్రున తిరిగింది. అతను మంత్రముగ్ధుడై ఆ దృశ్యాన్ని చూస్తూ నుంచుండిపోయాడు. మహేష్ ఆనంద్ చెవిలో గుసగుసగా "ఎలా వుంది?" అనడిగాడు.

ఆనంద్ దేహంలో కామజ్వాల భగ్గుమంది.

మహేష్ నర్సుకి సైగ చేసాడు. పైన అతి కాంతివంతమైన లైటు వెలిగింది. వెంటనే మహేష్ చేతులకి రబ్బరు తొడుగుల్ని తొడుకున్నాడు. ఆ స్త్రీ తొడల్ని ఎడంగా చేశాడు. ఒక చిన్న ఇన్‌స్ట్రుమెంట్ పట్టుకున్న అతని కుడిచెయ్యి సుమారు ఏడెనిమిది అంగుళాల కంటె ఎక్కువగా ఆమె యోని ద్వారం లోపలికి చొచ్చుకు పోయింది. ఆ యువతి కొద్దిగా మూలిగింది. ఆమె నడుము కదల్చకుండా నర్సు ఆమె తొడల్ని నొక్కి పట్టుకుంది.

రెండు నిమిషాల్లో మహేష్ చెయ్యి బయటకి వచ్చింది. అతని చేతిలో బత్తాయి పండు పరిమాణంలో ఒక రక్తపు ముద్ద. తెల్లటి తొడల మీద రక్తం చిమ్మింది. మరుక్షణంలో ఆమె గర్భద్వారం నుండి రక్తం ధారగా ప్రవహించింది.

ఆనంద్‌కి వాంతి వచ్చినట్లయింది. అతను ఈ దృశ్యాన్ని చూడలేకపోయాడు. అతని వేపొకసారి చూసిన మహేష్‌కి ఇంక అతను స్పృహ తప్పి పడిపోతాడేమోనని అనుమానం వచ్చింది వెంటనే...

"అక్కడికి వెళ్ళి కూర్చో" అని పంపించేశాడు.

ఆనంద్ ప్రక్కనున్న గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. అతని నుదుటి నిండా చెమట బిందువులు. గొంతు ఎండిపోయింది. శరీరం సూక్ష్మంగా కంపిస్తోంది.

మహేష్ ఆపరేషన్ పూర్తిచేసి వచ్చేసరికి ఆనంద్ కేన్‌చెయిర్‌లో సోలిపోయి పడుకున్నాడు. అతనింకా షాక్ నుంచి తేరుకోలేదని అర్థమైంది మహేష్‌కి.

మహేష్ మాస్క్ తీస్తూ "ఎబార్షన్. నాలుగు నెలలు. భర్త అమెరికాలో వున్నాడట" అన్నాడు.

ఆనంద్ మాట్లాడలేదు.

"ఎంత లేదన్నా రోజుకి నాలుగైదు కేసులిలాంటివే వస్తూంటాయి. నాకివన్నీ రొటీన్ అయిపోయాయి. రక్తము కనిపించదు. పిండము కనిపించదు. కాని శీలాకి ఒకసారి ఆరవ నెలలో మిస్‌కేరేజ్ అయినప్పుడు అప్పటి పరిస్థితి మాత్రం టెరిబుల్, నాలుగు నెలల పాటు తన దగ్గరికి చేరలేకపోయాను"

అప్పుడు ఆనంద్ మౌనంగా వుండిపోయాడు.

మహేష్ నవ్వుతూ "కమాన్, కమాన్, ఫర్గెటిట్" అంటూ ఫ్రిజ్ తెరచి రెండు పెగ్గుల విస్కీ రెడీ చేసి ఒకటి ఆనంద్‌కిచ్చి ఒకటి తను తీసుకున్నాడు.

"నిజానికి, నీకు మరో స్త్రీ రొమ్ములు, తొడలు చూస్తే కామోద్రేకం కలగడమనేదుంది చూశావ్, అదొక భోళాతనం. ఇదిగో, నీకు నీ భార్యని చూసి ఉద్రేకం పొందడం చేతకాదు. అటువంటి పరిజ్ఞానం నీలోలేదు. మళ్ళీ మళ్ళీ ఆలోచనకి పదును పెట్టి నూతనపరచే కళ నీలో లేదని అర్థం. ఇప్పుడు నువ్వే చూశావు కదా. శీలాదయినా, సుధదయినా, ఎవరిదయినా





ఇంతే. నువ్వు శీలాని చూసి పిచ్చివాడవడం మూర్ఖత్వం. ఆడదాన్ని చూసి మతి పోగొట్టుకుని మీదపడదామనుకునే మగవాడు ఒక్క నిమిషం ఆలోచిస్తే ఆపని చెయ్యడు"

ఆనంద్ నేల చూపులు చూస్తూ మూగవాడిలా కూర్చున్నాడు.

మహేష్ చిరునవ్వు నవ్వుతూ

"ఐ థింక్ యుహావ్ లర్న్‌డ్ సమ్‌థింగ్ టుడే" అన్నాడు.

"ఐయామ్ సారీ ఎబౌట్ దట్ ఇన్సిడెంట్" ఆనంద్ అన్నాడు.

"ఫరవాలేదు...నేనేం దాన్ని మహాఘోరమైన అపరాధం అనుకోనులే. కాని నీకో సంగతి చెప్పాలి. నువ్వు ఆ క్షణంలో ఏంచూసి వెర్రెక్కావో, దాన్ని రోజూ చూసి వెర్రెక్కే అవకాశం వుంది నీకు. సుధ కూడా ఎంతో అందెగత్తె. నీకున్న బుర్రని శుద్ధీకరించాలి. కొత్తగా తయారు చెయ్యాలి".

శీలా చెప్పింది నిజమయ్యే వుంటుంది. ఎందుకంటే నాకు గుర్తున్నట్టుగా సుమారు వారం పదిరోజులపాటు ఆనంద్ నన్ను తాకకుండా తనమానానతను పడుకుని నిద్రపోయేవాడు.

ఒకరోజు నేను అర్ధరాత్రివేళ బాత్రూంకి వెళ్ళివచ్చినపుడు అతను మంచంమీద చిత్రవిచిత్రంగా పొర్లడం గమనించాను. మొహం వికారంగా పెట్టి ఏదో విచిత్రమైన భావాన్ని వ్యక్తంచేయడం కనిపించింది.

నేను అతన్ని చాలాసార్లు పిలిచి లేపాక "రక్తం రక్తం" అని అరుస్తూ లేచి కూర్చున్నాడు.

అతనికి కలవచ్చి వుంటుంది అనుకున్నాను.

"కలొచ్చిందా?" అనడిగాను.

అతను కళ్ళు రుద్దుకుని-

"ఊఁ... పీడకల" అని నన్ను వాటేసుకున్నాడు.

నేను ట్యూబ్‌లైట్ ఆర్పేసి, జీరోవాట్ బల్బ్ ఆన్ చేశాను.

"అదీ వద్దు, ఆర్పెయ్" అన్నాడు.

అతనికి చీకట్లో పడుకోవడం అలవాటులేదు. బెడ్‌లైట్‌ని ఆర్పడానికి ఎప్పుడూ ఒప్పుకోడు.

-నిద్రకయినా సరే, ప్రణయకేళికయినా సరే.

నేను ఆశ్చర్యపోయి దీపం ఆర్పేసి పడుకున్నాను. అతని వికారమయిన మొహం కళ్ళ ముందు నిలచి, 'రక్తం రక్తం' అని అరచిన విచిత్ర ధ్వని చెవులకి వినిపించి ఒంట్లో చలి వచ్చినట్టయిపోయింది. పళ్ళు కరచిపెట్టి, కళ్ళుమూసుకుని పడుకున్నాను. ఐదు నిమిషాల తరువాత ఆనంద్ చెయ్యి నాఒంటిమీద పడగానే, అదిరిపడి కెవ్వుమని అరవబోయాను. నేను అన్నీ మరచి మెల్లమెల్లగా నిద్ర పట్టించుకుంటున్న సమయంలో అతని స్పర్శ అంత భయం రేకెత్తించింది నాలో.

అయితే అది స్పర్శతో ఆగలేదు. చేతులు నాబట్టల్ని తొలగించ సాగాయి.

ఆక్షణం... ఒక్కక్షణం నాకు ఆత్మహత్య ఎక్కువ సుఖమైనదిగా అనిపించింది.

నేను రాయినై, మానునై కాదంటే శవాన్నై పడుకున్నాను. నాకేం జరగటం లేదు. అనలిది నేనుకాదు అనుకుని పడుకున్నాను.

అదొకరకమైన యోగం కాక మరేమిటి?

ఒక వ్యక్తి యొక్క వ్యక్తిత్వం ఎలా రూపొందగలుగుతుంది, అందులో అతని సంస్కారం ఎంతభాగం, అతని పరిసరాల ప్రభావం ఎంత భాగం అయివుంటుంది? అని ఆశ్చర్యంగా వుంటుంది నాకు. డాక్టర్ మహేష్ ఎందుకలా వుంటాడు, ఆనంద్ ఎందుకిలా వుంటాడు, శీలా, నేను అందరం ఎందుకిలా అయ్యాం అన్నసంగతి తెలుసుకుందికి సాధ్యమయితే! సాధ్యమయితే మనిషి స్వభావంలోని వైచిత్ర్యాన్ని ప్రేరేపించే అంశాల గురించి తెలుసుకోగలుగుతాం. ఈ మనుషుల విచిత్ర ప్రవర్తనకి కారణం? పిచ్చి, భ్రమ, కోతిచేష్ట... ఇలా ఏదో ఒకటి చెప్పుకుని వూరుకోవల్సొస్తుంది.

రాకేష్ అన్నట్టుగా "మనిషి తను 'ఏది' అని తన భావనలో వూహించుకుంటాడో ఆ విధంగానే తయారవుతాడు. ఆ భావనల ప్రకారమే ప్రవర్తిస్తాడు" ఈ అభిప్రాయం సరి

అయినదవునో కాదో నాకు తెలియదు.

ఆనంద్ మహేష్‌కి ఒక కథ చెప్పాడని శీలా నాతో చెప్పింది. దాని ప్రకారం:

ఒకరోజు ఆనంద్ దార్లో వెళ్తుండగా ఒక అందమైన యువతిని చూసాడట. పెళ్ళికి ముందు ఆ యువతిని చూసినప్పుడల్లా "ఈమే నాభార్య" అని చాలా తీవ్రంగా భావించుకునేవాడట! అదేభావంతో ఆమెని పలుకరించాడట. ఆమెకూడా ఏమొహమాటం లేకుండా చొరవగానే, స్నేహంగానే మాట్లా డిందట. ఆనంద్ ఆమెని తన రూంకి పిలిచా డట. ఆవిడ వచ్చిందట. రాత్రి వాళ్ళిద్దరూ కలసి పడుకున్నారట. మర్నాడు ఉదయమే ఆమె వెళ్ళిపోయిందట. అంతే! ఆ సంబంధం అక్కడితో పూర్తయిందట.

ఈ కథ నిజమై వుండొచ్చా? లేకపోతే వాళ్ళతో తిరిగాను, వీళ్ళనివల్లో వేసుకున్నాను, ఇంకొకరితో క్రీడించాను... అని కోతలు కోసే కొందరు మగవాళ్ళ లక్షణమా? లేకపోతే తానెవరో వేశ్య వెంటపడి ఆమెతో రమించిన కథని ఇలా మార్చి ఎవరో గొప్పింటి స్త్రీ తనవెంట పడ్డట్టుగా చెప్పుకుంటున్నాడా?

అతని స్వభావాన్ని బయటపెట్టే మరో



సంఘటన ఎలా జరిగిందంటే:

నా కొలీగ్ ప్రొఫెసర్ హంసరాజ మెహతా, ఆయన భార్య దార్లో కనిపించారు. నేను, ఆనంద్ ఏదో షాపింగ్ చేసుకొని ఇంటికి బయ ల్దేరాం.

హంసరాజ్ మెహతాగారి శ్రీమతి నా అంత అందగత్తె కాకపోయినా, ఆనంద్ చెప్పినప్ర కారం ఆమెలో 'టెర్రిబుల్ సెక్స్ అప్పీల్' ఉందనుకోవచ్చు. ఆసంగతి నిజమే అయ్యుండొచ్చు. సెక్స్ అప్పీల్ అనేది పురుష డి దృష్టిలో స్త్రీకి, ఒక పురుషుడికీ మరొక పురుషుడికీ, స్త్రీ దృష్టిలో స్త్రీ వేర్వేరుగా కని పిస్తుంది. కాకపోతే ఎందరో అందమైన మగవా ళ్ళు అందవికారంగా వున్న ఆడవాళ్ళవల్ల అనురక్తులెలా అవుతారు? ఇది ప్రకృతిదో లేదా దేవుడనబడే మహత్తర శక్తి విధించిన విధియో అయ్యుండాలి. లేకపోతే అందంగా లేని వాళ్ళ ందరికీ భర్తన్నవాడు దొరక్క సాంఘిక దారు ణాలుఎన్ని జరిగేవో!

హంసరాజ్ మెహతా, వారి శ్రీమతిని నేను, ఆనంద్ కలుసుకున్నప్పుడు ఒక హూటల్‌కు వెళ్లి కాఫీ తాగి మళ్లీ మామా దారుల్లో బయల్దేరే వరకూ మెహతాగారి భార్యమీంచి ఆనంద్ కళ్లు పక్కకితీస్తే ఒట్టు. అతను మాట్లాడిన మాటలన్నీ ఆవిడతోనే అంటే ఉత్ప్రేక్షకాదు. నేను పూర్తిగా మౌనంగా వుండిపోయాను. అది తప్పేకావచ్చు. మెహతాగారికికూడా ఆనంద్ వెకిలితనాన్ని చూసి రోత పుట్టేవుంటుంది. ఆయన భార్య చాలా తెలివిగా ప్రవర్తించింది. ఆనంద్ మొహంలోకి సూటిగా చూస్తూ ఏ సంకోచమూ, వికారమూ లేకుండా నవ్వుతూ మాట్లాడింది. ఆవిడ కళ్లల్లో- అయ్యో... వెర్రి మగవాడా, నీసంగతి నాకు బాగా తెలును- అన్న భావం నేను స్పష్టంగా చదవగలిగాను. మేం మా దారికి మళ్లగానే మా వెనకాలే ఆవిడ 'థూ' అని ఉమ్మేసి వుంటుంది అనుకున్నాను.

ఆరోజు నాకు తిక్కరేగి ఇంటికి రాగానే అతన్నడిగాను.

"మీరు ప్రొఫెసర్‌గారితో బొత్తిగా మాట్లాడనే లేదు. మాట్లాడినదంతా వాళ్లావిడతోటే అయి పోయింది"

ఆనంద్ అన్నాడు-

"షి టెరిబ్లీ ఎట్రాక్టెడ్ మి"

"నాన్సెన్స్... మీరే ఆవిడని పదేపదే మాట ల్లోకి లాగారు. అసలు ఆవిడని చూడ్డం ఇదే మొట్టమొదటిసారికూడా, మీ మాటల చాతు ర్యాన్నంతా ఇప్పుడే ప్రదర్శించుకోవాలా?"

"ఇది కుళ్లుబుద్ధి" ఆనంద్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు. అతనికి నామీద కోపం రావడం అరుదు.

"నాకేం కుళ్లు లేదు, కాని మీ ప్రవర్తన బొత్తిగా బాగా కనపళ్లేదు"

ఆనంద్ జవాబు మళ్లీ పొంతనలేకుండానే వచ్చింది.

"షిహేజ్ టెరిబుల్ సెక్స్ అపీల్"

"ఆమె మరొకరి భార్య"

"సో వాట్"

నాదగ్గర జవాబెక్కడిది?

మౌనంగా వుండిపోయాను.

★ ★ ★

సుధ, ఆనంద్ ఒక రాత్రి బజార్నుంచి బట్ట లవీ కొనుక్కుని ఇంటికి తిరిగి వస్తున్నారు.

ఒక మలుపులో, తాగిన మైకంలో డ్రైవ్ చేస్తున్న మనిషి లారీని జోరుగా తిప్పాడు. దాన్ని తప్పించుకోడానికి కారుని గుంటలోకి దింపాల్సొచ్చింది. కారువెళ్లి ఒక చర్చి కాంపౌండ్‌ని గుద్దింది.

మెలకువ వచ్చేసరికి ఇద్దరూ ఆస్పత్రిలో వున్నారు.

ఇద్దరికీ గట్టి దెబ్బలేం తగల్లేదుగాని, తలకి దెబ్బతగలడం వల్ల ఇద్దరికీ స్పృహ తప్పిందంతే. మొదట సుధకి తెలివొచ్చింది. ఆనంద్‌కి కాస్త గట్టిగానే తగిలింది.

సుధకి మెలకువ రాగానే డాక్టర్-

"ఏం భయపడకండి, ఆనంద్ తలకి చిన్న దెబ్బతగిలిందంతే. పెద్ద సీరియస్సేం కాదు" అన్నారు.

సుధకేమీ భయం వెయ్యలేదు. ఆనంద్ గురించీలేదు, తన గురించీ లేదు. చావాలని కోరికైతే లేదు. చనిపోతే ఆశ్చర్యపోవల్సిందేమీ లేదనుకుంది. జీవితం అంటే ఏమిటో అన్నాళ్ల బతుకులోనూ అర్థమైంది, ఎందుకు బతుకు




తున్నాం? ఇన్నాళ్లు బతికాం నరే, ఇకమీదట ఎలా బతకాలి? ఏ అర్థమూ కనిపించనపుడు ఈ బతుకు సార్థకమేనా?- అనే రకరకాలు ప్రశ్నలు వేసుకుంటూ జవాబులు వెతుక్కుంటూ పడుకుంది. ఏమీ సుఖంగా అనిపించలేదు. తనింత బండబారిపోయిందన్న సంగతి ఆమెకి స్పష్టంగా అర్థమైంది.

చాలాసేపటికి స్పృహ రాగానే ఆనంద్ కంటికి మొట్టమొదట కనిపించిన మనిషి సుధ. అతని ముఖంలో ఆనందం విరజిమ్మింది.

"నీకేమీ అవలేదుకదా సుధా?"

"ఏమీ అవలేదు. చేతులకి, కాళ్లకి ఒకటి రెండు చిన్నచిన్న దెబ్బలు తగిలాయంతే"

"ఇక్కడికెవరు తీసుకొచ్చారు? ఎప్పుడొచ్చాం?"

"నాకు తెలియదు- నాకూ స్పృహ తప్పింది. హాస్పటల్‌కి వచ్చిన కాసేపటికి తెలివొచ్చిందట. ఇంజక్షన్ గుచ్చడంతో తెలిసింది. మీకు తలకేదో కొద్దిగా దెబ్బ తగిలిందంతే అన్నారు. ఎముకలకేం కాలేదట"

అంతలో ఒక డాక్టరు, నర్సు వచ్చారు.

డాక్టర్ ఆనంద్ దగ్గరకొచ్చి-

"ఎలా వున్నారు? డు యూ ఫీల్ ఎనీ అన్‌యూజువల్ పెయిన్ ఎనీవేర్?" అని అడిగారు.

"నథింగ్ అన్ యూజువల్. తలకాయ మాత్రం ఎక్కడో వున్నట్టుంది. అక్కడేమీ ఫీలింగన్నది లేదు"

"అది ఇంజక్షన్ ప్రభావం. దాని గురించేమీ బెంగపడకండి, యువిల్‌బి ఆల్‌రైట్ వెరీ సూన్" అన్నారు డాక్టర్‌గారు

సుధ సహోద్యోగులు, ఆనంద్ సహోద్యోగులు, ఇంకా స్నేహితులు అంతా చూడ్డానికొచ్చారు.

తల్లికి విషయం కబురు పంపాల్సిన అవసరం ఏమీ లేదని సుధ అనుకుంది. తల్లి వచ్చిచేసేది మాత్రం ఏముంది గనుక, అనేది ఆమె అభిప్రాయం.

డాక్టర్ మహేష్, శీలా కూడా వచ్చారు.

సుధ మర్నాడే ఇంటికి వెళ్లిపోవలసింది. అంత కంగారుగా డిశ్చార్జ్ అయి వెళ్లిపోతే ఇంకేమన్నా ఇబ్బందొస్తే కష్టం, నాలుగైదు రోజులుండి 'ఫరవాలేదు' అన్నాక వెళ్లడం మంచిది అన్నాడు.

ఆ నాలుగైదు రోజులు, అదో కొత్త అనుభవం. ఆస్పత్రి గురించికాదు- ఇదివరకొకసారి టైఫాయిడ్‌తో నెలరోజులు ఆస్పత్రిలో వున్న అనుభవం వుందామెకి.

ఆస్పత్రి మామూలేగాని, ఆనంద్ సంగతే కొత్తగా వుంది. మొట్టమొదట్లో అతనేదో భయంతో బిగుసుకుపోయాడు. అప్పుడప్పుడు జ్వరంవచ్చేది. మెదడు ఎక్స్‌రే రిపోర్ట్‌లింకా సిద్ధంకాలేదు. ఆవిషయం గురించి డాక్టరూ ఇంకా ఏమీ చెప్పలేదు. చీఫ్ సర్జన్ లేనిసమయంలో ఆ వివరాలు చెప్పారు. చిన్న డాక్టర్లు ఏమీ ప్రాంబ్లం లేదని చెప్పినా వాళ్లు చిన్న డాక్టర్లు కాబట్టి ఆ మాటలమీద ఆనంద్‌కి నమ్మకం లేదు. మహేష్ చెప్పిన ధైర్యవచనాలేవీ అతని చెవికెక్కలేదు. అతనికి కొద్దిగా జ్వరం వస్తూనేవుంది.

ఆ రెండురోజులూ సుధకి ఆనంద్ వ్యక్తిలా కనిపించాడు. చాలా కుర్రాడిలా అనిపించాడు. అతని డిగ్రీలు, ఉద్యోగం, పెద్దజీతం, హైఇనకమ్‌లుకేవీ కనిపించలేదు. అతని కళ్ళల్లో ప్రాణభయం కనిపించింది. చావడానికి మనిషి ఇంత భయపడతాడా, ఇంత భయపడాలా- అని సుధ ఆశ్చర్యపడింది.

ఒక్కోసారి తనవంక చూసినప్పుడు ఏదో విలక్షణమైనటువంటి వేదనో, మోహమో అతని ముఖంలో వ్యక్తమయ్యేది.

ఆనంద్‌ని అంత బెంబేలెత్తించిన జ్వరం, తలలోని బాధ మూడవరోజు తగ్గుముఖం పట్టింది.

చీఫ్ సర్జన్‌వచ్చి 'నీతలకేమి అవలేదని' స్పష్టంగా చెప్పి ధైర్యం నింపాక ఆనంద్ త్వరగానే కోలుకున్నాడు. ముఖంలో భయం ఛాయలు మాయమయ్యాయి. ఇక సుధ అక్కడేవుండితీరాలన్న భావంకూడా మారింది. సుధ ఎదురుగానే నర్సులతో సరసాలు మొదలుపెట్టాడు. నర్సులు కూడా చనువుతీసుకోడంతో అతనికి తన ఆకర్షణశక్తిమీదున్న



నమ్మకం గట్టిపడసాగింది. తమ యాంత్రిక జీవితంలో ఇలాంటి గండుకోతులకి నర్సులు మనసారా స్వాగతం పలుకుతారు. ఇలాంటి కోతిమూకల గురించి వీళ్ళు తమ డ్యూటీ రూమ్‌లో ఎలా విమర్శించుకుంటారో సుధకి బాగా తెలుసు. ఆనంద్‌కి తెలియదు- అంతే తేడా.

నాలుగైదురోజులుండమని సుధని బలవంతంచేసింది ఆనంద్ కాదు, అతని భయం. అది సుధకోసం కాదు, తన స్వార్థంకోసం అన్న సంగతి తెలిసాక సుధకి నవ్వొచ్చింది. స్వార్థానికికూడా ఎన్నిరకాల ముఖాలు- అనుకుంది.

ఐదవరోజు హాస్పటల్ నుంచి డిశ్చార్జ్ చేయించుకొని ఇంటికి వెళ్ళిపోయింది సుధ. కాఫీ, భోజనం ఇలాంటివి తీసుకుని ఆస్పత్రికి వచ్చేసరికి ఆనంద్ నర్సులమధ్య చుక్కల్లో చంద్రుడిలా మెరిసిపోతుంటే చూసి చూసి-

ఓ వారంరోజుల తరువాత అతన్నడిగింది-

"ఈ నర్సులంతా ఇక్కడెందుకు మూగుతారు?"

"ఐ కాంట్ హెల్ప్ ఇట్" అన్నాడు ఆనంద్.

ఇది అతని ఊతపదం.

అలాంటప్పుడు సుధకి మహాకవి బైరన్ గుర్తొస్తాడు. ఆడవాళ్ళు బైరన్ చుట్టూచేరేవారు. బైరన్ వ్యక్తిత్వపు అందం అలాంటిది.

సమాజం బైరన్‌ని చూసి ప్రశ్నార్థకంగా కళ్ళెగరేస్తే "నేనేం చెయ్యను. వాళ్ళే నా చుట్టూ చేరతారు" అనేవాడు. అది నిజంకూడా.

ఆనంద్ చెప్పేదికూడా అలానేవుంది. కాని ఆనంద్ వ్యక్తిత్వం ఎంతటిది? ఈ లోకం ఎంత గుడ్డిది- అనుకునేది సుధ.

"డాక్టర్ ఆనంద్, యువర్ బ్రెయిన్ ఈజ్ ఎ లిటిల్ డామేజ్డ్"అని, వెంటనే ఆపరేషన్ చేయాలని చీఫ్ సర్జన్ చెబితే ఈ మనిషి ఏమవుతాడు? అనే ఆలోచనరాగానే సుధ ముఖంలో ముసిముసి నవ్వు దోబూచులాడింది. వెంటనే ఆమె మనసు ఘోషించింది. 'మ్యాన్ ఈజ్ ఎ బండిల్ ఆఫ్ ప్యారడాక్సెస్' అని. మనిషి సృష్టే అసంబద్ధం, అసంగతం. ఒకటికొకటి సామ్యంలేని అంశాలతో సృష్టింపబడ్డాడు. అందుకే ఇన్ని దైహిక, మానసిక రోగాలు.

ఆనంద్ ఆరోగ్యంగా తిరిగివచ్చినందుకు, ప్రమాదంలో సుధ, ఆనంద్‌ల ప్రాణాలను భగవంతుడు కాపాడినందుకు మహేష్ ఒక డిన్నర్ ఏర్పాటు చేశాడు. బయటి వాళ్ళెవర్నీ పిలవలేదు. ఆ రెండు కుటుంబాలు మాత్రం... అంతే! ఇది సంతోష విషయమే గాని, హడావుడి చెయ్యాల్సిన విషయమేమీ కాదు. మేము, మీరు వుంటే చాలు- అన్నాడు మహేష్.

సమయం, సందర్భం ఏదైనప్పటికీ చాలా డిన్నరుపార్టీల అఖర్న మద్యాన్ని ఆస్వాదించేటప్పుడు చాలామంది మగవాళ్ళు మాట్లాడేవి లైంగికవిషయాలే.

అలాగే ఆరాత్రి డిన్నర్ పూర్తయి సుమారు పదిగంటలవేళప్పుడు శైలేష్, పింకు నిద్రపోయాక ఆ నలుగురి మధ్యా మళ్ళీ అదే థీమ్.

తను ఆస్పత్రిలో వున్నప్పుడు ఒక స్టాఫ్ నర్సు, మరొక ఆర్డర్లీ మధ్య జరిగిన ప్రేమాయణాన్ని తను కనిపెట్టానని అన్నాడు ఆనంద్.

"అందులో విచిత్రమేముంది?" అడిగాడు మహేష్.

"ఆమె వివాహిత. ఒక బిడ్డ తల్లి" అన్నాడు ఆనంద్.

"చూడు ఆనంద్... ఆడది జారిణీ, పతిత అంటూ అయ్యేదెప్పుడో తెలుసా? రెండే రెండు సందర్భాల్లో. ఒకటి పెళ్ళికి ముందు ఆడది గర్భిణీ అయినప్పుడు, రెండు అపవాదుకి గురి అయినప్పుడూనూ"

"అపవాదు పుట్టిస్తే వస్తే" అడిగింది శీలా.

"నిజమో... అబద్ధమో అపవాదంటూ వచ్చిందంటే మాపలేం. ఆమె 'చెడిపోయినది' అనే సామాజిక ముద్రపడ్డట్టే" అని మహేష్ నవ్వి, "ఈరెండు ఆపదల్లోను చిక్కుకోని ఆడది ఏంచేసినా, ఎంతమందితో సంబంధంపెట్టుకున్నా సామాజికంగా పతితకాదు.

"వాస్తవికంగా పతిత అనేమాటకి సామాజికమైన అర్థంతప్ప, మరో అర్థం లేనేలేదు. అంతా గుట్టుగా జరిగిపోతే ఎంత జారిణీ అయినా పతివ్రతగా కొనసాగుతుంది. కాబట్టి పాపభీతి కూడా ఒక సామాజిక భీతే. దీనివల్ల కలిగే మానసికమైన ఒత్తిడి తప్ప మరేమీ కా

మ. ఎందుకంటే మన వెనుకటిరాజులకి, మహారాజులకి ఈ పాపభీతిలేదు. ఇప్పటికీ బహుపత్నీత్వాన్ని సామాజికంగానే, మతంపేరి టనే అనుసరించేవారివరికీ పాపభీతిలేదు. బహు పత్నీత్వం ఆచరణలో వున్నకాలంలో స్త్రీకి కూడా ఈ పాపభీతి లేదు. లైంగిక నిర్బంధాలులేని అనేక దేశాలున్నాయి. అక్కడ కూడా లైంగిక వ్యవహారాలకి సంబంధించిన తప్పులేమీలేవు. అబద్ధాలు చెప్పినా, దొంగ తనం చేసినా నేరం కావచ్చుకాని ఇది నేరంకా దు" అన్నాడు.

"స్త్రీ మానసికంగానైనా పరపురుషుడివల్ల అనురక్తురాలైతే పతితగానే పరిగణించా లంటుందికదా మతం"

ధర్మం అందరిదీ ఒకటే. అదే వ్యక్తి ధర్మం. జాతి, మతం పైపై వేషం అంతే. ఒక వ్యక్తి తన స్వధర్మం ప్రకారం నడుచుకునేటప్పుడు మరొకరికి బాధ కలుగుతుందంటే అతని ధర్మం లేదా వేషం- వీటికి ఎంత మంచి పేరు తెచ్చినా, ఆ మతగ్రంథాల నుంచి ఎన్ని ధర్మ వాక్యాలని ఉదహరించి చెప్పినా అది తప్పే. లైంగిక వ్యవహారం కూడా జీవితంలో ఒక ముఖ్య విషయం. దీన్ని ఒకడు నడుపుతున్నా డంటే, దానివల్ల మరొకరికి కష్టం కలుగుతోందా అనే విషయాన్ని తప్పనిసరిగా దృష్టిలో వుంచు కోవాలి. ఒక స్త్రీ మానసికంగా ఎవరితోనైనా రమించవచ్చు. ఎవరితోనైనా వ్యభిచరించవ చ్చు. అదే ఆమె శారీరకంగా ఎవరితోనైనా రమిస్తే అప్పుడు చెడ్డదవుతుంది అదీ లోకానికి సాక్ష్యం దొరికితే మాత్రం. ఒక్కోసారి ఈ సాక్ష్యాధా రాలు కూడా అబద్ధాలవుతాయి" అని నవ్వా డు.

"అదెలా?" అడిగాడు ఆనంద్.

మహేష్

"ఒక ఉదాహరణ చెబుతాను. నేనొకసారి నైరోబీ నుంచి టాంజానియా రాజధాని డార్సె లామ్‌కి ప్రయాణం చేస్తుండగా, అడిస్‌అ బాబా నుంచి కనెక్టింగ్ ఫ్లైట్ తప్పిపోయింది. అందువల్ల అడిస్‌అబాబాలో ఒక రాత్రి వుండి పోవాల్సొచ్చింది. ఎకామడేషన్ ఏర్పాటు చేసు కోడానికి ఎయిర్‌లైన్స్ ఆఫీస్‌కి వెళ్ళాను. ఎయిర్‌లైన్స్ ఆఫీసర్ బయటికి వెళ్ళాడంటే అతని రాక కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. నా పక్కకుర్చీలో నల్లని, పొడవాటి నాజూ

కైన సుందరి ఒకామె నన్ను చూసి చిరున వ్వు నవ్వింది. "ఎక్కడికి వెళ్తున్నారని?" అనడి గాను. డార్సెలామ్‌కి అంది. కబుర్లు చెప్పుకో సాగాం. పరిచయం గాఢమైంది. ఆమెకి కూడా కనెక్టింగ్ ఫ్లైట్ దొరక్కపోవడంవల్ల ఆరాత్రి అక్కడే ఆగవలసిన పరిస్థితి. "హోటల్లో ఒక్కతే ఎలా వుండాలని" బెంగపెట్టుకుంది. "అలవాటు లేదు" అంది. "భయపడకండి" అని ధైర్యం చెప్పాను.

"ఒకే హోటల్లో రూమ్ తీసుకుందామా?" అంది.

"ఓకె" అన్నాను.

ఎయిర్‌లైన్స్ అధికారి వచ్చాడు.

"ఇద్దరికీ ఒకే హోటల్లో రూమ్ కావాలి" అన్నాను.

అతను హోటల్ హిల్టన్‌కి ఫోన్ చేశాడు.

" మీ ఇద్దరికీ హిల్టన్‌లో డబుల్ రూం బుక్ చేశాను- వెళ్ళండి" అన్నాడు.

నేను ఆవిడ మొహం చూశాను. భావవి కారం ఏమీ కనిపించలేదు. సరి, ఆ రోజు రాత్రి ఒకేరూమ్‌లో గడిపాము. ఆ అమ్మాయి స్నానం చేసి వచ్చాక, నేను వెళ్ళి స్నానం చేసి వచ్చా ను. భోజనం తెప్పించుకుని తిన్నాం. ఆ అమ్మాయి తన బెడ్డుమీద, నేను నా బెడ్‌మీద పడుకున్నాం. ఆమె నన్ను తాకలేదు, నేనామె ను తాకలేదు" అని మహేష్ ఓ నిమిషం ఆపి-

"అది అడిస్‌అబాబాలో గనుక అలాజరి గింది. మన వూళ్ళల్లో ఎక్కడయినా అయితే మర్నాడు హోటెల్నుంచి బయటికొస్తున్న మమ్మల్నిద్దర్నీ చూసి లోకం ఏమనేది? రంజనీ పటేల్‌ని పతిత, వ్యభిచారిణి, వేశ్య అని తిట్టి పోసేది కదూ? నాకూ అలాంటి విశేషణాల్తో బిరుదులు వచ్చేవికాదూ? నేను అందరి దృ ష్టిలో చెడ్డవాణ్ణయ్యేవాడిని కదా? ఇద్దరూ ఆడ వాళ్ళో లేదా ఇద్దరూ మగవాళ్ళో అయితే లోకానికేమీ జ్వరంరాదు. అదే ఒక ఆడ-మగ అయితే జ్వరం వచ్చేస్తుంది. వాళ్ళిద్దరూ ఒక గదిలో వుంటే చాలు 'ది థింగ్ హ్యాపెన్స్' అనేది లోకం దృష్టిలో సాక్ష్యం అక్కర్లేని నగ్నస



త్యం- ఎస్టాబ్లిష్డ్ ఫ్యాక్ట్!" అని నవ్వి.

ప్రపంచం అంతా ఇలా లేదనుకో. అమెరికా, ఇంగ్లాండ్‌వాళ్ళు ఈ విషయంలో మెచ్యూర్డ్ సొసైటీ కావడంవల్ల ఆడ-మగ స్నేహంగా తిరగడం, ప్రయాణాలు చేయడం సులువుగా జరుగుతోంది. వాళ్ళు జననేంద్రియాల జపం చేస్తూ కూర్చోరు. ఇద్దరాడవాళ్లో, ఇద్దరు మగవాళ్లో కలిసి ఒక గదిలో గడపడం ఎంత సహజంగా జరుగుతుందో ఒక ఆడ-మగ ఒకే గదిలో వుండటం అంతే సహజంగా సాధ్యం అన్న సంగతిని వాళ్ళని చూసి మనం నేర్చుకోవాలి. వాళ్ళకి తల్లి, చెల్లి, అన్నయ్య ఇలాంటి పదాల్ని కృత్రిమంగా వాడవలసిన అవసరం లేదు. ఇలాంటి పరిపక్వత మనదేశంలో ఏ సమాజంలోనూ లేదు. ఈ దేశంలో కొన్ని ప్రాంతాల్లో పల్లెల్నుంచి ఒక ఆడపిల్ల, మగపిల్లవాడు పట్నాలకి చదువు, పరీక్ష, ఉద్యోగం, ఇంటర్వ్యూ అంటూ పట్నాలకి కలిసి బయల్దేరి వెళ్ళి, కలిసి తిరిగివస్తారు. వారి తల్లిదండ్రులూ అనుమతించి పంపిస్తారు. వాళ్ళు రాత్రుళ్ళు ఒకే గదిలో గడపకూడదన్నదొక్కటే నిర్బంధం. అటువంటి సోషల్ సెటప్‌లో ఆడపిల్లలు, మగపిల్లలు కేవలం స్నేహితుల్లా వుండిపోతారు. లైంగిక వ్యవహారాల్లోకి దిగరు. ఎక్కడో ఎక్సెప్షన్స్ వుంటాయనుకో. ఎంతో కట్టుబాట్లున్న సమాజంలో తప్పుడు వ్యవహారాలు జరక్కుండా వుంటాయనడానికిలేదు. జరుగుతూనేవుంటాయి. దానికి స్వేచ్ఛా సమాజమే కావాలనేమీలేదు. ఏమయినా మొత్తం మీద మన సంఘం అమెచ్యూరిటీ దారిలో పయనించడంలేదు. ఆ సమాజం రావాలంటే చాలా గందరగోళం వుంది. నాలుగైదు శతాబ్దాలన్నా గడవాలి. అంతవరకు ఈ సోషియల్ ప్రొఫెలాక్సిస్ రాకతప్పదు"

"అదేమిటి?" ఆనంద్ కుతూహలంగా అడిగాడు.

మహేష్ మాటలు మంచి కేంద్ర స్థానంలో వున్నాయి. అది ఆనంద్‌కి కావాలి. ఎందుకంటే మహేష్ అభిప్రాయాలని బట్టి తన వ్యక్తిత్వపు రూప- విరూపాలని బయల్పరచడం, దాచిపెట్టుకోడం చెయ్యాల్సిన అవసరం వుంది.





మహేష్ చెప్పిన కథలో నిజానిజాల్ని గురించి ఆలోచిస్తోంది సుధ. అతను మరో ఇరవైయేళ్ళ సుందరి ఆవిధంగా ఒకరాత్రిని గడపడం జరిగేదేనా? లేదా అది మహేష్ అల్లిన కథా? అతని నాలుక చాలా చురుకైనది. ఆ కథ అబద్ధమన్నా కావచ్చు, లేదా ఆ రాత్రి వాళ్ళకి కావాల్సినట్టు మజా చేసుకునుండచ్చు. కాని ఒకటిమాత్రం నిజం. ఆ అమ్మాయికి అలాంటి అనక్తి లేదనిపించినా, తను ఏమన్నా చొరవ తీసుకుంటే ప్రతిఘటిస్తుందనిపించినా మహేష్ అలాంటి పిల్లని ముట్టుకోడు. అంత పిరికివాడూ, మంచివాడూ కూడా. అలా కాకుండా ఒక్క ఆహ్వానపు చూపు చూసిందో, ఒక్కఎగురు ఎగిరి ఆమెమీద పడతాడు.

అదే ఆనంద్ అయితేనా అవతలి పిల్లతన్ని తోసి పారేస్తున్నా పుండుమీద ఈగలా రాత్రంతా మీదవాలే ప్రయత్నం చేసేవాడే. ఎంత విచిత్ర వ్యక్తిత్వాలు! కొన్ని విషయాల్లో వాళ్లిద్దరూ ఒకటే. ఇంకొన్ని విషయాల్లో బొత్తిగా భిన్నధృవాలు అనుకుంది. మౌనగౌరిలా కూర్చున్న ఆమె ముఖంలో ఒక చిన్న మెరుపు మెరిసి, ఒక నవ్వు విరిసిందన్న సంగతి గమనించింది శీలా.

అదే, సోషియల్ ప్రొఫిలాక్సిస్ అంటే ఒక మగవాడు పరస్త్రీని తల్లి, చెల్లి అని పిలుస్తూ తనమీద మంచితనపు ముద్రని బలవంతాన వేసుకోడం అన్నమాట. దాన్ని లోకానికి చాటి చూపించడం అన్నమాట. ఆడదికూడా అన్నయ్య, అంకుల్ అంటూ పని సాధించుకుంటుందన్నమాట. ఇక్కడ మనోధర్మం ముఖ్యంకాదు. ఇక్కడ మనసు రోగిష్టిదో, భయగ్రస్తమైనదో కావచ్చు. ఇక్కడ ఉన్నటువంటి సామాజిక వ్యవస్థలోని ప్రిజర్వేషన్‌తో కూడిన వ్యవస్థ విచ్ఛిన్నం కాకుండా వుండాలన్నదే దాని ఆశయం. ఒక వస్తువుని "వేడి, ముట్టుకోవద్దు" అంటే కొంచెంసేపు వూరుకొని ముట్టుకుంటారు. అదే "విషం, తాకద్దు" అంటే ఎవరూ దాని జోలికివెళ్లరు. అందుకే సమాజం చెప్తుంది, "పరస్త్రీని స్నేహితురాలు అనుకొని ఇబ్బందులకి లోనవకండి! తల్లి అనుకుంటే స్థిమితంగా, సుఖంగా వుండచ్చు" అని.

మహేష్ సుదీర్ఘోపన్యాసం ఆపి గట్టిగా నవ్వేశాడు.

వెంటనే శీలా అడిగింది-

"సమాజం సంగతలా వుంచండి. సొసైటీ ఈజ్ ఆల్వేస్ సిక్. వ్యక్తిగత స్థానం ముఖ్యం. అందులోనే దొరుకుతుంది మనశ్శాంతి. సమాజం చెప్పే శాంతిలోకాదు. అది భూతప్రేతాల్ని పూజించి అందులోనే మీకు శాంతి దొరుకుతుందనికూడా చెప్పగలదు. వ్యక్తిగత స్వస్థతని నిర్వహించుకోడం ఎలా?"

ఆనంద్ జవాబు చెప్పబోయాడు.

"అది ఎప్పుడో ఎస్టాబ్లిష్ అయిపోయింది"

"ఏది?"

"భార్యాభర్తల మధ్య సంపూర్ణ విధేయత, అర్పణాభావం"

గట్టిగా నవ్వాలనిపించింది సుధకి. అందులో ఒక సందేహం. ఇది తమాషా డైలాగ్ కాదుకదా అనుకుంది.

కాదు, ఇది ఆషాఢభూతితనం. ఆమాట అబద్ధమని చెప్పేవాళ్లకీ తెలుసు, వినేవాళ్ళకీ తెలుసు. ఇది ఈ సమాజంలో ప్రముఖులు అనిపించుకోగలిగే మనుమల సంప్రదాయ స్థాయికి అద్దంపట్టేలాంటి మాట. సుధ నవ్వుకుంటూ కూర్చుంది-

శీలా అంది.

"అంటే మగవాడు తన భార్యని తప్ప మిగతా స్త్రీలందర్నీ తల్లి, చెల్లిగా భావించాలన్నమాట. అలాగే పిలవాలన్నమాట"

"పిలవడం ముఖ్యంకాదు" అని నవ్వాడు ఆనంద్. మహేష్ కూడా నవ్వి-

"భావించడం ముఖ్యం. ఎంతోమంది దృష్టిలో భావన, పిలుపు ఒకటి కాదు. మనసులో 'లంజకొడకా' అని తిట్టుకుంటున్నా పైకి 'అయ్యా' అని అనరా? అలాగన్నమాట మన సమాజంలో, ఈ సంబోధనలు, వరసలు, ఏకవచన, బహువచనాలు ఒక పెద్దశాపం. ఇతర దేశాల్లో మమ్మీ, డాడీ, ఆంటీ, అంకుల్ అనేలాంటి బహుకొద్ది సంబంధసూచక పదాలుంటాయి. అందరికీ ఒకటే వచనం. పెద్దవాళ్లయినా, చిన్నవాళ్లయినా సమాజంలో అందరినీ ఒకేరకంగా పేరెట్టి పిలుస్తారు. మనలో విద్యార్థి లెక్చరర్ని సర్ అనకుండా మిస్టర్ రావ్ అని పిలిచాడంటే కొంపలంటుకున్నాయన్నమాటే. అమెరికాలో చూడండి. ఒకరు మరొకరికి ఏమవుతారో, ఆ మరొకరు ఒకరికి అదే అవుతారు. భార్య భర్తని పీటర్ అని పిలిచినంత మాత్రాన ఆమెకి భర్తపట్ల గౌరవం లేదని అర్థంకాదు. మన దేశంలో మాత్రమే భార్యకి భర్తపట్ల గౌరవం వుండాలా? ఇంకెక్కడా అక్కర్లేదా? శబ్దం అనేది ఒక నాణెం లాంటిది. దానికి ఒరిజినల్‌గా విలువుండదు. ఆ శబ్దాన్ని దేనికోసం ఉపయోగిస్తామో అదే దాని విలువ"

శీలా అంది-

"అది నిజమే. కాని ఆనంద్ అన్నది అదికాదు. మన భావనే పవిత్రంగా వుండాలని....అదెలా సాధ్యం. తల్లి ఒక్కతే నిజమైన తల్లి కాగలదు. తోడబుట్టిన చెల్లెలే నిజమైన చెల్లికాగలదు. ఇతరుల్ని అలా కృత్రిమంగా భావించుకోవల్సిన అగత్యమేముంది? ఒక ఆడదానికి మరో ఆడదాన్ని అలా భావించుకోవలసిన అగత్యం లేనపుడు మగవాడికి మాత్రం ఎందుకు? ఒక కుర్రాడు ఇంకో కుర్రాడిని అన్నయ్యా అని పిలిస్తే తప్పేడు అర్థంరాదు. ఆడపిల్ల మరో కుర్రవాడిని 'అన్నయ్యా' అని పిలిస్తే తనకి భర్త కావల్సిన కుర్రాడు భర్త కాబోడు అనే అర్థం ధ్వనించేలా వుంటుందా పిలుపు- అని వ్యాఖ్యానించేవాళ్లూ వుంటారు. అందువల్ల మిస్టర్ పీటర్ అనడమే క్షేమం కదా!"

ఆమె ముఖం ఎర్రబడింది. ఆమె కొంచెం ఆవేశంగా వున్నట్టే కనిపించింది.

"ఎందుకో కోపంగా మాట్లాడుతున్నట్టున్నారు. మీకేమన్నా అటువంటి అనుభవం కలిగిందా?" నవ్వుతూ అడిగాడు ఆనంద్!

"ఓ... కావల్సినంత. మనదేశంలో, సమాజంలో తల్లి, చెల్లి అనే పదాల్ని వాడినంత ఘోరంగా మరే పదాల్ని వాడరు. ఈ శబ్దాల్ని వింటేనే ఒక్కోసారి ఒళ్లు మండిపోతుంది. నా దృష్టిలో ఆ శబ్దాలు భయంవల్ల, రోగంవల్ల, ఆషాఢభూతితనంవల్ల పుట్టుకొచ్చినవి. వాటిని సాంప్రదాయపు ఛాయలో అమాయకులైన వ్యక్తులు తమ అమాయకత్వంతో వాడుతూండవచ్చు. ఆ సంగతలా వుంచితే, ఐ డోంట్ లైక్ ఎనీబడీ టూకాల్‌మి మదర్ ఆర్ సిస్టర్. ఐయామ్ షీలా, ఫర్ క్లియర్ ఐడెంటిఫికేషన్, మిసెస్ షీలా" శీలా గట్టిగా నవ్వేసింది. ఆ

నవ్వులో రోషం ప్రజ్వరిల్లడాన్ని అందరూ గమనించారు.

ఆ కోపానికేదో గట్టి కారణమే వుంటుందని అందరికీ స్పష్టమైంది. ఆనంద్ రేడియో స్పీకర్ని చూస్తూ కూర్చున్నాడు.

మహేష్ ఆమె దగ్గరకొచ్చాడు.

"నీమాట నిజమే శీలా. మన సమాజంలోని పెద్ద విపరీతం ఏమిటంటే, ఒక వ్యక్తిని అతనే మిటో ఆవిధంగా గుర్తించడానికి వీలవకపోవడమూ, అలా గుర్తించడానికి వెనకాడ్డమూను మనిషిని అతిగా మర్యాదచేస్తూ స్వామీ, గురూజీ, బాబాజీ, మాతాజీ, తల్లీ, సోదరీ అనే అనేక పదాలు దీనికి నిదర్శనం. అమెరికా, ఇంగ్లాండ్, జపాన్, జర్మనీల్లో చూడు, సమాజంలో అందరూ మిస్టర్, మిసెస్ లేదా మిస్, అంతే. మరి మనలో? లెక్కలేనన్ని బిరుదులు, శ్రీకారాలూను. వుయ్‌డోంట్ వాంట్‌టుసీ ఏన్ ఇండి విడ్యువల్ ఏస్ ఏన్ ఇండివిడ్యువల్. మనకి భయం. స్త్రీని చూడగానే తల్లీ అన్న సంబోధన! ఏకాంతంలో దొరికితే కామోద్రేకం. కొన్నిసార్లు ఈ తల్లి, చెల్లి అన్న పదాలువయోగించి తమ పనిని సానుకూల పరచుకోడం. మీరు పాశ్చాత్యుల్ని ఎంత తిట్టినాసరే, వాళ్ళనుంచి మనం నేర్చుకోవాల్సింది చాలా వుంది. అక్కడ డైవోర్స్‌లు ఎక్కువే కావచ్చు. ఇరవై, పాతికేళ్ళ వైవాహిక జీవనంలో ఈ బలాత్కార బంధనం ఎందుకు? మన దేశానికి స్వాతంత్ర్యం దొరికింది. కాని మన సమాజానికి స్వాతంత్ర్యం దొరకలేదు. మనకి భయాలు ఎక్కువ. భూతప్రేతాలు, తల్లిదండ్రులు, మొగుడూ పెళ్ళాలు, పిల్లలు ఓహ్! ఆఖరికి తనకి తనే కనపడదు మనిషి. లేదా తన్నుంచి తను పారిపోతాడు. అయ్యో! ఈ జన్మ వద్దురాబాబూ అనో, ఈ భవబంధాల్నుంచి తప్పించుకోవాలనో ఏవేవో చేస్తాడు. భయస్తులం బాబూ, మనం భయస్తులం!" గట్టిగా నవ్వాడు మహేష్.

కొంచెం సేపు మౌనం రాజ్యమేలింది.

శీలా తగ్గుస్వరంతో అంది.

"నేనెంత మందిని చూశానో! ఆడవాళ్ళు భర్త ఎదురుగా వుంటే, తన ఆఫీసులో తనతో పాటే పనిచేసే మనుషులు ఎంత ఫ్రెండ్లీగా వుండే వాళ్ళయినా వాళ్ళతో గంభీరంగా ప్రవర్తించడం, అలాగే మగవాళ్ళు భార్య పక్కనే వుంటే తన సహోద్యోగినులతో గంభీరంగా ప్రవర్తించడం సామాన్యం. కొంతమందయితే అసలు పరిచయమే లేనట్టు మొహంపెట్టి పలుకరించను కూడా పలుకరించరు"

"దీనంతటికీ కారణం ఏమిటి? ఇలాంటివాళ్ళు మనదేశంలో మాత్రమే కనిపిస్తారనుకుంటాను"

"బట్ ఉయ్ ఆర్ దిసేమ్ ఆల్ ది టైమ్" అని సుధ చుట్టూ చెయ్యివేసి దగ్గరకి లాక్కుంటూ అన్నాడు ఆనంద్.

'నువ్వు- అవును. నేను- కాదు.' అనుకుంది సుధ! నేనునేనుగా వుండాలని నాకెంతో కాంక్ష. నేను నేనుగా ఎక్కడ మిగిలాను గనుక! ఎంత సేపూ నన్ను నీకనువుగా తిప్పుకున్నావేగాని, నావ్యక్తిత్వాన్ని గుర్తించిన దెప్పుడు? అని ప్రశ్నించిందామె మనసు.

ఆమె మొహంలో మళ్ళీ ఒక చిన్న నవ్వు మెరిసింది.

"నీ సంగతెవరడిగారు? మనం లోకం సంగతి కదా మాట్లాడుతున్నది!" అని నవ్వాడు మహేష్.

శీలా గట్టిగా నవ్వేసింది.

తనకి కలిగిన పరాభవాన్ని దాచుకుందుకు ఆనంద్ భుజాలెగరేస్తూ కృత్రిమంగా నవ్వాడు.

సుధ ముఖంపై ముసిముసి నవ్వుతప్ప మరో ప్రతిక్రియలేదు.



ఒకసారి, చిన్నప్పుడు... అంటే కొంచెం పెద్ద పిల్లనే, శాకుంతలం నాటకం చూడ్డానికి వెళ్ళాను. పెద్దయ్యాక నేను ఎం.ఎ. చదువుతుండగా





కాళిదాను మూలానికి ఇంగ్లీష్ అనువాదం చదివానుగాని, అప్పుడు చూసిన డ్రామా ఎవరో ఆస్థాన విద్వాంసుడు రాసినట్టున్నాడు. అంతా వ్యవహారికంగా నడిచింది. అది విశ్వామిత్ర- మేనకా వృత్తాంతంతో మొదలయింది.

విశ్వామిత్రుడి ముందు తన నృత్యకౌశలంతో విఫలమైన మేనక అంటోంది.

"ఈ పాషాణ సదృశ హృదయుడైన ఈ ముని కళ్ళు తెరవగానే ఆఖరి అస్త్రాన్ని ప్రయోగిస్తాను. ఓయీ! పూవింటికాడా! అనుగ్రహించు నా పయ్యెదను తొలగించి స్తనాగ్రాన్ని ప్రదర్శించెదను. దీనికి లొంగని పురుషుడు వుండడు"

సభలో గొల్లున నవ్వులు.

నాకు అర్థంకాని ఆశ్చర్యం.

అసలు సంగతేమిటంటే ఆ మేనక పాత్రధారి ఒక మగవాడు. భావరహితంగా కృత్రిమంగా తను కంఠస్థం చేసిన పాఠాన్ని అప్పచెప్పేశాడంతే.

అయినా ఆ మాటల్లో అంత విషయం కూడా ఏముందిగనుక! పెయింటింగ్స్‌లో, శిల్పాల్లో, ఎన్నో రకాల నృత్యాల్లో లేనిది ఇందులో ఏముందిగనుక!

మేనక చెప్పింది (శృంగార ప్రియుడయిన రాజు ఆస్థానంలో కొలువున్న శృంగార కవి) నగ్నసత్యం. దానికి నవ్వాల్సిన అవసరం ఏముంది? పోని అబద్ధమైతే వెక్కిరింతగానైనా నవ్వచ్చు. ఏమిటో నాకంతా వక్రంగా వున్నట్టే కనిపిస్తుంది. కాళిదాను అటువంటివి చాలానే రాశాడు. అది శృంగారం. అందమైన శృంగారం, నిజమైన విషయం. కామం-ప్రేమ అన్నీ ప్రకృతి సహజంగా మనసుని వికసింపజేసే విషయాలు. అందులో వెక్కిరించేలాంటి విషయాలు గాని, సిగ్గుచెందే లాంటి విషయాలుగాని ఏమీలేవు.

మళ్ళీ చాలాకాలం తరువాత పెళ్ళయిన తరువాత కూడా అదే అనిపించింది, ఆ పాత మాటలకి పాత భావమేకాక కొత్త స్పందనలేమీ వ్యక్తపరిచే అవకాశంలేదని.

ఆనంద్ అవే పాతమాటల్ని చెబుతున్నాడనిపిస్తుంది. ఆస్థానవిద్వాంసుడి మాటలు. నా అందం గురించి, నా దేహం గురించి, నావల్ల అతనికి దొరికే శారీరక సుఖం గురించి, కాని ఆ పాత మాటలకి నాలో ఆ పాతభావాలు వికసించలేదు. కొత్త స్పందనని పుట్టించే శక్తి ఆనంద్‌కి లేదు. ఆనంద్‌కి ఆ భాష తెలియదు.

నా కొలీగ్ ఒకతను గుర్తుకొస్తాడు. అతను చాలా మంచివాడు. ఏ కారణంవల్లనోగాని అతనికి అతని భార్యతో సంబంధం తెగిపోయింది. ఎంతోమందికి అలా జరుగుతుంది. ఆ విషయం వారు బయటికి చూపించుకోరు. ఇతనైతే అతని చేతికి ఏ పత్రికదొరికినా, అస్తమానూ దాంట్లో అడ్వర్టయిజ్‌మెంట్లలో ఆడవాళ్ల ఫొటోల్ని, సినిమా తారల ఫొటోల్ని చూస్తూ కూర్చుండిపోతాడు. అతడికి అందులోనే ఆనందం దొరుకుతుంది కాబోలు.

కొత్త స్పందనని పుట్టించలేని ఏ సంబంధమైనా అంతే పాతపడి, ముక్కలౌతాయి.

"కవి రాబర్ట్‌బ్రౌనింగ్, ఎలిజబెత్ బ్యారెట్ ప్రేమించుకున్నారు. ఎలిజబెత్ తండ్రి వివాహానికి అంగీకరించలేదు. బ్రౌనింగ్, ఎలిజబెత్ పదమూడు సంవత్సరాలపాటు వేచివున్నారు. ఆఖరికి ఆ మూర్ఖుడయిన తండ్రి అనుమతి దొరకనేలేదు. అప్పుడు వాళ్ళు ఇంగ్లండ్‌నుంచి ఇటలీకి పారిపోయి పెళ్ళి చేసుకున్నారు - అని పాఠం చెబుతూ అలాంటి మూర్ఖులకి ఈరోజుల్లోనూ కరువులేదు. ఈ ప్రపంచం వున్నంతవరకూ వాళ్ళూ వుంటారు" అన్నాను.

క్లాస్ పూర్తయ్యాక డిపార్ట్‌మెంట్‌కి వెళ్తుంటే ఒక అమ్మాయి నాదగ్గరకొచ్చి గంభీరంగా అడిగింది-

"మేడమ్... మీరొక విషయం చెప్పలేదు, బ్రౌనింగ్ దంపతులెన్నాళ్ళు కాపురం చేశారు"

"వాళ్ళు పదహారు సంవత్సరాలు. అంటే ఎలిజబెత్ మరణించేవరకు సుఖదాంపత్యం అనుభవించారు. ఆమె తండ్రితోగల విరోధంవల్ల వాళ్ళు ఇటలీలోనే వుండిపోవలసి వచ్చింది. ఆమెమాత్రం ఇంగ్లండ్‌ని మరువలేకపోయింది. ఆమె మరణించాక బ్రౌనింగ్ ఇరవై ఎనిమిది సంవత్సరాలకాలం జీవించాడు. అతను మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. కావ్యరచనని కొనసాగించాడు. తన కావ్యరచనలో తనకి స్ఫూర్తినిచ్చినవి భార్య జ్ఞాపకాలేనని చెప్పుకు





న్నాడు"

నేనిదంతా చెప్తుంటే ఆ అమ్మాయి చాలా ఆశ్చర్యంగా తన్మయంగా నామాటలు వింది.

నేను నవ్వుతూ అడిగాను-

"యు సీమ్ టు బీ వెరీ సీరియస్ అబౌట్ ఇట్- ఎనీ రీజన్?"

"అవును మేడమ్! నా స్నేహితురాలొకామె లవ్‌మారేజ్ చేసుకుంది. ఒక సంవత్సరానికల్లా వాళ్ళు విడిపోయారు. ఆమెకొక పాపకూడా వుంది. వాళ్ళ పెళ్ళికి ఆ కుర్రాడి తల్లి దండ్రుల అనుమతిలేదు. నా స్నేహితురాలికి తల్లిదండ్రులు లేరు. ఇప్పుడీ పరిస్థితుల్లో ఆమెకెవరూలేరు"

ఆమె స్థానంలో నేనుండి వుంటే...?

"ఎవరూ లేకుండా ఎవరూ వుండరు. ప్రతి వాళ్ళకీ ఎవరో ఒకరుండే వుంటారు. ఏదో ఓదారి తప్పక దొరుకుతుంది"

"ఎలా మేడమ్?"

పద్దెనిమిది, పందొమ్మిదేళ్ళ అమ్మాయి ప్రశ్న- ఎవరూలేని ఒక బిడ్డతల్లి జీవితంలో ఏమి అవకాశాలు వుంటాయో ఎలా చెప్పను? అని ఆలోచించాను. నేను ఈ పిల్లకి మేడంనవడం, ఆ పిల్లకంటే పన్నెండు పదమూడేళ్ళు పెద్దదాన్ని కావడం- ఇందువల్ల నానుంచి ఒక సమంజసమైన జవాబు లభిస్తుందనే ఆశ ఆమెలో పుట్టివుండచ్చు. తన స్నేహితురాలికి తనొక సలహా ఇవ్వాలనే ఉత్సుకత ఆ అమ్మాయికి వుండివుండచ్చు.

నేను చెప్పిన జవాబువల్ల ఇరుకున పడ్డట్టయింది. కొద్దిగా ఆలోచించి అన్నాను-

"నీ స్నేహితురాలినొకసారి చూడ్డానికి వీలవుతుందా?"

"అవుతుంది"

"అలాగయితే నాకు తీరిగ్గా వున్నరోజున చెప్తాను. ఆ రోజు నన్నా అమ్మాయి దగ్గరికి తీసుకెళ్ళు"

"సరే మేడమ్"

నాకు అలాంటి తీరిక దొరకడం అన్నది అంత సులభసాధ్యమా? ఆనంద్‌కి తెలియకుండా వెళ్ళడం కుదరదు. మరెలా?

ఒకరోజు ఆ అమ్మాయి నా దగ్గరకొచ్చింది.

"ఇంక నా స్నేహితురాల్ని చూసే అవసరం లేదుమేడం"

"ఏం?" అడిగాను ఆశ్చర్యంగా.

"తను వూరొదిలి వెళ్ళిపోయింది"

"ఎక్కడికి?"

"తెలియదెవరికీ"

"బిడ్డ?"

"బిడ్డని తీసుకెళ్ళింది"

ఆమె జీవితపు అవకాశాల్లో అదీ ఒకటి అని అనిపించింది. బతుకిలాగే వుండాలని నిర్దేశించినదెవరు? అలా నిర్దేశించేవాళ్ళు అందుకుగాను ఏం వ్యవస్థచేస్తున్నారు. ఈ సమాజం నియమాలు మాట్లాడుతుందే తప్ప ఇల్లు అమర్చదు. పెళ్ళి చేసిపెట్టదు. సంసారాన్ని దక్కనివ్వదు.

ఒకసారి, ఒక శనివారం మధ్యాహ్నం సుమారు ఇరవై, ఇరవై రెండేళ్ళ అందమైన యువతిని కార్లో కూర్చోపెట్టుకుని ఇంటికి తీసుకొచ్చాడు ఆనంద్.

ఆ యువతి పొట్టిగా, గుండ్రంగా, చురుగ్గా వుంది. నన్ను మించిన అందగత్తేమీకాదు.

"మా డిపార్ట్‌మెంట్‌లోనే పనిచేస్తోంది. పేరు జ్యోత్స్న" అంటూ పరిచయం చేశాడు.

భోజనం చేసే వచ్చానన్నాడు. కొంచెంసేపు డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చుని వాళ్ళతో కబుర్లుచెప్పి, ఆనంద్ భోజనం ఎలాగూ అయిందికదా అని జ్యోత్స్నని భోజనానికి లెమ్మన్నాను.

"ఆవిడది మన కులంకాదు. మనింట్లో ఎలా తింటుంది?" అని నవ్వాడు ఆనంద్.

"అలాంటిదేం లేదు. నాకు ఏది పడుతుందో అది తింటాను కాని ఇవాళ వద్దు. నాభోజనం అయింది" అంది జ్యోత్స్న.

బ్యాంక్‌లో భోజనాలు కూడా పెడుతున్నారా? అని అడిగేద్దామా అనుకుంది. వాళ్ళిద్దరు బయట హొటల్లో హాయిగా లాగించి వచ్చే వుంటారని వూహించింది.

తను భోజనానికి లోపలికి వెళ్ళింది.

డ్రాయింగ్‌రూంలోకి వాళ్ళ కబుర్లు, నవ్వులు, సరసాలు వినిపిస్తూనే ఉన్నాయి. తను నిదానంగా భోజనం పూర్తిచేసింది. వరసచూస్తే

వాళ్ళిద్దరు తన వునికినే మర్చిపోయినట్లుంది.

భోజనంచేసి బయటకొచ్చేటప్పటికి జ్యోత్స్న నన్ను గమనించిందిగాని, ఆనంద్ మైమరచిపోయి ఆమెనే చూస్తున్నాడు. అతని దృష్టి ఆమెమీద నుంచి మరల్చలేకుండా వున్నాడు.

నేను కొంచెంసేపు సోఫాలో కూర్చున్నాను. బోరుకొట్టినట్లనిపించింది. కొంచెం అసూయగా కూడా అనిపించి లేచి లోపలికి వెళ్ళిపోయాను. అప్పటికే తలపోటు మొదలైంది. కొంచెంసేపు మంచంమీద పడుకున్నా ఏమీ లాభంలేకపోయింది. ఆనంద్, జ్యోత్స్నల మాటలు, నవ్వులతో చెవులు తూట్లుపడుతున్నాయి. అనాసిన్ వేసుకున్నాను. అంతటితో ఆగక కాంపోజ్ కూడా వేసుకున్నాను.

ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. మెలకువవచ్చేసరికి ఆనంద్ సోఫాలోనే పడుకుని నిద్రపోడం కనిపించింది.

లేచాను. తలపోటు ఇంకా తగ్గలేదు. కాఫీ కలుపుకు తాగి ఏదో పత్రిక చదువుతూ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నాను.

డాక్టర్ ఆనంద్ ఎం.ఎ. ఎల్లెల్బి, పి.హెచ్‌డి. పసిపాపలా నిద్రపోతున్నాడు.

చటుక్కున ఎదురుగా వున్న సోఫాకిందకి దృష్టివెళ్ళింది. పగిలిన గాజులముక్కలు.

కష్టపడి పత్రికమీదకి కళ్ళని లాక్కున్నాను. చదువుతున్నదేదీ తలకెక్కడంలేదు.

అలా అన్యమనస్కంగా చదువుతుండగానే ఒక విషయం నా ధ్యాసని కాసేపు లాక్కుంది.

ఒకడు తన భార్యని చంపేస్తాడు. ఏవిధంగానూ అది బయటపడకుండ అన్నిరకాల జాగ్రత్తలూ తీసుకుంటాడు.

ఒకరోజు రాత్రి ఆమెకి బలవంతాన విస్కీ తాగిస్తాడు. ఆవిడ మత్తులో వుండగా విస్కీకి నిద్రమాత్రల్ని కలిపేసి మళ్ళీ తాగిస్తాడు. తరువాత ఆమెని ఎత్తుకుతీసుకెళ్ళి కారు వెనకసీటులో కూర్చోపెడతాడు. కారు సిటీనుంచి మరో వూరికి వెళ్ళేదారిలో సుమారు ఏభైమైళ్ళ దూరం ప్రయాణంచేసే లోపల ఆమె ప్రాణం పోతుంది. మరో ఏభై మైళ్ళు తీసుకెళ్ళి ఒక నిర్జనప్రదేశంలో కారుని ఆపి ఆ ఏగువన ప్రవహిస్తున్న నదిలోకి శవాన్ని తోసేస్తాడు.

ఇంటికి తిరిగొచ్చి అన్నీ సరిగ్గా వున్నాయని నిర్ధారించేసుకుని, కారులోనే పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి, సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి ఏడు గంటల ప్రాంతంలో స్నేహితురాలి ఇంటికి వెళ్ళిన తన భార్య ఇంతవరకు ఇల్లు చేరలేదని ఫిర్యాదు చేస్తాడు.

చుట్టుపక్కల ప్రదేశంలోని అనుకూల పరిస్థితులు అతని పథకానికి సహకారాన్నిచ్చాయి. అదొక చిన్నపట్టణం కావడం, ఇల్లు వూరిబయట వుండటం, చుట్టుపక్కల అంతగా ఇళ్ళు లేకపోవడం... వగైరా.

అతనొక కన్‌స్ట్రక్షన్ కంపెనీలో ఇంజనీరు. భార్య ఒక బ్యాంక్‌లో రిసెప్షనిస్టు.

ఆధారాలేమీ దొరక్కుండా ఎంత జాగ్రత్తపడ్డా నాలుగైదు ఆధారాలని తనే ఇచ్చాడు.

స్టేషన్‌లో ఫిర్యాదు దాఖలు చేసుకున్న కానిస్టేబుల్ ఒక ప్రశ్న వేశాడు.

మీ ఆవిడ స్నేహితురాలింటికి వెళ్ళి విచారించారా?

"ఆమె బయటికి వెళ్ళినప్పుడు నేను పడుకుని చదువుకుంటున్నాను. ఆవిడకి ఇద్దరు ముగ్గురు స్నేహితురాళ్ళున్నారు. ఎవరింటికి వెళ్ళిందో తెలీదు"

"అందులో ఏ ఒక్కరింటికయినా వెళ్ళి అడిగి చూడలేదెందుకని?"

అది డబ్బా ప్రశ్నేకావచ్చు. కాని అదే తెలివైన ప్రశ్న. ఎవడైనా తన భార్య ఇంట్లోంచి బయటికి వెళ్ళి ఇంటికి తిరిగి రాకపోతే తిన్నగా పోలీస్‌స్టేషన్‌కే వెళ్ళి రిపోర్టిస్తాడా?

సరే... ఒకవారం తరువాత సముద్రతీరంలో అస్థిపంజరం దొరికింది. గాయపు గుర్తులేమీ లేకపోవడంతో ఆత్మహత్య అయ్యుంటుందని పోలీసులు శంకించారు.

ఫోరెన్సిక్ ఎక్స్‌పర్ట్ రిపోర్ట్‌లో ఆమె మొదట విస్కీ, నిద్రమాత్రలు సేవించిందన్న సంగతి బయటపడింది. నీళ్ళల్లో దూకి ఆత్మహత్య చేసుకోదల్చుకున్న మనిషి నిద్రమాత్రలు ఎందుకు మింగడం? - అనే ప్రశ్న తలెత్తింది.

అతనింట్లో విస్కీ, నిద్రమాత్రలు దొరికాయి. విస్కీ, నిద్రమాత్రలు డబ్బున్నవాళ్ళింట్లో వుంటే అదేమీ పెద్ద విశేషంకాదు. అవి ఇంట్లో దొరికినంతమాత్రాన అతనే హత్యచేశాడనేం





అనుకోనక్కర్లేదు. అయినా

పోలీసులు అతనిమీద అనుమానంకొద్దీ అరెస్ట్ చేశారు. ఆ సందేహానికి ముఖ్య కారణం, అతనింకెక్కడా వెతక్కుండా తిన్నగా పోలీస్స్టేషన్కి వెళ్లి ఫిర్యాదు చెయ్యడమే.

ఆ తరువాత విచారణ జరిపినప్పుడు అతను తన కారుకి ఒక వారం రోజులక్రితమే తెరలు కట్టించాడని తెలిసింది. అతనికి నిద్రమాత్రలు వాడే అలవాటులేదని తెలిసింది. అతని భార్యకి కూడా నిద్రమాత్రలు వాడే అలవాటు లేదన్న సంగతి బయటకొచ్చింది. అతను నిద్రమాత్రల్ని ఎక్కణ్నుంచి సంపాదించాడో కనిపెట్టబడింది.

"ఎర్రిమొహం" అని నాలో నేనే మాట్లాడుకున్నాను. ఆ మొద్దుమనిషి అరబాటిల్ విస్కీ, అరబాటిల్ నిద్రమాత్రలు ఎందుకు మిగుల్చుకోవాలట? ఫ్రెండ్స్ ఇళ్ళకి వెళ్ళి వెతికి వచ్చే నాటకం ఆడకుండా తిన్నగా పోలీస్స్టేషన్కెవడు వెళ్ళమన్నారట? శుద్ధమొద్దు అనుకున్నాను.

నేనేగనుకయితే అలాంటి పిచ్చిపని చెయ్యనుగాక చెయ్యను. ఒకవేళ ఆనంద్ని హత్యచేస్తాననుకోండి, ఖచ్చితంగా దొరక్కుండా మేనేజ్ చెయ్యగలను.

దొరక్కుండా ఎలా చంపాలా అని ఆలోచన వచ్చింది. విషం సుఖం లేదు. కారు బ్రేకులు పాడుచెయ్యొచ్చుగాని అదెలా చెయ్యాలో నాకు తెలియదే. నేర్చుకోవచ్చుగాని, కారు డ్రైవింగ్కి ఆనంద్ అనుమతి లేదు. ఉట్టి బ్రేకులు తప్పించడం మాత్రం నేర్చుకోవాలి. మళ్ళీ దాన్ని ఆనంద్నే నేర్పమని అడగాలికదా- అలా అనుకునేసరికి నవ్వొచ్చింది. అతను బాగా తాగి వచ్చినపూట చూసుకుని గదిలోకి గ్యాస్ వదిలేసి చంపవచ్చునుగాని, నేను గదిలో లేకుండా ఈ పనిచేస్తే నా మీద తప్పకుండా సందేహం వస్తుంది.

ఇద్దరూ చచ్చిపోతే పేచీలేదు. అది చాలా సులభం కూడా. దానికి చాలా పద్ధతులేవున్నాయి.

అతనొక్కణ్ణే చంపాలనుకుంటే?

జుహూలో వున్న 'లాశాంగ్రిలా'కి అప్పుడప్పుడు డిన్నర్కి వెళ్ళడం మాకు అలవాటే. కొన్నిసార్లు ఆనంద్ బాగా తాగుతాడు కూడా. అలా తాగేసినప్పుడొకపూట, 'బొంబాయి నగరాన్ని రాత్రివేళ చూసి చాలారోజులయింది. చూద్దాం పద' అని టెర్రస్ మీదకి తీసుకెళ్తేసరి. తొమ్మిదంతస్థుల మేడ. కిందపడితే ఏమీ మిగలదు. తిన్నగా పైకే. టెర్రస్మీద నుంచుని దూరంగా దేన్నో ఆసక్తిగా చూపిస్తూ కొంచెం ధ్యాస మళ్ళించి మెల్లగా కిందకి తోసేస్తేసరి. వెంటనే గట్టిగా అరిచేసి, స్పృహతప్పి మూర్ఛపోయినట్టు నాటకం ఆడితే సరిపోతుంది.

"నన్ను ఇలా పైకితీసుకెళ్ళి అతనెన్నోసార్లు "దూకేద్దామా?" అని అడిగేవాడు. తమాషాకి అనుకునేదాన్ని. ఎత్తయినకట్టడాలెక్కితే అతనికేదో అవుతుంది. విచిత్రంగా ప్రవర్తిస్తాడు. ఇవాళ బాగా తాగేశాడు. నన్ను దూకమని బలవంతంచేశాడు. నేను మాటమార్చిస్తే 'పిరికిదానివని' హేళనచేశాడు. "నువ్వు మహా ధైర్యవంతుడివేమిటి?" అని ఎదురు ప్రశ్నవేసేసరికి, 'అవునో కాదో చూసుకో' అంటూ ఒక్కక్షణం ఆగకుండా దూకేశాడు. నేనలాంటి ప్రశ్నడిగి రెచ్చగొట్టకుండా వుండాల్సింది అని వెక్కివెక్కి ఏడ్చెయ్యడమే.

'బ్రహ్మాండం! తిరుగులేని ప్లాను' అనుకున్నాను. ఆనంద్ లేచి వచ్చాడు.

పేపర్ పక్కన పడేసి కాఫీ కలపడానికి లేచాను.

* * *

ఒకరోజు డాక్టర్ మహేష్, శిలావచ్చి మర్నాడు వాళ్ళబ్బాయి శైలేష్ బర్త్డేకి రావాలని ఆహ్వానించి వెళ్ళారు.

వాళ్ళటు వెళ్ళగానే ఆనంద్, "ఇలా ఏదో ఒక ఫంక్షన్చేసి కానుకలు బాగా సంగ్రహిస్తారు. మూడు నాలుగేళ్ళ నుంచి మనం ఇస్తున్నామా? అలాగే అందరూ ఇవ్వాల్సిందే. మహేషయితే ఎవరే ఫంక్షన్కి పిల్చినా 'అర్జెంట్ కేసొచ్చింది, ఆపరేషన్ వుంది' అని వంక చెప్పి మెల్లగా ఎగ్గొట్టేస్తాడు. అదే మహేష్ ఫ్రెండ్స్కి, డాక్టర్ మహేష్ పిలిచాడంటే వెళ్ళకుండా వుండటానికి బాగుంటుందా? వీలవుతుందా? అందులోనూ డాక్టరంటే ప్రతివాళ్ళకీ ఒకసారి కాకపోతే మరొకసారి ఏదో ఒక అవ

నరం రానేవస్తుంది. ఆ సంగతి ఇతనికి తెలుసు. తరువాత మొగుడూ పెళ్ళాలిద్దరూ కూర్చుని ఎవరొచ్చారు, ఎవరు రాలేదు, ఎవరు గిఫ్ట్ తెచ్చారు, ఎవరు తేలేదు అంటూ లిస్టు తయారుచేస్తారు. ఆ రానివాళ్ళెవరయినా తరువాత హాస్పిటల్‌కొచ్చారంటే ఇంక వాళ్ళ కథ కంచికెళ్ళినట్టే'' అని నవ్వాడు.

ఆనంద్ చెప్పేదాంట్లో ఉత్ప్రేక్ష ఎక్కువ అయినా నిజం కూడా.

ఆ తరువాత శీలా గురించి మాట్లాడాడు.

"రోజురోజుకి బక్కగా తయారవుతోంది. ఏమన్నా జబ్బుందో ఏమో. లేకపోతే సెక్స్ ఎక్కువైందో ఏమో. అలాగే కనిపిస్తోంది వరస. ఈ గడకర్రల్లా వుండేవాళ్ళకి అది కొంచెం ఎక్కువే కూడా'' అని వెకిలిగా నవ్వాడు.

సుధ మౌనంగా వుండిపోయింది. తరువాత సుధ కాలేజికి కొత్తగా వచ్చిన ప్రిన్సిపాల్ గోపాలక్రిష్ణ గురించి మొదలెట్టాడు.

"బొత్తిగా కాల్చిన కొయ్యముక్కలాగుంటాడు మనిషి. దానికితోడు ఆ ముఖాన విభూది పట్టెలొకటి. మొదటిసారి చూసినప్పుడయితే ఎవడో గ్యారేజి ఫిట్టరనుకున్నాను. వాళ్ళావిడ బాగానే వుంది మరి. ఫిగర్ అదీ బ్రహ్మాండం. కానీ మొహాన ఆ రూపాయి బిళ్ళంత బొట్టుచూస్తే భలే నవ్వొచ్చిందిలే. మొగుడి మొహమ్మీది విభూదిరేఖలకీ, ఈవిడ మొహం మీద అప్పడం గుర్తుకీ గొప్ప లంకెలే- అని తన అసహ్యకరమైన జోకుకి తనే నవ్వుకున్నాడు.

ఆనంద్ నోటవద్ద ఎ మగవాడికీ గౌరవంలేదు; ఎ ఆడదానికీ పవిత్రత లేదు.

అతని మాటలు వింటుంటే సుధ కొయ్యబారిపోతూ వుంటుంది. ఆమెనోట మాటేరాదు. ఎందుకితనిలా మాట్లాడతాడు? ఇతనే రకమైన, ఏజాతికి చెందిన మనిషి?- అని ఆశ్చర్యం కలుగుతుంది.

'సౌందర్యం అంటే ఏమిటని' అడగాలనిపించింది సుధకి. 'రోజూ పొద్దున్నే గంటసేపు అద్దంముందు కూర్చుని సింగారం చేసుకుని పోకులుపోయే నీ అంతరంగసౌందర్యం ఏపాటిది?' అని అడగాలనిపించింది. 'వాళ్ళదీ వీళ్ళదీ రూపం...జీవితం అంటూ నువ్వెందుకు తలకిందులవుతావు?' అని అడగాలనిపించింది.

కాని అలా అడగలేదుతను. రెండుసార్లు అతడామె గొంతునొక్కి సగంలో వదిలాడు. భయంతో అరవాలనిపించినా మర్యాదకోసం గొంతు బిగపట్టుకుంది మొదటిసారి. రెండోసారి అదీ చూద్దాం, చేతనైతే గొంతు పిసికి చంపనీ, చంపినా ఏం ఫరవాలేదనుకుంది. ఆమెకి లోలోపల మరొకధైర్యం కూడా వుంది. చంపగలిగేటంత కఠినమైన నిర్ధారం అతనిలో లేదు. ధైర్యమూ లేదు. కాని అతని ముఖంలో రంగులు మారేతీరు, ముఖంలో కండరాలన్నీ బిగుసుకుని ముఖం వికారంగా అయినరీతి ఆమెని భయపెట్టింది. అతను కోపంలో మతిలేక గొంతుపిసికి చంపినా ఆశ్చర్యంలేదు అనిపించింది.

అయితే ఇప్పుడు చాలా మంచి మనిషయిన గోపాలకృష్ణగారి గురించి అపహాస్యంగా మాట్లాడుతుంటే అసలు సహించలేకపోయింది.

"డాక్టర్ గోపాలకృష్ణ చాలా గొప్ప వ్యక్తి. చాలా విద్వత్తుగల మనిషి. ఎన్నో గ్రంథాలు రచించారు. కెమిస్ట్రీలో ఎంతో రీసెర్చిచేశారు. ఆయన వ్యక్తిగత జీవితంలో కూడా ఎంతో యోగ్యుడు, సాత్వికుడు. ప్రిన్సిపాల్ అయ్యుండీ కూడా ఎంత నిరాడంబరంగా, వినయంగా వుంటారో'

"స్కాలర్ కావచ్చు. సాత్వికుడు కావచ్చు. కాని బొత్తిగా ప్రిన్సిపాల్ లక్షణమే లేదు. పాత ప్రిన్సిపాల్ శాంతారాంతో పోలిస్తే ఈయనగారు ప్యూన్‌లా కూడా కనపడడు. ఆ పర్సనాలిటీ బొత్తిగాలేదు'' అన్నాడు ఆనంద్.

సుధకి తిక్కరేగిపోయింది. ఆమె కడుపులో పేగులు మెలిపెట్టినట్టయింది. 'మూర్ఖుడా... పెర్సనాలిటీ అంటే ఏమిటనుకున్నావ్? అసలా మాటికి అర్థమైనా నీకు తెలుసా? గర్విష్ఠి. పొగరుమోతు, నీలాగ ఆడపిచ్చి వున్న శాంతారాంని నువ్వు మెచ్చుకుంటే ఆశ్చర్యం ఏముందిలే. ఇద్దరూ ఒకటే. పేరుకి డాక్టర్లు. హి ఈజ్ హార్డ్లీ ఎ హ్యూమన్ బీయింగ్. నాతో కూడా అతడు రెండుసార్లు అసహ్యంగా ప్రవర్తించాడని చెబితే నువ్వు ఆత్మహత్య చేసు





కుంటావేమో' అని లోపల్లోపల తిట్టుకుని కోపా
న్ని దిగమింగుకుని పైకొక కృత్రిమమైన
నవ్వుని విసిరింది.

"ఫిట్టర్స్‌లా కనిపించే కాలేజీ ప్రిన్సిపాల్స్, ప్రిన్సిపాల్స్‌లా కనిపించే ఫిట్టర్లూ ఈ ప్రపంచంనిండా వుంటారు. ఇంతకీ ఫిట్టరంటే హీనమైన మనిషేమీకాదు. అతను చెయ్యివెయ్యకపోతే అన్నివేలు ఖరీదుచేసే నీ కారు కదలదు. ఎన్నో సందర్భాల్లో కాలేజి ప్రిన్సిపాల్ కంటే ఫిట్టర్ ముఖ్యమైన మనిషవుతాడు. నువ్వు, నేను, గోపాలక్రిష్ణ ఏదో ఒక విషయంలో కాస్తకాస్త జ్ఞానం వున్నవాళ్ళం. ఫిట్టర్‌కి అతని విషయంలో పరిపూర్ణజ్ఞానం వుంటుంది"

ఆనంద్ కొంచెం ఉడుక్కున్నాడు. బహుశా తన సోషియలిస్టిక్ మాటలు, అతని అరిస్టోక్రాటిక్-కాపిటలిస్టిక్ స్వభావానికి నచ్చివుండవు అనుకుంది సుధ.

"అప్పియరెన్స్ ఈజ్ ఆల్సో ఇంపార్టెంట్" అన్నాడు ఆనంద్.

అవును... ఆనంద్‌కి అప్పియరెన్స్ చాలా ముఖ్యం. అసలు 'ఉట్టి అప్పియరెన్స్ వుంటే చాలు, వ్యక్తిత్వం లేకపోయినా ఫరవాలేదు నీకు' అనుకుందామె. సూట్, షర్టుకి మ్యాచ్ అయ్యే టై, తళతళమెరిసే షూస్, వాటికి మ్యాచింగ్ సాక్స్, నున్నగా దువ్విన క్రాపు, మ్యాస్కులిన్ పెర్‌ఫ్యూమ్, గోల్డ్‌చెయిన్, రోలెక్స్ వాచ్, బంగారు రంగు షర్టు గుండీలు, అటువంటివే కఫ్‌లింగ్స్, బెల్టు దగ్గర్నుంచీ స్పెషల్‌గా వుండాలి. హుఁ... నీలో మానవత్వాన్ని మాత్రం దుర్భిణీపెట్టి వెతకాల్సిందే. నిద్రకి ముందు మాత్రం ఈ వేషాన్ని మార్చే నువ్వు, పక్కమీద ఎంత విభిన్నంగా కనిపిస్తావు.

ఏది మనిషి? ఏది మృగం?

కారుని రిపేరుచేసే ఫిట్టరంత సుఖజీవి, సజ్జనుడూ నువ్వు కాదు, మహేష్‌కాదు, శాంతా రామూకాదు. అంతెందుకు... నేనూ కాదు. మనమంతా జ్ఞానంతో, ఐశ్వర్యకాంక్షతో, అంతస్తులతో భగ్నమైన ఆత్మలం అనుకుంది.

ఏమీ మాట్లాడకుండా నవ్వుతూ నుంచున్న సుధనిచూసి "ఎందుకు నవ్వుతున్నావ్?" అనడిగాడు.

"ఏం లేదు ఊరికే" అని కిందకి చూసింది.

"నువ్వెందుకో ఇవాళ చాలా అందంగా కనపిస్తున్నావు" అంటూ ఆనంద్ ఆమె దగ్గరకొచ్చి బలంగా కౌగిలించుకుని ప్రణయచేష్టలారంభించాడు.

రెండు నిమిషాల్లో సుధ ముఖంలో అదే చిరునవ్వు.

నెత్తురు మాయని గాయాలు లోపలున్నాయి. ఆనంద్, ఎంత అసహనీయమైన, అసహ్యమైన నొప్పిననుభవిస్తున్నానంటే, నీ స్పర్శ నాలో ప్రతి కణాన్నీ మండిస్తోంది. ఆరోజు బస్సుకిందపడి ఛిద్రమైపోయిన చిన్నారిపాపని చూసి 'పూర్‌ఛైల్డ్' అనేసి నీదారిన నువ్వెళ్ళిపోయావు. నేనాపుకోలేక వెక్కివెక్కి ఏడ్చాను. నా శరీరంలో కణకణాన్ని గుచ్చినట్టయింది ఆ బాధ. రోజంతా బాధ...బాధ...బాధ! ఇప్పుడూ అదే బాధ. ఆరోజు ఆ క్షణంలో నేను జీవసహితంగా వున్నాను. ఇప్పుడు నిర్జీవమైపోయాను.

ఆమెని ఎత్తుకుని బెడ్‌రూంలోకి తీసుకెళ్ళాడు ఆనంద్!

సుధ మనసులో ప్రశ్న బలాత్కారాలు వీధుల్లోనే జరుగుతాయా? పరస్త్రీలపైనే జరుగుతాయా? కమాన్ ఆనంద్... ఇదే ఘనకార్యం వీధిలో చెయ్యి. అందరికీ నీ అసలు సంగతి, నిజం తెలియనీ.

గట్టిగా నవ్వింది సుధ. కిలకిల నవ్వింది సుధ. ఒళ్ళు మరిచి నవ్వింది సుధ.

అడది కామోన్మాదురాలయ్యేది ఇలాగే అని ఆనందపడ్డాడు ఆనంద్.

సాయంత్రం రాకేష్ వచ్చాడు.

ఎందుకోగాని ఆనంద్‌కి రాకేష్ నచ్చాడు. సుధావాళ్ళ ప్రిన్సిపాల్ గోపాలక్రిష్ణ దగ్గర్నుంచి మొదలెట్టి ఆమె కొలీగ్స్ అందర్నీ తిట్టిపోసే ఆనంద్ రాకేష్‌నెలా ఇష్టపడ్డాడా అని ఆశ్చర్యం సుధకి.

రాకేష్ ఏడాదిక్రితం ఎం.ఎ. పాసయివచ్చి చేరిన తరుణ అధ్యాపకుడు. తనకంటే పై ఉద్యోగంలో ఉన్నా, ఎక్కువ చదువుకున్నా తనకంటే ఎక్కువ జీతం వచ్చేవాళ్ళనైనా ఆనంద్ ఒకపట్టాన మెచ్చుకోడు. అసలు మెచ్చుకోడన్నా ఆశ్చర్యపోనక్కర్లేదు. రాకేష్‌లో

ఆనంద్ అసూయపడేలాంటి గుణాలేమీ కనిపించివుండవు. అయినా అతను తనకంటే పొడుగ్గా, ఆకర్షణీయంగా వుంటాడన్న సంగతి అప్పుడప్పుడు ఆనంద్‌ని గుచ్చుతూ వుంటుంది. రాకేష్ చదివించేది ఇంగ్లీషు లిటరేచర్. అతనికి తన సబ్జెక్టంటే చాలా అభిమానం కూడా. అతను తన అందమైన శైలిలో ఏదన్నా పుస్తకం గురించిగాని, కవి గురించిగాని మాట్లాడుతుంటే సుధ ఒళ్ళుమరచి వింటుంది. ఆమెదీ అదే సబ్జెక్టయినా, ఐదారేళ్ళుగా టీచ్‌చేస్తున్నా అతనికున్న తెలివి ముందు, వాక్చాతుర్యం ముందు తనకేమీ రాదనే అనిపిస్తుంది. ఇంగ్లీషు భాషమీద అతనికున్న కమాండ్, అతని పాండిత్యం- వీటిని చూస్తే ఆనంద్‌కి కడుపుమంటగా వుంటుంది. అంతేకాదు సుధ మైమరచి అతని మాటల్ని వింటుంటే అతనికదోవిధమైన అసహనం. ఆమె ఇష్టపడే రాకేష్‌లోని ఈ గుణం తనకుండివుంటే ఎంత బాగుండేది అనుకుంటాడు. ఆనంద్ ఆకర్షించేలా మాట్లాడగలడు. కాని కామర్స్, లా-వీటిలో అంత ఆకర్షించేలాంటి అంశాలేమీ వుండవన్న సంగతి అతనికి తెలుసు. అతని డాక్యుమెంటరీ శైలి, భాష ఎవరిలోనూ ఆసక్తిని రేకెత్తించదు. మామూలు



తెలివితేటలస్థాయికి అందనిదీ విషయం. అతను చురుకుగా ఆలోచించగలడు. స్థిరమైనటువంటి మంచి మేధస్సు వున్నవాళ్ళకి మాత్రం అపీలయ్యేలాంటి విషయం ఇది అంటాడు ఆనంద్.

ఇరవైఅయిదెళ్ళుదాటని రాకేష్ ఆనంద్ దృష్టిలో ఒక భోళారకం బుల్లోడు. ఇంగ్లీష్ సాహిత్యం గురించిన కొద్దిపాటి నాలెడ్జితప్ప అతనిలో ఇంకేమీ లేదన్నది ఆనంద్ అభిప్రాయం. హిఈజ్ ఇమ్మెచ్యూర్ అనో, అలాటిదో మరేదైనా మాట అనో తేలిగ్గా మాట్లాడతాడు ఆనంద్. మహేష్‌తో మాట్లాడేటప్పుడుకూడా రాకేష్ గురించి "ఏమిటో ఎప్పుడూ షేక్స్పియర్, షెల్లీ అంటూంటాడు. అవితప్ప ఇంకేమీ అతనికి తెలిసినట్టు లేదు" అంటాడు. మహేష్ కూడా "హిఈజ్ ఎ మగ్" అని వంతపాడతాడు.

అయితే ఆనంద్‌కి, రాకేష్‌కి ఒక విషయంలో మాత్రం ఒకేరకం అభిరుచి. ఇద్దరికీ అడవులు, కొండలు, గుట్టలు, సముద్రం, ఇనుకతిన్నెలు అంటేమహాప్రీతి. ఆనంద్ సముద్రతీరాన పుట్టిపెరిగినవాడు. రాకేష్‌కూడా పోర్ బందర్ సముద్రతీరంలో పెరిగినవాడు. ఇద్దరూకలిస్తే తాము చిన్నప్పుడు అడవుల్లో, కొండల్లో, నదీతీరాన, సముద్రతీరాన ఎలా తిరిగారో, ఏమేం సాహసాలు చేసివుంటారో అవన్నీ మాట్లాడుకుంటారు. అడవి అంటే ఆనంద్‌కి ప్రాణం. అడవుల్ని నరికి నాశనంచేసి, దేశాన్ని ఎడారిలా చేసేస్తున్నారని బాధపడతాడెప్పుడూ. రాకేష్ అడవులు ఆవరించిన కొండప్రదేశాల గురించి మాట్లాడుతూ షేక్స్పియర్, 'యాస్ యు లైక్ ఇట్'లోంచి ఉదాహరణలిస్తాడు.

ఎలిఫెంటా పిక్నిక్ వెళ్దామంటాడు రాకేష్. ఇంకేదో అడవి పేరుచెప్పి అక్కడికి వెళ్దామంటాడు ఆనంద్.

సుధ ఊరికే అన్నీవింటూ బొమ్మలా కూర్చుంటుంది. ఆమెకొకటే కోరిక. అడవీ, కొండా అంటూ ఏమీ అక్కర్లేదు. ఇంట్లో అయినాసరే ఇంకెవరూ లేకుండా ఒంటరిగా వుండగలిగితే చాలు. మనిషికి సంబంధించిన ఏ ధ్వనీలేకుండావుంటే చాలు. ఆనంద్ లెక్చర్లు వింటుంటే చిరాగ్గావుంటుంది. మితంగా మాట్లాడే రాకేష్‌మాటలు హితవుగా వుంటాయి.

ఒక్కోసారి ఒక్కతే వెళ్ళి జుహూబీచ్‌లో ఇసుకలో ప్రశాంతంగా కూర్చుని చిన్నచిన్న పిల్లల పరుగుల్నీ గంతుల్నీ ఆటల్నీ చూడాలనిపిస్తుంది.



శైలేష్‌కి ఐదవ పుట్టినరోజు. ఇది చాలా ముఖ్యమైన బర్త్‌డే. ఎందుకంటే, ఇంకో మూడునెలల్లో ఆ కుర్రాడు స్కూల్లో చేరతాడు.

బర్త్‌డే అంటే కొత్తదనం ఏమీలేదు. కొవ్వొత్తుల సంఖ్యలో తేడా వుంటుందంతే. చుట్టుపక్కల ఇళ్ళలో బర్త్‌డేలు జరుగుతూనే వుంటాయి. ముఖ్యంగా పెద్దవాళ్ళ ఇళ్ళల్లో జరిగే వ్యవహారం ఇది. నెలజీతం మీద బతికే జనాలకి నెత్తిమీద భారం ఇది. జీతం ఎక్కువో, తక్కువో దురాశ తప్పదు. బహుమతులు స్వీకరించేటప్పుడు ఏదో ఆనందం. అది అర్థంలేని ఆనందం అనిపిస్తుంది నాకు. మళ్ళీ తీర్చాలి అనే తపన వున్నప్పటికీ వున్న పిల్లలందరికీ పుట్టినరోజు పండుగలు జరపాల్సిందే. అదీ పాశ్చాత్యపద్ధతిలో- బఫే, హాట్‌డ్రింక్స్, హాట్ మ్యూజిక్, కొంచెం హాట్‌గానే వుండే గంతులు. పుట్టినరోజు చేయించుకునే పాపకో, బాబుకో ఇందులో అర్థమయ్యేదేమీ వుండదు.

పొద్దున్న నిద్రలేచినప్పుడే తలదిమ్ము.

"మహేష్ కొడుక్కి ఏంకొందాం?" ఆనంద్ అడిగాడు.

"ఏదన్నా డ్రెస్ తీసుకుంటేసరి"

"కొంచెం ఖరీదయినదే కొనాలి. మామూలు

దేదయినా కొంటే చవుకరకం ఇచ్చామని వాళ్ళ కీ వీళ్ళకీ చెప్పుకుంటారు మళ్ళీ"

'వాళ్ళు చెప్పుకున్నా చెప్పుకోకపోయినా చెప్పుకున్నారనే అనుమానం పడేరకం నువ్వు'-అనుకున్నాను.

"సాయంత్రం కొందాంలే" అన్నాను.

"సాయంత్రం త్వరగా వచ్చేస్తాను. లాస్టవర్ ఖాళీ చేసుకోగలవా?"

ఇవాళ లాస్టవర్ లేదు నాకు.

సాయంత్రం క్లాసవగానే డిపార్ట్‌మెంట్‌లో కూర్చున్నాను. ఏవేవో ఆలోచనలు తలలోకి వస్తున్నాయి. ఈ చదువుకున్నవాళ్ళు, పెద్దవాళ్ళు అనిపించుకోబడే మనుమల్లో రెండు భిన్న వ్యక్తిత్వాలు కలిసి వుండేవారి సంఖ్య తక్కువేమీకాదు. ఆనంద్ రెండు రూపాల్లో నేను ద్వేషించేనేతప్పమెచ్చుకునే గుణాలేమీ లేనేలేవా అనే ఆలోచనవచ్చింది. ఆనంద్ ఏ మనుమలతో ఎంతో స్నేహంగా అభిమానంగా మాట్లాడతాడో వారి వెనుకనే వారిగురించి చెడ్డగా మాట్లాడగలడు. ఎవర్నైతే ఎదురుగా పొగుడుతాడో వారిగురించి ఇతరులతో అసహ్యంగా వ్యాఖ్యానించగలడు.

నా ఎదురుగా ఒక్క మగాడి గురించి గొప్పగాగాని, ఒక్క ఆడదాని గురించి మంచిగాగాని మాట్లాడ్డం నేనింతవరకు వినలేదు.

అతని ఈ స్వభావం చూస్తే, నన్నెంత ప్రేమిస్తున్నానంటాడో అంతకిమించిన ద్వేషం అతని మనసులో వుండుంటుందనిపించింది. ఒకవిధంగా చూస్తే అతని ప్రేమకంటే ద్వేషమే బాగుంటుందేమో. నిజానికి అతని ద్వేషంకోసం నేను చాలాసార్లు అపేక్షించాను. అతను నా గొంతునొక్కినప్పుడు కాస్త భయమేసిన మాట నిజమేగాని, అందులో ఒక విలక్షణమైన సుఖానుభవం కూడా దొరికింది. అది నా మనసుకర్థమైంది. భయం కరిగిపోతుండగా అంతే దానర్థం నాకెవరిచేతన్నా, ఆనంద్ చేతనయినా గొంతు పిసికించుకొని చావాలనుందని కాదు. ఆనంద్ నన్ను ప్రేమించే బదులు ద్వేషిస్తేనే నాకిష్టమని.

రాకేష్ వచ్చాక ముఖ్యంగా అప్పుడప్పుడు రాకేష్ మా ఇంటికి రావడం మొదలెట్టాక, ఆనంద్‌లో నేను కోరుకొన్న ద్వేషం బయటపడుతుందేమోనని ఎదురు చూశాను కాని అలా జరగలేదు. ఆనంద్ నన్ను మరింత ప్రేమగా చూడ్డం మొదలెట్టాడు. దానికి కారణమేమిటా అని విశ్లేషించి అర్థంచేసుకుందుకు అసమర్థురాలినయ్యాను.

ప్రీతి-ప్రేమ అనేవి జీవితంలో అత్యంత అమూల్యమైనవని, ముఖ్యమైనవనీ నమ్మకం కదా, మరి ఆనంద్ ప్రేమ నాకెందుకు అక్కర్లేనిదిగా కనిపిస్తోంది, ఎందుకని? అతను ఎవరెవరో ఆడవాళ్ళతో విహరిస్తాడనే ఈర్ష్యతోనా లేక అతను ఇతరుల గురించి మాట్లాడే కుత్సితమైన, అసహ్యమైన, మత్సరపు మాటలవల్లనా? తన గురించి మాటిమాటికీ గొప్పగా, గర్వంగా చెప్పుకునే ఆత్మప్రశంసాపూర్వకమైన మాటలవల్లనా? ఎందుకని?

అన్నీ సహించగలనుగాని ఒక్కోసారి ఆనంద్‌ని చూసినప్పుడు అతని సహజరూపం కాకుండా మరోరూపం కనిపిస్తుంది. ఆ రూపం చాలా కురూపంగా వుంటుంది. ఆ రూపం మేనిని మూసివేసినప్పుడు నా దేహంలోంచి ముళ్ళులేస్తాయి. ఆ రూపంయొక్క నగ్నత్వం నా నగ్నత్వాన్ని స్పృశించేటప్పుడు నాలో సుఖకరమైన ఏ వికారమూ కలగదు. నా స్పర్శనాడులన్నీ ముడుచుకుపోతాయి.

కొన్నిసార్లు ఆ నగ్నతలో కూడా అతనిలో ఒక కృత్రిమ ముఖాన్ని చూసి ఉలిక్కిపడుతుంటాను. ఈ మనిషియొక్క నిజమైన అంతరంగం ఏమిటి? ఎక్కడుంది? అనే ప్రశ్న నన్ను వెంటాడుతుంది.

"ఆయనకోసం వెయిట్ చేస్తున్నారా?" రాకేష్ క్లాస్ ముగించుకుని వచ్చి అడిగాడు.

"ఊఁ... బజారుకి వెళ్ళాలి. డాక్టర్ మహేష్ కొడుకు బర్త్‌డేకదా! ప్రెజంటేషన్ కొనాలిగా" అన్నాడు.

రాకేష్ నవ్వుతూ-

"పిల్లలకి బర్త్‌డే సెలబ్రేషన్ చెయ్యకపోతే ఏమన్నా అపచారమా?" అనడిగాడు.

"ఏమో బాబు, నాకు తెలియదు. అయినా మీకెందుకొచ్చిందీ ప్రశ్న?" నవ్వుతూ అడిగాను.

"ఊరికే తెలుసుకుందామని, నా పిల్లలకి

[illegible] చెయ్యను బాబూ"

"పెళ్ళయ్యాక సంగతికద! మీరు వద్దన్నా..."

"అర్థమైంది అర్థమైంది... బర్త్‌డే సెలబ్రేషన్స్ బాగా చేయించుకుని పెరిగినపిల్లని నేను పెళ్ళిచేసుకోను. పిల్లని చూసినప్పుడు మొదటిప్రశ్న- పుట్టబోయే పిల్లాడికి బర్త్‌డే పార్టీ చెయ్యాలంటావా వద్దంటావా? - అనే అడుగుతాను"

నవ్వొచ్చింది నాకు.

"బాగుంది, అలూలేదు, చూలూలేదు... అన్నట్టుగా. మంచి తిరుగుబాటు వ్యవహారంగా వుందే మీకథ!"

"మీరేమనుకున్నారు? నన్ను తొట్లో వేసినప్పుడే గట్టిగా అరిచానట, 'నా పుట్టినరోజు పండుగలంటూ ఎవరూ చేయకండహెహోయ్' అంటూ".

మరింత నవ్వొచ్చింది. నవ్వాను. నన్ను నవ్వించడమే అతని ఉద్దేశం అన్న సంగతి నాకు తెలుసు. నాకు కొంచెం నవ్వాలనేవుంది కూడా.

"అంతెందుకు నేను పుట్టేవిషయం నాకు ముందుగా తెలిసుంటే మా అమ్మచెవిలో చెప్పేసేవాడిని, నేను పుట్టాల్సిన అవసరమేలేదని, నేనుపుట్టి ఈ ప్రపంచానికి జరగాల్సిన ఉద్ధరింపు ఏమీలేదని"

"పుట్టుకన్నది ఆగిపోతే ఈ భూమి ఒకనాటికి మానవరహితమైపోదా"

"అయితే ఏమిటంట? మనుమల్లేకపోతే భూమ్మీద మిగిలిన జీవులన్నీ సుఖంగా బతకచ్చుకద. ఈ కాలేజీ, బ్యాంకులు, ఆస్పత్రి వేటితోనూ అవసరంలేదు. వాళ్ళ జీవితాల్లోనూ సుఖశాంతుల్లేవు. అందరి బతుకుల్లోనూ సుఖశాంతుల్ని నాశనంచేస్తూ, తనూ సుఖంగా బతకలేని జీవి మనిషి మాత్రమే" అన్నాడు రాకేష్.

బుద్ధిమంతుడు కాలేజి, బ్యాంకు, ఆస్పత్రి అని ఉదహరించడంలో ఏదో ఉద్దేశంపెట్టుకున్నాడు. అందులో నేను, ఆనంద్, మహేష్





వున్నాం. తనూ వాటిల ఒకభాగం గనుక అతను సభ్యత అవధిలోనే వున్నాడని మెచ్చుకోవాల్సిందే.

ఆనంద్ కారు ఆగిన చప్పుడయింది.

"నాక్కాస్త పనుంది మీరు బయల్దేరండి అన్నాడతను.

"బర్త్‌డేకి రారా?"

"వస్తే వస్తాను, లేకపోతే లేదు"

అతను నాతోబాటు బయటకొస్తే ఆనంద్ కడుపులో కుతకుతలాడచ్చు. ఆ సంగతి రాకేష్‌కి తెలును. పనుంది అనేది ఒక నెపం- అంతే.

బజారుకెళ్ళి శైలేష్‌కోసం డ్రెస్ తీసుకున్నాం.

దారిలో 'లాశాంగ్రిలా'కి వెళ్ళి కాఫీతాగాం. లాశాంగ్రిలా చూడగానే ఆరోజు ఆనంద్‌ని హత్యచెయ్యాలని నేవేసుకున్న ప్లాను గుర్తుకొచ్చింది.

ఇంటికి వెళ్ళేటప్పుడు ఆనంద్ పన్నెండుకోట్ల రూపాయలు మింగి రాజీనామా ఇచ్చిన ఆర్థికమంత్రి గురించి చెప్పాడు.

"బుద్ధిమంతుడు. ఇంకవాడికి మంత్రిపదవెందుకు? రాజకీయాలెందుకు?"

"రాజీనామా ఇచ్చేస్తే ఇంక శిక్షపడదని అర్థంకాదుకదా? అలాచూస్తే రాజీనామా ఏం శిక్షకాదుగా"

"జనం అంతకే ఆనందపడిపోతారు. మంత్రి అన్నవాడు ఎంతడబ్బు మింగినా రాజీనామా ఇచ్చేస్తే సంతోషం మన ప్రజలకి. అంతకంటే తెలివి వీళ్ళకుండదు. మంత్రిమండలిని రద్దుచేస్తే చాలు, పాతనేరాలన్నింటిని మర్చిపోతారు. కొత్త మంత్రిమండలి వచ్చినా వాళ్ళూ స్థిరపడగానే చేసేదాపనేకదా! లోపల్లోపల పాతవులులకి ప్రొటెక్షనిస్తారు" అని నవ్వి, "ఇదంతా చూస్తుంటే ఈ మాయదారి ఉద్యోగాల్లో చేరకుండా రాజకీయాల్లో దూరివుండే ఈపాటికి ఓ మంత్రిపదవి దొరికుండేది. పన్నెండుకోట్లు కాకపోతే నాలుగైదుకోట్లు దొరికినాచాలు, సుఖంగా బతికెయ్యొచ్చు. ఈ గానుగెద్దు బతుకు తప్పేదికద"

"ఇది స్వార్జితం. అది ప్రజలసొమ్ము"

"డబ్బు అన్నాక అంతా ఒకటే" అని గట్టిగా

నవ్వాడు.

ఆనంద్ కొత్తమాటలు మాట్లాడుతున్నాడే మిటి? తలకాయలోకేమన్నా కొత్త ఆలోచనలు పుట్టుకొచ్చాయా? అని అనుమానం వచ్చింది.

'కోటి రూపాయలొచ్చినా నీ బతుకులో, బు ద్రలో ఏమన్నా మార్పొస్తుందా? ఏమీరాదు. ను వ్వెప్పుడైనా అదే మృగరూపానివి' అందామా అనిపించింది.

★ ★ ★

శైలేష్ పుట్టినరోజు పార్టీకి ఆనంద్, సుధ వెళ్ళేసరికి ఆలస్యం అయింది.

ఆనంద్ మేకప్ పూర్తవుతుందా అసలు అనిపించిపోయింది సుధకి. చివరికి ప్యాంటు లోపల షర్టు దూర్చుకొని, అది వెనుకవేపు సరిగ్గా అమరిందా లేదా అని సుధని అడిగి, 'వుంది' అని ఆమె దృఢపరిచాక తన అలంకారం వల్ల అతనికి సంతృప్తికలిగినట్టు తోచింది. అయినా జుట్టు నీట్‌గా దువ్వుకున్నా క్రాఫ్ సరిగ్గావచ్చిందా అని రెండుసార్లు లోపల కివచ్చి అద్దంముందు నుంచుని సరిచూసు కుంటే తప్ప రథం కదల్లేదు.

సుధ లేతగులాబీ రంగు చీర కట్టుకుని అదేరంగు జాకెట్టు వేసుకుంది. ఆమె లేత ఎరుపు శరీరానికి ఆ రంగు చక్కగా నప్పింది.

"సారీ వుయార్ లేట్" అంటూ వళ్ళు ఇకిలించి పైపై మాటలాడాడు ఆనంద్.

"బెటర్ లేట్ దేన్ నెవర్" అని మహేష్ అనందర్భంగా మాట్లాడాడు. క్లిష్టమైన అలంకా రిక పదాల్నువయోగించడం మహేష్‌కి సరదా అలవాటు

శైలేష్ పరుగులు పెడుతూ ఫ్రెండ్స్‌తో ఆట లాడాడు. పింకూ కూడా వాళ్ళ వెనకాలే పరుగు లు పెట్టింది.

పిల్లల్తోవచ్చిన అతిథులంతా వెళ్ళిపోయాక కార్డ్సు ఆడుతూ, విస్కీ తాగుతూ మిగిలినవా ళ్ళు ముగ్గురు మగవాళ్ళు, వాళ్ళ భార్యలూను, ఆనంద్, సుధ, డాక్టర్ విల్సన్, వారి శ్రీమతి గ్రేస్, డాక్టర్ వీరేంద్ర, ఆయన భార్య సప్నా.

విస్కీతో కబుర్లు మంచి ఊపులో వున్నాయి.

"మంచి సినిమా ఏదన్నావుంటే చూడ చ్చు" అన్నాడు డాక్టర్ విల్సన్.

"ఇక్కడే దయానాలో 'సోనేకా పాయల్' వుందిగా"

"మేం చూశాం, ఇట్స్ హారిబుల్" అంది సప్నా.

"అంతచెత్తగా ఏమీలేదు" అన్నాడు వీరేంద్ర.

"ఏంలేదందులో. ఫైటింగ్-డాన్స్, ఫైటింగ్ డాన్స్. సోనేకాపాయలూ లేదు, చాందీకాపాయ లూ లేదు. ఉట్టి క్యాబరే డాన్స్, సెక్స్ అంతే. వీటన్నిటినీ సెన్సార్‌వాళ్ళెలా వదిలేస్తారో అర్థంకాదు"

వీరేంద్ర ఓ సిప్ తీసుకుని-

"సెన్సార్ ఒక నెపం. అందరికీ అదికా వాలి" అని నవ్వాడు.

"నేను దానికొప్పుకోను"

సరే... వీరేంద్ర సప్న తగువు మొదలెడితే ఎవరు గెలుస్తారో చెప్పడం కష్టం. అందరెదు రుగా తగువులాడుకుని ఇంట్లో సామరస్యంగా జీవించే ఆదర్శజంట వారిది.

"అదంతా వుట్టి హిపోక్రసీ. స్త్రీ నిజమైన అంతరంగం అలా వుండదు. అదివేరు"

"మరెలా వుంటుందిట?" సప్న రెచ్చగొడు తోంది.

"సినిమాల్లో, సినిమా పోస్టర్లలో ఆడదాన్ని అర్ధనగ్నంగా చూపించడానికి వీల్లేదని నమ్మె చేసేవాళ్ళే, ఆందోళన లేవదీసేవాళ్ళే ఇలాంటి సినిమా హాళ్ళలో దూరరా? ఉపన్యాసాల్లో ప్రతి ఘటన, చేతల్లో ప్రోత్సాహం చూపించరా?"

"మరేం చేయాలో చెప్పరాదా?" గ్రేస్ అడి గింది.

"వారు కలిసికట్టుగా ఉండాలి. అశ్లీలం అనిపించిన సినిమాలన్నీ బహిష్కరించాలి. థియేటర్ ఎదురుగా 'స్త్రీలారా ఈ సినిమానెవ రూ చూడకండి' అని బ్యానర్లు పట్టుకుని కావలా నుంచోవాలి"

"అంటే పురుషులు చూడొచ్చు అని అర్థమా?" విల్సన్ నవ్వుతూ అడిగాడు.

"స్త్రీలంతా బహిష్కరించాక పురుషులు మాత్రం వాళ్ళ కళ్ళుగప్పి ఎలా వెళ్ళగలరు. వారిని వారి భార్యలు ఇంట్లో చెండాడెయ్య రూ?" డాక్టర్ మహేష్ నవ్వుతూ అన్నాడు.

"ఆడవాళ్ళందరూ క్యాబరే, స్ట్రిప్ టీసింగ్ చేసేస్తేనరి, థియేటర్లన్నీ ఖాళీ అయిపోతా యంతే" అన్నాడు ఆనంద్.

అందరూ నవ్వేశారు.

వీరేంద్ర మరో సిప్ విస్కీతీసుకుని గంభీరంగా మాట్లాడసాగారు.

"అవన్నీ జరిగే విషయాలు కావులెండి. ఈ స్త్రీల ప్రతిఘటన[అనేది వుట్టి హడావుడి వ్యవహారం అంతే. వాళ్ళూ ఈ క్యాబరేలని, స్ట్రిప్‌టీసింగ్‌ని ఇష్టపడతారు. చూసి ఆనందిస్తారు. అంటే మగవాళ్ళు ఎంజాయ్ చేసినంతగానూ చేస్తారు. ఆడదెప్పుడు తనని తను ప్రదర్శించుకోడానికి ఇష్టపడుతుంది. అది స్త్రీత్వపు ఒక అంశం. తన సౌందర్యం నలుగురూ చూడాలి. మగవాళ్ళు ఆడవాళ్ళను మెచ్చుకోవాలి అని ఇంచుమించు ప్రతి ఆడదీ కోరుకుంటుందనుకుంటాను. సంప్రదాయాల ఒత్తిడివల్ల, కొన్ని అదృశ్య నిర్బంధాలవల్ల కొందరికి అది సాధ్యపడదు. తెరమీద స్త్రీ ఈ నిద్రాణమైన కోరికలకి ఒక రూపాన్ని కల్పిస్తుంది. ప్రదర్శించడానికి వీలైనంతవరకు ప్రదర్శిస్తుంది. కలలని నిజం చేసి చూపిస్తుంది. ఇందులో ప్రేక్షకురాలైన స్త్రీకి ఒక గుప్తమైన కోరిక తీరిన ఆనందం దొరుకుతుంది. అదే ఆనందం పురుషుడికెంత కావాలో స్త్రీకి అంతే కావాలి"

వెంటనే మహేష్ అందుకున్నాడు-

"యు ఆర్ రైట్. మగజాతికి అక్కర్లేదంటే ఆడజాతి తన వీపు, పొట్ట, నగం ఎద ఖచ్చితంగా చూపించదు. ఆడదానికి చూపించుకోవాలనిపించేది ఈ కారణంవల్లే. ఈ చూపించుకోవాలన్న తాపత్రయంలేని జాతులు రెండు రకాలున్నాయి. ఈ భూమ్మీద. ఒకటి ఒంటి నిండుగా బట్టలు వేసుకునేవాళ్ళు. రెండు-అసలు బట్టలు వేసుకోని వాళ్ళు"

"బట్టలే ధరించనివాళ్ళు చూపించుకోవాలని తాపత్రయపడేదేముంటుంది గనుక" అన్నాడు విల్సన్.

అందరూ నవ్వారు.

"కెన్యాలో వున్నప్పుడే అనుకునేవాడిని, అక్కడ నగ్నంగా తిరిగే ఒక జాతివుంది. వారి మనసుల్ని ఆకర్షించేలా సినిమా తియ్యాలంటే ఎలా? అని"

"బహుశః అన్ని శరీర భాగాలు మూసేసి కళ్ళు మాత్రం బయటకి కనిపించేలా సినిమా తీస్తేనరి" గ్రేస్ అంది. అందరూ మళ్ళీ నవ్వారు.

వీరేంద్ర అన్నాడు-

" నా దృష్టిలో పురుషుడుగాని స్త్రీగాని శరీరాంగాలని చూపిస్తే అశ్లీలమేమీ కాదు. నాలుగురోజులు కొత్తగా అనిపించచ్చు, తరువాత అందులో ఏమీ ఆకర్షణ కనిపించదు"

"ఆమాట నిజమే, ఇరవైయేళ్ళక్రితం సినిమాల్లో కొంగుజారడం అనేది ఒక అపూర్వ సన్నివేశంలా వుండేది. ఇప్పుడు మగవాడే ఆడదాని చీర, బ్లౌజు, బ్రా అన్నీ విప్పేదృశ్యాన్ని స్పష్టంగా చూపిస్తున్నారు. ఇప్పుడు కొంగు జారడమనే విషయాన్ని విశేషంగా కాదుకదా, మామూలుగా కూడా పట్టించుకోరు. నగ్నంగా నటించడానికే సిద్ధం, ముద్దులు, ప్రణయకేళికీ కూడా సిద్ధం అని నటీమణులు ప్రకటిస్తున్నారు. ఇంకో ఇరవైయేళ్ళకి ఇవన్నీ సిల్లీగా, నీరసంగా అనిపిస్తాయి" అన్నాడు విల్సన్.

"పైపైకి వద్దనే వాళ్ళుకూడా స్టాండర్డ్‌గా అలా వుండరు. రహస్యంగా వీలుంటే వాళ్ళూ సిద్ధమే. బహిరంగంగా మాత్రం భయం. సంఘం అంటే భయం. ఎందుకో తెలియని భయం. ఈ భయం అనేది ఒకరకంగా శాపం. వుయ్‌మస్ట్‌బి లిబరేటెడ్ ఫ్రం దిస్. అప్పుడే చీకటిపడ్డాక కూడా వీధుల్లో నడవడానికి స్త్రీ సిద్ధపడగలదు. వీధిదీపాల్లేని వీధిలో నడవడానికి ఆమె భయపడదు. తన భర్త ఎదురుగా తన పరిచయస్తుడైన మగవాడితో నవ్వుతూ మాట్లాడ్డానికి జంకదు. బస్సుల్లో పరపురుషుల పక్కన కూర్చుని ప్రయాణం చేయడానికి ఆమెకి సాధ్యపడుతుంది. ఎవరో తనని స్పృశించారని ఆమె భ్రమపడి, తనదేదో పోయిందనీ, అతడికేదో దొరికిందనే భావనతో మండిపడదు. అందరూ తనని కాముక దృష్టితో చూస్తున్నారని భ్రమించదు" వీరేంద్ర అన్నాడు.

వెంటనే విల్సన్ చెప్పాడు,

"అది నిజమే... మగవాడుకూడా కాస్త హాయిగా ఊపిరి తీసుకోగలుగుతాడు. బస్సులో





కావాలని ఆడవాళ్ళ ఒంటిని రాచుకుంటూ నుంచునే అగత్యం అతనికి వుండదు"

మహేష్ అన్నాడు-

"స్త్రీకయినా, పురుషుడికయినా ఈ అగత్యం ఎందుకొస్తుంది? ఆడది అవసరానికిమించి దాచుకోడంవల్లనా?"

"లేదు...అవసరమైనదాని కంటేతక్కువ దాచు కోడంవల్ల" అందరూ కిలకిల నవ్వారు. అందరికి విస్కీ తలకెక్కింది. చివరికి శీలా నోరు తెరచింది.

"నా దృష్టిలో, అంటే సమాజ శాస్త్రీయ దృక్పథంతో ఆలోచిస్తే ఆడవారికి, మగవారికి వివాహానికి ముందు సన్నిహితంగా మెలిగే అవకాశం కావాలి. లైంగికంగా అని చెప్పను గాని, మగవాడికి స్త్రీవట్ల వున్న కుతూహలంగాని, స్త్రీకి పురుషుడివట్ల వున్న కుతూహలంగాని అనవసరమైనదైతే దాన్ని పోగొట్టి దేహం మీంచి మనసుమీదకి దృష్టి మళ్ళిస్తే ఆరోగ్యకరమైన సమాజం నిర్మితమవుతోంది"

"బ్యూటిఫుల్లీ సెడ్" అన్నాడు విల్సన్ అందరూ అతన్ని ఆమోదించారు.

గ్రేస్, స్వప్న బాగా విస్కీ లాగించారు. శీలాకూడా సుమారుగా తీసుకుంది. వెనుకటి సంవత్సరం పార్టీలో సుధ ఎవరి బలవంతానికి లొంగలేదు. ఈసారి ముగ్గురు మహిళామణులు కలిసి ఆమెని తెగ వేధించారు. సరే, ఏమైతే అదయిందిలే అని సుధ కూడా కాస్త రుచి చూసింది. వాళ్ళంతటితో వదిలిపెట్టకుండా ఇంకా ఇంకా తాగించారు.

వెస్టర్న్ డిస్కో డుండుడుం అని మ్రోగడం మొదలెట్టగానే అందరూ లేచి గెంతసాగారు. కొంచెంసేపు ఆ డాన్స్ అనబడే గంతులు, ఊపులు అయ్యాక మహిళలంతా కలసి సుధని కూడా బలవంతంగా లేపి పట్టుకొని గెంతించారు.

ఆడావాళ్ళ నవ్వులు, మగవారి అట్టహాసాలు కలిసి అదొక రసభరితమైన, ఉత్సాహపూరితమైన దృశ్యంగా రూపొందింది. కాని ఈ సంబ్రమాన్ని చూడ్డానికి తొమ్మిదవ వ్యక్తి అక్కడలేదు. అటువంటి వ్యక్తి ఒకడుండివుంటే అతని తలకాయలో సుఖాన్ని ఉన్మాదాన్ని సృష్టించగలిగిన దృశ్యం అది.

"టేకిట్ ఈజీ" అంటూ ఆనంద్ నడుంవూపుతూ సుధతో అన్నాడు.

అందరూ డాన్స్ చేసి చేసి అలసిపోయారు. సుధకి ఒళ్ళు స్వాధీనంలో బొత్తిగా లేదు. జారి నేలమీద పడిపోయే పయిటని ఎన్నిసార్లో ఎత్తి ఆమె భుజంమీదకి సర్దాల్సొచ్చింది. తనెక్కడో ఆకాశంలో తేలుతున్నట్టుందామెకి.

మిగిలిన వాళ్ళంతా విశ్రాంతి తీసుకుంటూ మళ్ళీ మరికాస్త విస్కీ సేవించారు. సుధ సొలిపోయి సోఫాలో ఒరిగి కళ్ళు మూసుకుంది.

శైలేష్ ఎప్పుడో నిద్రపోయాడు. పింకూ సోఫాకింద ప్రాణం లేనట్టు పడుకునుంది. డిస్కో సంగీతం, డాన్స్ ఇవేవీ దాన్ని కదిలించ లేదు.

మహేష్ వీడియోలో ఒక కాసెట్ వేసి లైటు ఆర్పేసి, " ఇటీస్ ఎ సర్ప్రైజ్ టేకిట్ స్పోర్టివ్లీ" అన్నాడు ఏమిటా అని అంతా కుతూహలంగా చూశారు. అది సుధకి తప్ప ఇంకెవరికీ కొత్తకాదు. అందుకే తనచేత అంత బలవంతంగా తాగించారని సుధకి అర్థమయింది.

ఐశ్వర్యంవల్ల, విపణి వీధుల్లో దొరికే కొత్తకొత్త సుఖోపభోగ వస్తువులతోను, జీవిత క్షణాల్ని బెలూనుల్లా పూరించి పగలనీకుండా, పగిలిపోతుందేమో అని అనిపించేవరకూ వూదివూది జీవించడంలో, ఆనందపుటంచుల్ని చూడగలం, ఇదే జీవితం దీనికంటే లోతైన దింకేమీ లేదు. అని అంతా నమ్ముతున్నారన్న సంగతి ఇవాళ సుధకి అర్థమయింది. ఆమెకి తల గిరగిర తిరగసాగింది. సాధ్యమయినంతవరకు కళ్ళు తెరచిచూడ్డానికి ప్రయత్నించింది. కళ్ళు తెరచినా తెరచిలేవేమో అనే అనిపించింది. అందరూ తనలాగే వున్నారేమో, అంతా అస్పష్టంగా వుంది. అంతా గెంతుతున్నట్టో, పాకుతున్నట్టో కనిపిస్తోంది. మృగాల్లాగా లేరు, మనుషుల్లాగా లేరు.

తనని అన్నివేపుల్నుంచీ ఏదో గుచ్చుతున్న అనుభవం ఒకసారి వెలుగు, ఒకసారి చీకటి. వెలుగులో ఆ ముఖాలన్నీ నల్లటి ఎలుగుబంటి ముఖాల్లా అనిపిస్తున్నాయి. ఒక ఎలుగుబంటి సుధని కౌగిలించుకుంది సుధ క్షీణంగా అరచింది. మిగిలిన ఎలుగుబంట్లన్నీ

నవ్వాయి. సుధని వాటేసుకొన్న ఎలుగుబంటి తన ముఖ కవచపు డిప్పని ఎత్తి చూపించింది. ఆనంద్! ఆమెకి స్థిమితం కలిగింది. కాని ఆ స్థిమితం అంత గొప్పదేమీ కాదు. మళ్ళీ చీకట్లో పాకడాలు, పొర్లడాలు, గజిబిజి మళ్ళీ వెలుగురాకనే పోయేసరికి ఆమెక అనిపించింది. మృగాల ముఖ కవచాలు కాదు, నిజంగా మృగాలే అని. తను మాంసపు ముద్దనిపించింది. తను శవమనిపించింది. సజీవ ప్రేతమనిపించింది.

తరువాతేమయిందో ఏమీ గుర్తులేదు. తెలిసినా అదంతా అస్పష్టమే. వాస్తవికతకీ భ్రమకీ భేదమే లేదు.

సుమారు సూర్యోదయవేళకి సుధకి మెలకువ వచ్చేసరికి తను తన ఇంట్లో లేదన్న సంగతి అర్థమైంది. ఆనంద్ ఆమె పక్కనే పడుకుని గురకపెడుతున్నాడు.

వాళ్ళు వున్నది డాక్టర్ మహేష్ ఇంట్లోనే. లేవాలి కాబట్టి లేచింది. హాల్లోకి వచ్చేసరికి పల్చటి నైటీలో తన గదిలోంచి బయటకొచ్చింది. శీలా.

"గుడ్‌మార్నింగ్ సుధా" అంది తియ్యగా.

"గుడ్‌మార్నింగ్" సుధ తప్పనిసరిగా అంది.

అవే బూజుపట్టిన పాత పలకరింపులు. అర్థంలేని మాటలు. నాగరికులమంటూ విజృంభించే ఈ అనాగరిక ప్రపంచంలో ఒకరొకరు వంచించుకోడానికి సృష్టింపబడ్డ మాటలు అనుకుంటూ టాయిలెట్‌లోకి వెళ్లింది.

ఒక జంతువు మాస్క్ టాయిలెట్‌లో గోడకున్న హుక్‌కి వేళ్ళాడుతోంది.

అయితే ఈ జంతు ముఖాలు ధరించడం నిజంగా జరిగిందన్నమాట. ఇంకా తన భ్రమో, కలోననుకుంది తను.

కాఫీలు తాగుతుంటే పార్టీకి అటెండవని రాకేష్ విషయం వచ్చింది.

"పొగరుబోతు పొట్టేలు" అన్నాడు ఆనంద్.

"ఏం చూసుకునో అంత పొగరు?" అన్నాడు మహేష్.

"ఇంగ్లీష్ లిటరేచర్‌లో ఏదో కాస్త భట్టీయం పట్టాడు. అందుకుని!"

"పిసినిగొట్టు మొహం" అన్నాడు మహేష్ తిరస్కారంగా.

డాక్టర్ వీరేంద్ర దంపతులు, డాక్టర్ విల్సన్ దంపతులు వెళ్ళేటప్పటికి ఒంటిగంటన్నర యింది. ఆడవాళ్ళే కార్లు డ్రైవ్ చేసారన్నారు ఆనంద్‌వాళ్ళు.

"కార్లోంచి దిగి ఇంట్లోకి ఎలా వెళ్ళుంటారో దేవుడికే తెలియాలి" అంది శీలా.

సుధ తప్ప అంతా నవ్వారు.

"విల్సన్ మరీ పీక్‌లో ఉన్నాడు. అందుకే వాడిని ఫ్రంట్‌సీట్‌లో కాకుండా వెనక సీట్‌లోపడేశాను" అన్నాడు మహేష్.

మరోసారి ముగ్గురూ గట్టిగా నవ్వుకున్నారు.

పింకూ ఎక్కణ్ణుంచో వచ్చి నల్గురి ముఖాల్నీచూస్తూ నుంచుంది. శైలేష్ ఇంకా నిద్రలేవలేదు.

శీలా పింకూని దగ్గరకి పిల్చింది. అది ఆమె కాళ్ళదగ్గరగా కూర్చుంది.

కాలింగ్‌బెల్ డింగ్‌డాంగ్ అని శబ్దంచేసింది. ఆ శబ్దానికి శైలేష్ లేచొచ్చాడు.

శీలా వెళ్ళి తలుపుతెరిచింది.

రాకేష్ లోపలకొచ్చాడు.

రాకేష్ చేతిలో వున్న పెద్ద ప్యాకెట్ శైలేష్ చేతిలోపెట్టి, వాడికి షేక్‌హ్యాండిచ్చి కూర్చున్న వాళ్ళవేపు వచ్చాడు. డాక్టర్ మహేష్‌తో-

"క్షమించండి, నిన్న రావడానికి వీలవలేదు. ఒక స్నేహితుడింటికి వెళ్ళాను. అతని తండ్రికి ఏక్సిడెంట్ అవడంతో రాత్రంతా అక్కడే వుండిపోవాల్సొచ్చింది" అన్నాడు.

"ఫరవాలేదులెండి. రండి కాఫీ తాగుదాం" అని కుర్చీ చూపించాడు మహేష్.

శీలా కూడా తియ్యగా నవ్వుతూ ఆహ్వానించింది.

శైలేష్ రాకేష్ ఇచ్చిన ప్యాకెట్టువిప్పి దాంట్లోని వస్తువుని పైకితీసాడు.

అదొక పంజరం. పంజరం లోపల ఒక భయంకరమైన గొరిల్లా. పంజరంచుట్టూ బటన్స్‌వున్నాయి. ఒక బటన్ నొక్కితే గొరిల్లా గర్జిస్తుంది. ఇంకొకటి నొక్కితే పళ్ళికిలిస్తుంది. మరో

బటన్ నొక్కితే కుప్పిగంతులేస్తుంది. ఇంకో బటన్ నొక్కితే చేతులు, కాళ్ళు కదుపుతుంది. ఇంకా ఒకటి నొక్కితే కళ్ళు మూసి తెరుస్తుంది......

సుధకి ఎలుగుబంట్లు గుర్తొచ్చాయి.

అన్నిటికంటే ఖరీదయిన బహుమతి అది.

'సరిఅయిన దెబ్బే కొట్టాడు రాకేష్' అనుకుని బయటికి తన్నుకురాబోతున్న నవ్వుని ఆపుకుంది సుధ.

శీలా చాలా ప్రసన్నురాలైంది. శైలేష్ బటన్స్ నొక్కే వ్యవహారంలో తనని తాను మరచిపోయాడు.

రాకేష్‌కి కాఫీ వచ్చింది.

శీలా అడిగింది,

"ఎల్లుండి ఆదివారం పిక్నిక్‌కి వెళ్దామా?"

"ఎక్కడికి?" ఆనంద్ అడిగాడు.

"ఎలిఫెంటా" అన్నాడు మహేష్.

"ఎలిఫెంటా చూశాం కదా, ఎలిఫెంటావద్దు, కళ్యాణ్‌కి వెళ్దాం" అన్నాడు ఆనంద్.

"ఏముందక్కడ?" మహేష్ అడిగాడు.

"అడవులు, కొండలు" చెప్పాడు ఆనంద్.

"దట్స్‌నైస్" అన్నాడు రాకేష్.

ఇదీ ఒక అడవేకదా అంది సుధ అంతరంగం.

"నువ్వొవస్తావ్ కదా?" మహేష్ రాకేష్‌నడిగాడు.

"ప్రయత్నిస్తాను"

"ప్రయత్నించడంకాదు, యుమస్ట్ జాయిన్ అజ్" అంది శీలా.

"నాకు జంట లేదుకదా, నేనెందుకు మీమధ్య పానకంలో పుడకలాగ?"

"మేం పానకాలు సేవించడం ఎప్పుడో అయిందిగాని, ఇది కేవలం పిక్నిక్ అంతే, జంటలతో పనిలేదు. జస్ట్ గివ్ అజ్ యువర్ కంపెనీ" అన్నాడు మహేష్.

ఐదు నిమిషాల క్రితం రాకేష్ గురించి అసహ్యంగా మాట్లాడినవాళ్ళు వీళ్ళేనా? అని ఆశ్చర్యపోయింది సుధ.

"సుధా! బొమ్మలా కూర్చున్నావేమిటి? నీ అభిప్రాయం చెప్పు" అడిగింది శీలా.

"మీరు డిసైడ్ చేసేదాంట్లో నా అభ్యంతరం ఏముంటుంది?"

"నీకు జంట కావాలంటే మా బ్యాంకు నుంచెవర్నయినా తీసుకొస్తాను" అన్నాడు ఆనంద్ రాకేష్‌తో.

"అటువంటిదేమీ వద్దు" అన్నాడు రాకేష్.

భయపడకు, "నోస్ట్రింగ్స్ ఎటాచ్‌డ్" అని నవ్వాడు ఆనంద్.

"అడవుల్లో తిరిగేటప్పుడు స్ట్రింగ్స్ వుంటేనే అందం" అన్నాడు రాకేష్.

★ ★ ★

మా స్టాండర్డ్ కారులో మేమిద్దరమే. వెనుక సీటులో టిఫెన్లు, డ్రింక్స్ వున్న బాక్స్.

మహేష్ అంబాసిడర్ కారులో ముందు సీట్లో శీలా మహేష్, వెనుక సీట్లో రాకేష్.

శైలేష్‌ని పింకూని ఆయా దగ్గర వదిలేసింది శీలా. పిక్నిక్స్‌లో పిల్లలు నేర్చుకోవలసింది, ఎంజాయ్ చేసేది ఏమీ వుండదు సరికదా, న్యూసెన్స్‌గా వుంటుందన్నది ఆ భార్యాభర్తల అభిప్రాయం. కుక్కపిల్లని తీసుకురావాలని శీలా సరదాపడిందిగాని మహేష్ ఒప్పుకోలేదు. "నీకు కుక్కపిల్లే కావాలంటే నేను రానంతే" అన్నాడతను.

కళ్యాణ్ అడవిలో ఒక్క మొక్కపేరుగాని, ఒక్క చెట్టుపేరయినాగాని ఏ ఒక్కరికీ తెలియదు. నాకు అడవులంటే ఇష్టం అని వీళ్ళెందుకు చెప్పుకుంటారో అర్థంకాదు.

అక్కడ చేసిన ఘనకార్యం మాత్రం ఏముంది? తినడం, తాగడం. ఇంకా అశ్లీలమైన, ఘోరమైన అసహ్యకరమైన సెక్స్‌జోకులు. ఇలాంటి జోక్స్ చెప్పడంలో మహేష్‌ని మించిన వాళ్లుండరు. అతను అమెరికన్ స్లాంగ్‌ని ఆ విషయంలో ఆ రంగంలో సంపూర్ణంగా వుపయోగించుకుంటాడు. జోక్స్ మాత్రమే కాకుండా వైద్యరంగంలో తనకయిన అనుభవాలని రంజుగా వర్ణించిచెప్తాడు.

మేం ఎక్కువగా తిరగనూ లేదు. కొన్ని పెద్దపెద్ద చెట్లు పెద్దబండరాళ్లు పరిచివున్న చోట మా పిక్నిక్ పూర్తయింది. అడవిని ప్రేమించామని చెప్పేవాళ్ళు అడవిని తనివితీరా చూసినట్టూ లేదు. అడవిమీద వారికున్న





ప్రేమా కనపడలేదు. నేను నా స్వభావం ప్రకారం ఎక్కువ మాట్లాడకుండానే వుండిపోయాను. మితభాషి అయిన రాకేష్ సభ్యమయిన మాటలు జరిగినప్పుడు మాటల్లో బాగానే పాల్గొన్నాడు.

సుమారు నాలుగ్గంటలకి మళ్ళీ తిరుగుప్రయాణమయ్యాం. ఒక విధంగా చెప్పాలంటే, అది అత్యంత విస్మరణీయమైన పిక్నిక్. ఎందుకంటే ఆ పిక్నిక్‌లో అటువంటి ప్రాధాన్యత, ప్రత్యేకత ఏమీ లేదు. జ్ఞాపకాల్లో మిగిలిపోయేలాంటి సంఘటనలూ ఏమీ లేవు. అదొక వ్యర్థమైన పిక్నిక్ అన్నవిషయం ఎప్పటికీ గుర్తుండిపోతుందంతే.

కాని రాకేష్ ఉనికితో అది గుర్తుంచుకోదగ్గరోజుగా పరిణమించింది.

రాకేష్ కారు దిగి-

"ఇట్‌వాజ్ ఎ వండర్‌ఫుల్ పిక్నిక్. వు హ్యాడ్ ఎ నైస్‌టైమ్. థాంక్యూ" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అబద్ధం! ఓహ్... ఈ అబద్ధాలు లేకుండా బతకనేలేమా? అని అడగాలనిపించింది.

"రండి... కాఫీ తాగి వెళ్దురుగాని" అంది శీలా.

అంతా హాల్లో కూర్చున్నాం. మహేష్, ఆనంద్ కబుర్లు చెప్పుకుంటున్నారు. నేను తలనొప్పిని తిట్టుకుంటూ న్యూస్‌పేపర్ చేతిలోకి తీసుకున్నాను.

శీలా ట్రేలో కాఫీ, నట్స్, బిస్కట్స్ తెచ్చింది.

మేం కాఫీ తాగుతుంటే కాలింగ్‌బెల్ మోగింది. శీలావెళ్ళి తలుపు తీసింది.

ముగ్గురు ఆడవాళ్ళు, ముగ్గురు మగవాళ్ళు వున్న గుంపొకటి లోపలికొచ్చింది. అందులో రెండు జంటలు పెళ్ళయినవి. ఒక జంట పెళ్ళికాబోతున్న జంట. అంతా మహేష్ కుటుంబానికి సంబంధించినవాళ్ళే. పెళ్ళికి ఆహ్వాన పత్రికనివ్వడానికి వచ్చారు.

మహేష్ మా పరిచయం వారికి, వారి పరిచయం మాకూ చేశాడు. అంతా ఐశ్వర్యపు టంచులమీద విహరిస్తున్నవాళ్ళే. ఆహ్వానపత్రికలోని అక్షరాలు నిజంగా బంగారంతో చేయించారేమో అనేటట్లున్నాయి. ఒకపక్కగా వధూవరుల ఛాయాచిత్రాలు.

ఆ దంపతులలో ఒక స్త్రీ ముప్ఫయి సంవత్సరాలు దాటని ఆమె, చాలా అందంగా వుందికూడా. ఆమె కళ్ళు విశాలంచేసి ఆనంద్ వంక చూసింది. ఆమె ముఖంలోఆశ్చర్యం, గందరగోళం కనిపించింది. ఆనంద్ ఆమె వంక చూడకుండా మరోవేపు చూస్తున్నాడు. ఒక నిముషం తరువాత ఆమె శీలాతోబాటు లోపలికి వెళ్ళింది.

శీలా వారందరికి కూల్‌డ్రింక్స్ తెచ్చింది. శీలాతోబాటు ఆమెకూడా బయటకొచ్చింది. శీలాకూడా ఓసారి ఆనంద్‌వేపు ప్రత్యేకంగా చూసినట్టు తోచింది.

"క్షమించండి. మేమింక వెళ్ళొస్తాం" అని ఆనంద్ లేచినుంచుని అందరికీ నమస్కరించాడు. అతని గొంతు కంపిస్తున్నట్టు అనిపించింది.

నేను ఆ స్త్రీ ముఖంలో ఆనంద్‌వంక ఒక తిరస్కారపు దృష్టిని గమనించాను. ఆనంద్ వెళ్ళడానికి అడుగులేశాడు.

ఆనంద్ గడపదాటుతుంటే 'బీస్ట్' అనే తిరస్కారపుమాట అందరికీ వినిపించే వుంటుంది. నాకేమో స్పష్టంగానే వినిపించింది.

ఇల్లుచేరగానే అడిగాను -

"ఆమె ఎందుకలా అంది? ఆవిడతో మీకెలా పరిచయం?"

నా స్వరం కంపించింది. నా దేహంకూడా కొద్దిగా వణుకుతోంది.

"పిఊజ్ ఎబిచ్! ఎల్లెల్బీలో నాక్లాస్‌మేట్. ఆ అమ్మాయి నాకోసారి లవ్ లెటర్ రాసింది. నేను వూరుకోక ఒక చిన్న తప్పుచేశాను. అవుత్తరాన్ని నా ఫ్రెండ్సందరికీ చూపించాను. వాళ్ళంతా ఆ అమ్మాయిని ఆట పట్టించారు. అప్పుడు ఆ అమ్మాయి కాలేజ్ వదిలిపెట్టేసింది. తరువాత బ్యాంకు పనిలో చేరిందట"

నేను అతని సంజాయిషీని నమ్మలేదు. అయినా అది తాత్కాలికంగా భావోద్వేగాన్ని అదిమిపెట్టుకుందుకు సహాయపడింది. తన ఎదురుగా భర్తని ఆమె బీస్ట్ అని తిట్టిందంటే ఆనంద్ చెప్పిందంతా నిజమ

య్యే అవకాశం లేదు. ఈ విషయాన్ని తెలును కోలేనంత మొద్దునికాదు నేను. అదీకాక ఆమె ముఖంలో తేలునో, పామునోచూస్తే కనిపించే భావం కనిపించింది. ఆనంద్ చెప్పిందే నిజమైతే, ఆమె ఆ రకమైన ముఖభావం చూపించవలసిన అవసరం ఏముంది?

అసలు సంగతేమిటో తెలుసుకోవాలని అనువైన సమయంచూసి శీలాని అడిగాను -

తను చెప్పడానికొప్పుకోలేదు. మళ్ళీ ఈ సంగతి ఆనంద్‌ని అడగను అని ఒట్టువేయించుకుని, నేను మరీ ఒత్తిడిచేయడంతో అసలు సంగతి చెప్పింది.

శీలా చెప్పిన సంగతివింటే నాకు ఆత్మహత్యచేసుకోవాలనిపించింది.

ఆ స్త్రీపేరు దేవిక, ఆమె ఒకసారి స్నేహితురాలితో కలిసి సినిమాకి వెళ్ళింది. వాళ్ళు టికెట్‌కోసం క్యూలో నుంచున్నారు. వాళ్ళవెనుకే ఆనంద్‌కూడా వున్నాడు. బాల్కనీలో ఆనంద్ వాళ్ళవక్కనే కూర్చున్నాడు. సినిమా మొదలవగానే ఆనంద్ దేవిక ఒంటిమీద చెయ్యివేయడం మొదలెట్టాడు. దేవిక చాలాసార్లు వార్న్‌చేసింది. ఆనంద్ వూరుకోలేదు సరికదా, "జస్ట్ ఎంజాయ్ ఇట్, డోంట్ మేక్ ఎ సీన్' అన్నాడట. ఆమె ఇంటర్‌వల్‌వరకూ ఎలాగో తట్టుకుని తరువాత కంప్లెయింట్ ఇవ్వడానికి థియేటర్ మేనేజర్ దగ్గరికివెళ్ళింది. మానేజర్ వచ్చి చూసేసరికి ఆనంద్ సీటు ఖాళీచేసి వెళ్ళిపోయాడు. పరిస్థితి విషమిస్తుందన్న భయంతో సగం సినిమా వదిలేసి ఉడాయించాడన్నమాట.

"ఎన్నాళ్ళయింది ఇది జరిగి?" అని అడిగాను. బహుశా పెళ్ళికి ముందేమోనని అనుకుంటూ -

"సుమారు రెండేళ్ళ కిందట"

అదే రాత్రి నేను ఆనంద్‌తో,

"ఆవిడన్నమాట నిజమేనా?" అన్నాను.

"ఏమిటి?"

"బీస్ట్ అన్నమాట"

"అంటే?"

"నువ్వు కథలల్లి చెబితే నేను నమ్మేస్తాననుకున్నావా? సినిమా థియేటర్లో ఆవిడతో నువ్వు ఏవిధంగా ప్రవర్తించావో నాకు తెలియదనుకున్నావా?"

ఆనంద్ కళ్ళు పెద్దవిచేసి చూసి-

"సో వ్వాట్?" అన్నాడు మొరటుగా.

"నీ బుద్ధి ఇంత హీనమైనదని నేననుకోలేదు"

"ఇప్పుడేం చేస్తావయితే" ఆనంద్ ముఖంలో పైశాచికత కనిపించింది, కొద్దిగా భయం వెయ్యకపోలేదు.

'నిన్ను చంపుతాను' అనాలనిపించినా అనలేకపోయాను. అటువంటి పరిస్థితిలో కూడా అధైర్యపడకుండా, తప్పుచేసిన భావం రవ్వంత కూడా కనబడనీకుండా నిలబడ్డ అతని వ్యక్తిత్వం చాలా విశిష్టంగా కనిపించింది.

"ఏమన్నా చేస్తాను" అన్నాను.

"ఏమనుకుంటున్నావు? నన్ను ఓడించగలననుకుంటున్నావా? నన్ను ఎదిరించి బతగ్గలననుకుంటున్నావా? యూబిచ్... నీ బాబుకూడా నన్నేం చేయలేడు"

"మా బాబు పేరెత్తద్దు. ఆయనేం మిమ్మల్ని విచారణచేయడానికి రాలేదు"

"అయితే ఎవరు నన్ను విచారణ చేసేవాళ్ళు. నువ్వా?" అని వచ్చి నాగొంతు పట్టుకుని నొక్కసాగాడు.

అతను నా గొంతు నొక్కేసరికి నాభయం మాయమైపోయింది. క్రితంసారి గొంతునొక్కడానికి వచ్చినప్పుడు నిజంగా భయంవేసింది.

ఈసారి మాత్రం నిర్వికారంగా-

"ఇదే కరెక్ట్. నన్ను చంపెయ్యండి... చంపెయ్యండి"

నాకు నిజంగా అక్షణంలో చావు కావాలనిపించింది.

అతను నన్నొదిలేసి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు.

నేను మనసులోనే 'థాంక్స్' అనుకున్నాను అతను నన్నొదిలి నా ఎదుటినుంచి వెళ్ళిపోయినందుకు.

ఇంకో గంట ఆగి ఇంటికొచ్చిన ఆనంద్





నాతో ఎంత మృదుమధురంగా మాట్లాడాడంటే అతను వేరేవ్యక్తి, ఇతను వేరేవ్యక్తి.



ఆధునిక జీవితంలో ప్రీతి-ప్రేమ అనేవి చాలా అపూర్వమైన వస్తువులను కుంటాను. ప్రేమ సంబరం అంతా కథల్లోను, కవితల్లోనే కాబోలు. స్త్రీ పురుష సంబంధాలు పరస్పరం కొన్ని అవసరాలని పూరించుకొందుకు వున్న ఒక వ్యవస్థ మాత్రమే అనిపిస్తుంది. అవసరాలంటే సామాజిక, ఆర్థిక, దైహిక మొదలైన రకాలుగా విభజించవచ్చు. భర్తవల్ల భార్యకి సామాజికప్రతిష్ఠ, ఆర్థిక భద్రత, దైహికసుఖం మరియు భౌతికజీవనంలో సుఖసంతోషాలు. అడుగడుక్కీ నౌకర్లు చూసుకునే ఇళ్ళలో భార్యాభర్తలిద్దరూ కేవలం పరుపుమీద మాత్రం భాగస్వాములై వుంటారు.

మరికొంతమందికి భార్యమీదున్న మోహం వారి కారుమీదో, ఫ్రిజ్‌మీదోవున్న మోహానికేమీ విరుద్ధంగా వుండదనే నాకనిపిస్తుంది. ఆనంద్ దృష్టిలో భార్యకున్న స్థానం ఏమిటి?- అన్న నా ప్రశ్నకే నాకు జవాబు దొరకలేదు. కొందరికి భార్య భార్యగా కాకుండా ఇంకెవరిగానైనా అనిపించవచ్చు. మరి ఆనంద్ ఎలా అనుకుంటున్నాడో!

మహేష్ శీలాని చూసినప్పుడు కూడా వారిద్దరి సంబంధం ఎటువంటిది? వారిద్దరి మధ్య ప్రేమ అనేది ఉందా- అనే ఆలోచనవస్తుంది. శీలాలో చిరునవ్వు, తియ్యటిమాటలు, సెక్స్‌పార్ట్నర్‌గా వర్తించడంతప్ప ఇంకేముంది? మహేష్ కూడా అంతే. తన బాధ్యతలేవో నెరవేరుస్తాడు. సొసైటీలో భార్య అనే స్టేటస్ సింబల్‌ని సమర్థవంతంగా నిర్వహిస్తాడు. ప్రేమ అంటే ఏమిటి? ఇదేనా? 'ప్రేమ' అనే ప్రత్యేకమైన సంగతంటూ ఏమన్నావుందా?

అలా చూడబోతే మూడవ మనిషి దృష్టిలో ఆనంద్‌కు,నాకుమధ్య గాఢమైన ప్రేమ లేదా? అతను ప్రేమార్ద్రనయనాలతో నన్నుచూడటం, ఆదరాభిమానాలతో నన్ను చూసుకోడంగానీ, సుధ అందాన్ని సౌశీల్యాన్ని సద్గుణాలనీ ఇతరుల దగ్గర పొగడటం... ఇవన్నీ ఏమిటి? అందర్నీ చులకనగా మాట్లాడినట్టే నన్నూ అనుకుంటాడా? అన్నది నీ సందేహం అంతే. లేదు... అతను నన్నుమాత్రం అలా అనుకోలేదు.

నేనో? నేను అతని ఈ ప్రవర్తనని అవమానించేలా ఏ రోజూ ప్రవర్తించలేదు. నీ ప్రేమ 'నాటకం' అని ఏనాడూ అనలేదు. అతను నా గొంతు నొక్కినప్పుడు కూడా అది ప్రేమరహితమైన ద్వేషంగా నేనేనాడూ భావించలేదు. అది విశిష్టమైన, ప్రేమ సహితమైన ద్వేషమే కావచ్చు. మాత్సర్యం అంటే ఏమిటి? ప్రేమ, ద్వేషం పెనవేసుకున్న భావమే మాత్సర్యం.

మా ఇంటికి వచ్చే అతిథుల దగ్గర, దారిలో మేమిద్దరం జంటగా నడుచుకెళ్ళేటప్పుడు, మమ్మల్ని వీక్షించేవారందరికీ మేం ఆదర్శ దంపతులం. మా మధ్యనున్న సామరస్యం చూసి ఎవరైనా అసూయపడగలిగేటంత అన్యోన్యంగా మేముంటాం. మేం పరస్పరం గాఢంగా ప్రేమించుకుంటున్న దంపతులమన్న సంగతిని ఎవ్వరూ కాదనలేరు.

ప్రేమ అనేది ఎక్కడుంటుందో ఆనంద్‌కి తెలియదు. నేనూ ఎప్పుడూ చూడలేదు. బహుశా ప్రేమ గురించి అతనెప్పుడూ తలకాయ పాడుచేసుకుని వుండడు. ప్రేమ అనేది కామానికి మరోపేరో, మరో రూపమో, ప్రతినిధో అయ్యుండాలి.

ఆనంద్‌ని చంపాలని నేను థియరెటికల్‌గా ఒకసారి ఆలోచించాను. అప్పుడు అతడి స్వభావంలో, వ్యక్తిత్వంలో నాకు ఆక్షేపణీయంగా కనిపించినదేది? దేన్ని నేను చంపాలని ప్రయత్నించాను? కంటికి కనిపించే వ్యక్తిత్వాన్నా కనిపించని వ్యక్తిత్వాన్నా? కనిపించనిదాన్ని చంపేదెలా? కనిపించేదాన్ని చంపినా, కనిపించనిదలాగే వుండిపోతుందికదా! అలా గిలిపోయే దాన్నేకదా 'చరిత్ర' అంటారు

కానీ ఆలోచించినకొద్దీ అనిపిస్తుంది. అతని ఛండాలపు చాపల్యం వల్ల, అతని అహంకారం వల్ల, కనిపించిన ఆడదాన్నల్లా వాటేనుకోవాలన్న పిచ్చి - ఇవన్నీ నాశనం చేయగలిగితే, తరువాత మిగిలే అతని స్వభావం నాకు స్వీకారయోగ్యమే. వీటిలో ఒకటి రెండు లక్షణాలు చాలామంది మగవాళ్ళలో వుంటాయి. బహుకొద్దిమందిలో మాత్రం ఒకటి రెండు గుణాలు చాలా గాఢంగా వుంటాయి. అదే వారి అధఃపతనానికి కారణమవుతుంది. నాక్కావలసింది ఈ గుణాల్ని చంపడం మాత్రమే. కాని వ్యక్తి హత్యవల్ల కావల్సిన గుణాలు, అక్కర్లేని గుణాలు కూడా అంతమవుతాయి కదా!

పోన్లెద్దూ... అన్నీ అంతమైపోడమే సరి అయిన పని. ఎన్ని దుర్గుణాల్ని అంతం చేసినా అతనిలో నాకు నచ్చే విషయాలేమున్నాయిగనుక!

కాని ఒక ముఖ్యమైన ప్రశ్న.

చంపడం వల్ల ఒక మనిషిని లేకుండా చేయవచ్చా? ఇంతకాలం దేహంవల్ల, మనను వల్ల సన్నిహితమైన మనిషిని, శరీరం యొక్క మనను యొక్క ఒక భాగంగా అయిపోయిన వ్యక్తిని చంపి, 'లేడు' అనుకోగలమా? ఒకసారి బతికి బట్టకట్టిన తరువాత దైహికంగా ఇక్కడ లేకపోయినా వున్నవారి మనసుల్లో చనిపోయాక మరింత సజీవంగా మిగిలిపోతారు.

మరో కొత్త ఆలోచన. చంపితే చంపి పారెయ్యొచ్చు - చచ్చినా సజీవంగా వుండేవాళ్ళు, బతికీ చచ్చినట్లుండేవారు ఈ ప్రపంచంలో వున్నారు. అలాగయితే, చంపకుండా చచ్చేటట్లు చేయడం సాధ్యమా? మిగిలేదేమిటో ముందే తెలును. చచ్చేటట్లు దేన్ని చెయ్యాలి అన్నదొక్కటే నిర్ణయించాల్సిన అంశం.

ఆనంద్‌ని బ్యాంక్ ఆఫ్ ఇండియన్ పయొనీర్స్ బదులు బ్యాంక్ ఆఫ్ పయొనీర్స్ ఇన్ ఇండస్ట్రీ అనే స్థానంలో పెట్టారు. రూరల్ బ్యాంకింగ్ డెవలప్‌మెంట్ నుంచి ఇండస్ట్రియల్ క్రెడిట్ విభాగానికి ట్రాన్స్‌ఫర్ చేసారు.

ఒకరోజు బ్యాంక్ ఛైర్మన్ ఇందూ శంకర్‌జైన్ కట్టించిన కొత్త ఇంటికి గృహప్రవేశానికి మేమిద్దరం వెళ్ళాం.

కొద్దిమంది ప్రముఖుల్ని ఆహ్వానించారంతే. చాలా నిరాడంబరంగా, సరళంగా జరిగిన సమారంభం.

విస్కీ, మ్యూజిక్, డాన్స్ ఏమీ లేకుండా చాలా ప్రత్యేకంగా అనిపించింది. బహుశః కొత్త ఇంట్లో, గృహప్రవేశంనాడే అవన్నీ 'కూడదు' అనుకున్నారేమో లేదా అవన్నీ బర్త్‌డే పార్టీలలో మాత్రమే తప్పనిసరి అంశాలేమో. మొత్తం మీద అక్కడంతా ప్రశాంతంగా వుంది.

అది ఇల్లుకాదు రాజభవనంలా వుంది. ఎంత తక్కువగా అనుకున్నా పాతిక లక్షలు ఖర్చుపెట్టుంటారు.

ఇంటికి తిరిగివస్తుంటే ఆనంద్ అన్నాడు -

"ఇల్లంటే అలావుండాలి"

నేనేం జవాబు చెప్పలేదు. ఎందుకు అలా వుండాలి? - అన్న ప్రశ్నమట్టుకు మనసులో ఉదయించింది.

ఇంటికొచ్చాక ఆనంద్ చాలా మౌనంగా వుండిపోయాడు. అతని వాగుడంతా ఏమయిందా? అని ఆశ్చర్యం కలిగింది.

రాత్రి సుమారు పన్నెండు గంటల ప్రాంతంలో మెలకువచ్చి ఆనంద్ పక్కన లేని సంగతి గమనించాను. తరువాత మెల్లగా తలుపు తీసిన చప్పుడు వినిపించింది. ఆశ్చర్యంగా అనిపించిన ఒక నిముషం కదలకుండా అలాగే పడుకున్నాను. తరువాత లేచి కిటికీలోంచి బయటికి చూశాను.

ఆనంద్ ఆఫీసుకి వెళ్ళేటప్పుడు ఎలా డ్రెస్ చేసుకుంటాడో అలా డ్రెస్ చేసుకుని రోడ్డుమీదకి వెళ్ళాడు.

ఎక్కడికెళ్ళి వుంటాడా అని ఆలోచించాను. సొమ్నాంబులిజం అంటారు, అదికాదుకదా!

సుమారు రెండు గంటల ప్రాంతంలో ఇంటికొచ్చాడు. నేను నిద్రనటిస్తూ పడుకున్నాను. అతను చప్పుడు చెయ్యకుండా లోపలికొచ్చి తలుపువేసి బట్టలు, మాస్ మార్చుకున్నాడు. చప్పుడు చేయకుండా తలుపు వేసొచ్చాడు గాని, చప్పుడు అయ్యేలాగే టాయిలెట్‌లోకి వెళ్ళి ఫ్లష్‌లాగి శబ్దంచేసి వచ్చిపడుకున్నాడు.

అప్పుడేమన్నా అడగడానికి భయంవేసింది గొంతు పిసికినా పిసకచ్చు.





పొద్దున్న టిఫెన్ తిన్నాక నిర్వికారంగా అడిగాను -

"మధ్యరాత్రిలో ఎక్కడికో వాకింగ్‌కెళ్ళినట్టున్నారు కదా!"

నా ప్రశ్న అతనికేం ఆశ్చర్యం కలిగించలేదు. నాకు నిద్రరాకుండా వుండి వుండచ్చు లేదా తను వెళ్తుండగా చూసినా చూసుండచ్చు అని ముందే వూహించి వుంటాడు. అదీకాక నాప్రశ్నలోనే అతనికి నెపంచెప్పే మార్గంకూడా సూచించి వుంది. తడుముకోకుండా -

"ఊఁ... వాకింగ్‌కి వెళ్ళాను. ఎందుకో తలంతా వేడెక్కిపోయింది. కన్నుమూస్తేచాలు శంకర్‌జైన్‌గారి భవంతి కళ్ళముందుకొస్తోంది. ఇంక లాభం లేదని నైట్‌క్వీన్ వరకూ వెళ్ళాను. ఒక పెగ్గేసుకుని కాసేపు డిస్కోచూసి వచ్చాను" అన్నాడు.

అతను చెప్పింది నిజమైనా కావచ్చు, అబద్ధం అయినా కావచ్చు.

నేను నవ్వుతూ అడిగాను, "నాకూతలకాయ వేడెక్కితే అలాగే చేయవచ్చుకదా?"

ఒక్కసారి ఆనంద్ రెచ్చిపోయాడు. నాకేసి తీవ్రంగా చూసి -

"షటప్... యు ఆర్ ఎ వుమన్" అన్నాడు.

"సో వాట్!" అని అడిగాను నేను, సోవాట్ అన్నది అతని మాస్టర్ పీస్.

"నువ్వు అర్ధరాత్రి పన్నెండు గంటలప్పుడు వీధిలోకి వెళ్తే ఏం జరుగుతుందో నేను వివరించి చెప్పనక్కర్లేదు సుధా" అన్నాడతను.

రాత్రి తాలూకు హ్యాంగోవర్ అతన్నింకా వదిలినట్లు లేదు. కళ్ళింకా ఎర్రగా వున్నాయి. ఇప్పుడతన్ని రెచ్చగొడితే ఏం చేస్తాడు? గొంతు నొక్కుతాడా? అన్న కుతూహలం పుట్టుకొచ్చింది.

"అది నిజమే. నేను ఆడదాన్ని. మీ పురుషస్వరం నుంచి ఆమాట విని నాకు చాలా ఆనందంగా వుంది. కాని నాకు అర్ధరాత్రి తలవేడెక్కితే అనాసిన్, కాంపోజ్ కాకుండా ఇంకేమి చెయ్యొచ్చు- అన్న సంగతి చెప్పరేం?" అన్నాను నవ్వుతూ.

ఆనంద్‌కి చిరాకెయ్యడం స్పష్టంగా కనిపిస్తోంది. అతనిదగ్గర ఆ ప్రశ్నకి సరియైన సమాధానం లేదు.

"ఆడదానికి అంత తలవేడెక్కే పరిస్థితులుండవు"

"మీకెలా తెలుసు? తలొక్కటే కాదు, ప్రాణం కూడా వేడెక్కుతుంది. నేను ఆడదాన్ని రాత్రి వేళ ప్రమాదం అని మీరు బెంగపెట్టుకోనక్కర్లేదు. మీ డ్రెస్ వేసుకుని వెళ్తాను. నైట్‌క్వీన్ వరకూ వెళ్ళాక ప్రమాదమేమీ లేదుకదా?" అని నవ్వాను.

ఇదంతా తమాషాగా అంటున్నానన్న సంగతి అతనికి తోచినట్టుంది. నవ్వడానికి ప్రయత్నించి "మరి వెనక్కెలా వస్తావ్?" అన్నాడు.

"అక్కడెవరయినా బాగా డబ్బున్నవాళ్ళో, చదువుకున్న నాగరికులో తాగుతూంటారు కదా, వాళ్ళని 'ప్లీజ్ గివ్‌మి ఎ డ్రాప్' అనడుగుతాను. తప్పకుండా డ్రాప్ చేస్తారు. నాలాంటివాళ్ళని డ్రాప్‌చెయ్యడానికి ఈ ప్రపంచంనిండా మనుషులుంటారు"

ఆనంద్ మళ్ళీ విసుక్కున్నాడు.

"ఇవాళ నీకు తలకాయ సరిగ్గా వున్నట్టు లేదు"

"నిజమే... రాత్రి వేడెక్కిన తల ఇప్పుడు చల్లబడింది"

"ఏం... నన్ను వెక్కిరిస్తున్నావా?"

"ఛ ఛ అనలలా చేస్తానా?" అని నవ్వేసి, "మీరు నన్నెంత ప్రేమగా చూసుకుంటారో కదా! లేకపోతే నాకు తల వేడెక్కినప్పుడో, పాడైనప్పుడో నన్నొదిలెయ్, డైవోర్స్ ఇచ్చేయ్ అనచ్చు కదా!" అన్నాను నవ్వునాపకుండా.

"ఏం మాటలవి సుధా? అయామ్ ఎ మ్యాన్ ఆఫ్ కల్చర్. నేను అనాగరికుణ్ణి కాను"

"డైవోర్స్ ఇచ్చేవాళ్ళంతా అనాగరికులుకారు. నన్నొదిలేస్తే మీకే ఇబ్బందీ వుండదు. మీ జనానా ఖాళీగా పడుండదు"

"నోర్మూయ్. అలాంటి చెడ్డమాటలు అడద్దు. యు ఆర్ మైన్ టిల్ ఇటర్నిటీ. నువ్వు లేకుండా నేనెలా బ్రతగ్గలను? నువ్వింకోసారి డైవోర్స్‌మాట ఎత్తద్దు. ఆ పరిస్థితే వస్తే నిన్ను చంపేస్తాను"

"అదింకా మంచిది. ఒకవేళ ఇప్పుడు నేను చచ్చిపోతానని అనుకోండి. అప్పుడేం చేస్తారు?"

"అలాంటి ఊహలు కల్పనలతో ఇప్పుడు అవసరం లేదు. ఇట్స్‌నాట్ రియాలిటీ"

"ఎందుక్కాదు? నేను ఆత్మహత్యచేసుకున్నాననుకోండి"

"సుధా నోరుముయ్యి"

నేను అతని మాటని లక్ష్యపెట్టకుండా చాలాకాలం నుంచి చెప్పాలనుకుంటున్న మాటని చెప్పేశాను.

"చచ్చిపోడం అంటే నాకేమీ బెంగలేదు. నిజానికి డైవోర్స్ తీసుకుని ఇంకెవర్నో పెళ్ళాడి సుఖపడిపోవాలన్న కోరికా నాకు లేదు. ఈ జీవితానికి కావల్సిన సుఖం అనుభవించడం అయింది, మీ మాటలు వింటే డైవోర్స్‌కంటే చావే కోరుకోదగ్గ సంగతనుకుంటాను. కాని కేవలం మీ భార్యగా మరణించడం కాదు నాక్కావల్సింది. నాక్కావల్సిందొకటే - నా మరణానికి ముందు నేను తల్లిని కావాలి. తల్లిని కావాలన్న కోరికొక్కటే నాకు తీరవల్సింది. నేను తల్లినై చచ్చిపోతే బిడ్డని మీరు చూసుకుంటారు కదా!?"



ఆనంద్ గుడ్లురిమి చూశాడు. చెప్పడానికి అతని దగ్గర మాటల్లేవు. ఊపిరాడ్డమే కష్టంగా వున్నట్టుంది. ముఖం వికారంగా తయారవుతోంది. ఆ శబ్ద రాహిత్యాన్ని చూస్తే ప్రేతాన్ని చూసినట్టుంది. ఇంకేముంది? లేచొచ్చి నన్ను గొంతు పిసుకుతాడేమోననుకున్నాను. చావడానికి సిద్ధపడి కూర్చున్నాను.

అతను లేచొచ్చాడు. నా జబ్బలు రెండూ గట్టిగా పట్టుకున్నాడు.

"నిన్ను ఇప్పుడే చంపేస్తే ఏమవుతుంది?" అనడిగాడు.

"అలా అనకండి. మీకు ఉరిశిక్షో, అజన్మ కారాగారవాసమో విధిస్తారు. చంపడానికి రెడీగా వున్నానంటే, 'ఈ చావుకెవరూ బాధ్యులు కారు. నేనే బాధ్యురాలిని' అని ఉత్తరం రాసిపెడతాను. మీరు ఇరుక్కోకుండా - ఎలా చంపవచ్చో నేర్పుతాను" అని నవ్వాను.

అతనిలో మానవత్వం చచ్చిపోయినట్లనిపించింది. ముఖంలో రాక్షసుడు తాండవించాడు.

ఫెడీల్మని చెంపమీద ఒక్కటిచ్చుకున్నాడు. చాలా తీవ్రమైన దెబ్బ. కళ్ళు తిరిగినట్టయి సోఫామీద కూలబడ్డాను.

ఊపిరిబిగవట్టి నొప్పి తట్టుకున్నాను. ఏడవలేదు. నా కళ్ళనుంచి వెచ్చటి నీరు చిమ్మింది. నొప్పి తీవ్రతతో కన్నీళ్ళు అని అనుకోలేదు వాటిని.

అతను లోపలికి వెళ్ళిపోయాడు. అరగంట తరువాత బట్టలు వేసుకుని రెడీ అయి బయటకొచ్చాడు.

నేనింకా అక్కడే కూర్చుని వున్నాను.

"ఊc..., బయల్దేరు"అన్నాడు.

నేను చెంపమీంచి నా చేతిని తీసి చిరునవ్వు నవ్వాను.

ఎంత అందమైన చెక్కిలి అని పొగిడి, వేలసార్లు ముద్దుపెట్టుకున్న చెంపమీద అతనివే నాలుగు వేళ్ళ ముద్రలు దట్టంగా తేలాయి.

అతను చూసినుంచున్నాడు. మాటల్లేవు. ముఖంలో ప్రేతకళ. అవాక్కై దిక్కుతోచక నిలబడ్డ అతనికి సహాయపడాలి కదా! నేనే-

"మీరు వెళ్ళండి. ఇవాళ్టికి లీవ్ తీసుకుంటాను. ప్రిన్సిపాల్‌కి ఫోన్‌చేసి విషయం తెలియబరచండి" అన్నాను.

'అనారోగ్యం అని చెప్పండి' అనచ్చు. కాని కావాలనే 'విషయం తెలియబరచండి' అన్నాను.

అలా మాట్లాడ్డానికి అన్నిసార్లూ అవకాశం రాదు.

ఆనంద్ తలవంచుకుని వెళ్ళిపోయాడు.

జీవితం ఖాళీపుస్తకం అన్నవాడెవడో పిచ్చివాడు అనుకున్నాను.

★ ★ ★

సుమారు రెండు నెలల తరువాత ఆనంద్ ఒక ఉత్తరం తెచ్చి నాకు చూపించాడు.

గతంలో అతని కొలీగ్ అయిన ఇఫ్తికర్ అనే అతను సౌదీఅరేబియా నుంచి రాసాడు.

సౌదీ అరేబియాలో ఆనంద్ క్వాలిఫికేషన్‌కి మంచి ఉద్యోగావకాశాలున్నాయి. 'ఒక్క సంవత్సరంలో రెండు లక్షలపైన సంపాదించవచ్చు. నాలుగైదు సంవత్సరాలు పనిచేస్తే ఇంక కష్టమన్నది లేకుండా బతకచ్చు. బ్యాంక్‌చుట్టూ గానుగెద్దులా తిరగాల్సిన అవసరం లేదు' అని రాశాడతను. ఒకటి రెండు కమర్షియల్ సంస్థలవి, కంపెనీలవీ చిరునామాలిచ్చాడు. లీవ్ దాచివుంచుకో. వెంటనే రాజీనామా ఇవ్వద్దు. సెలవుపెట్టి వచ్చి, నాలుగు రోజులు పనిచేసి రాజీనామా తరువాత పంపచ్చు" అని రాశాడు.

"ఏమంటావ్?" అనడిగాడు ఆనంద్.

"అక్కడ సుఖం అంతలోనే వుంటుంది. ఇక్కడ మనకేం తక్కువైందని?" అన్నాను.

నా దృష్టిలో మాక్కావలసినవన్నీ వున్నాయి. బ్యాంకుదయినా మాదే అనుకోగలిగేలాంటి ఇల్లు, స్వంతకారు, ఫ్రిజ్, టి.వి.లాంటి ఆధునిక జీవితానికి కావల్సిన హంగులన్నీ వున్నాయి. ఇవన్నీ వున్నాయని కొంచెం డబ్బా కొట్టుకునే అలవాటు కూడా ఆనంద్‌కి వుంది, తన భార్య అందం గురించి డబ్బా కొట్టుకున్నట్టే. బహుశః ఇందూశంకర్‌జైన్ భవంతిని చూసినప్పటి నుంచి ఈ డబ్బు వెర్రి ఎక్కువై వుంటుంది. అలాంటి ఇల్లు కట్టించాలనే కోరికుంటే ఎంత డబ్బు పోగేస్తేనో! అరేబియా





అయినా, స్వర్గలోకమయినా ఉద్యోగాలు చేసి డబ్బు సంపాదించేవాళ్ల సంపాదన అంతలోనే వుంటుంది. ఏడాదికి రెండు లక్షలు సంపాదించి ఒక లక్ష వెనకేసినా, పది లక్షలు సంపాదించాలంటే పది సంవత్సరాలు పడుతుంది. కోటీశ్వరుడయిన మార్వాడీ పుత్రుడు ఇందూశంకర్‌జైన్ స్థాయికెగరాలని అనుకుంటే ఎవరెవరినెత్తినో చెయ్యి పెట్టాల్సిందే తప్ప, ఉద్యోగం లాభం లేదు.

అయితే, నాదొక ప్రశ్న ఇల్లు ఎవరికి? అని

"ఇక్కడ పదేళ్ళలో గడించలేనిది, అక్కడ ఒక్క సంవత్సరంలో గడించచ్చు ఐదారేళ్లు ఉద్యోగం చేస్తే ఇంకేమీ కష్టపడక్కర్లేదు"

"సరే... అలాగయితే అక్కడ్నుంచి వచ్చాక ఏంచెయ్యడం?"

"అంటే?"

"అంటే, తాగుతూ, తింటూ, నిద్రపోతూ గడపడమేనా? ఉద్యోగం, పని అన్నది లేకపోతే జీవితం బోరు కొట్టదా?"

"ఉద్యోగం ఎందుకు చెయ్యకూడదు?"

"అంత డబ్బుంటే ఈ పాడు వుద్యోగం ఎందుకు చెయ్యడం అనిపించదా?"

"ఓ, అలాగా? ఇదే వుద్యోగం చెయ్యాలనేదేముంది? నీకిష్టమయితే కాలేజీకి వెళ్ళచ్చు. టుకిల్ టైమ్. నేను జుహూలో ఒక ఫైవ్‌స్టార్ హోటెల్ పెడతాను. దాన్ని చూసుకోడమే పెద్ద ఉద్యోగం!"

ఆనంద్‌కి ఫైవ్‌స్టార్ హోటలంటే దేవాలయంలాంటిది. ఫైవ్‌స్టార్ అన్నా దానికి సంబంధించిన వ్యవహారాలన్నా అతనికి చాలా ఆసక్తి. అతనిదే హోటలయితే ఇక ఆ దేవాలయానికి పూజారి అతనే. అతను డబ్బా కొట్టుకో డానికి ఆ హోటలొకటి చాలు. సుధ కూడా గడ్డిపరకలా లోకువ అయిపోతుంది. అనుకుంటే చిన్న నవ్వొచ్చింది.

ఆ భయం నాకేమీ లేదుగాని, ఇప్పుడున్న ఈ మాత్రపు శాంతి సమాధానాలని గాలికొదిలేసి అరేబియా ఎడారిలో పుడుకెత్తిపోవడం నాకిష్టంలేదు. ఇంత ఆదాయం, ఇంత విశ్రాంతి, సౌకర్యాలు ఇవన్నీ చాలు. స్వంత ఇల్లు కావాలనుకుంటే వున్నంతలో ఏదో చేసుకో వచ్చు. ఏదన్నా అంతోఇంతో సుఖమంటూ వుంటే ఇలా బతకడంలోనే వుంటుంది.

"మనకవన్నీ ఎందుకులెద్దురూ" అన్నాను.

"ఏవన్నీ?" అడిగాడు విసుగ్గా.

"అదే పెద్ద ఇల్లు, ఫైవ్‌స్టార్ హోటలు వగైరా"

అతను నన్నోసారి చురచుర చూశాడు. చూసి,

"యు ఆర్ ఎ సిల్లీ వుమన్" అన్నాడు. నేను నవ్వాను.

మొట్టమొదటిసారి ఆనంద్ ఆశ్చర్యంతో అలాగే కూర్చుండిపోయాడు. అతను నానుంచి కోపం, బేలతనం, అసహాయత, ఓటమి- వీటిని నిరీక్షించాడు. కాని దొరికింది వేరు.

నాలోని సుధ మెల్లగా-

'ఆనంద్ నువ్వు చస్తున్నావు... మెల్లగా చావడం ప్రారంభించావు. ఇదే నిన్ను చంపే విధానం! ఇదే...' అంది.

ఇఫ్తికర్ వుత్తరం గురించి డిస్కస్ చేయడానికి సాయంత్రం ఆనంద్ నన్ను తీసుకుని మహేష్ ఇంటికి వెళ్ళాడు.

"ప్రయత్నించు, ఛాన్స్ దొరికితే నువ్వు అదృష్టవంతుడివే" అన్నాడు మహేష్.

"ఆ ఎడారిలో ఎక్కువకాలం బతకడం కష్టమేమో. ముఖ్యంగా సుధ దేహం, ఆరోగ్యం ఆ వాతావరణానికి తట్టుకోగలదో లేదో అనుమానం" అన్నాడు ఆనంద్.

"ఎడారి వుండేది బయట. నీ ఎయిర్ కండిషన్డ్ గృహంలో కాదు. డోంట్ వర్రీ అబౌట్ దట్. నేనొకసారి లండన్‌నుంచి బొంబాయికి వచ్చేటప్పుడు 'జెద్దా' మీదుగా వచ్చాను. నాలుగైదు రోజులు అక్కడ ఆగాను. నాకేం ఎడారి కనిపించలేదు. అక్కడ దొరకని సామగ్రి ఈ ప్రపంచంలో ఎక్కడా వుండదు. అన్నీ డ్యూటీ ఫ్రీ కూడా. మత సంబంధమైన నిబంధనలు వీధిలో మాత్రమే అన్వయిస్తాయి. లోపలంతా వేరు. 'ఇది లేదు' అనే మాటలేదు. డబ్బుతో అన్నీ దొరుకుతాయి. నా స్నేహితుల ఇంట్లో బ్లూఫిల్మ్‌ల గుట్ట చూశాను. ఇక్కడి మన హిందూ మతాంధులున్నారు కదా, వాళ్ళ భార్యలు అక్కడ వీధుల్లో బురఖా వేసుకుని తిరుగుతారు. నెలకి పదివేలో, ఇరవైవేలో



జీతం ఇస్తే బురఖా ఏమిటి, గోనె సంచులు కూడా తొడుక్కోవచ్చు. ఇంట్లో కూడా రామకృష్ణుని ఫొటో పెట్టుకుందుకు వీల్లేదని ఏడ్చాడొకడు. రామకృష్ణ పరమహంసని ఇండియాలోనే వదిలేసొచ్చావుకదా! అరేబియాలో మళ్ళీ పుట్టించడం ఎందుకు చెప్పు? ఇండియాలోనైనా ఆయన్ని పూజించడంవల్ల ఏమీ లభించదు. మళ్ళీ ఇక్కడెందుకు ఆయన్ని పూజించాలని తలబ్రద్దలు కొట్టుకుంటావు?

అంత మరీ గట్టిగా కావాలనుకుంటే హృదయంలో పెట్టుకో హనుమంతుడి పద్ధతిలో అన్నాను. మతం, దైవం, భక్తి అంతా నాటకం. అక్కడి స్వదేశస్థులు, విదేశీయులు కూడా ఏడాదికొకసారి లండన్, ఫ్రాంక్‌ఫర్ట్, కోపన్‌హేగన్ నగరాలకి వెళ్ళి బాగా మజా చేసుకుని వస్తారు. ప్లేనెక్కగానే బురఖా తీసిపారేస్తారు. అక్కడ దిగ్గానే మిగిలినవీ తీసిపారెయ్యడానికి రెడీగా వుంటారు" అని ఆర్భాటంగా నవ్వాడు మహేష్.

ఆనంద్ నోటినిండా చెల్లు.

నేను మౌనంగా వుండిపోయాను.

నా ఇష్టం ముఖ్యమైనదిగా కనిపించలేదెవరికీ. నాకూ, ఆనంద్‌కీ కూడా.

అతను అప్లికేషన్ పంపించాడు. స్పాన్సర్‌షిప్ పత్రాలు పంపమని ఇఫ్తికర్‌కి కూడా రాశాడు.

ఆరోజు కాలేజీలో రాకేష్ కనిపించినా ఆనంద్ కలకత్తాకి వెళ్ళిన సంగతి నేనేమీ చెప్పలేదు.

'ఇంటికిరా' అని పిలుద్దామనిపించింది. కాని అంతకుముందు నేను అతన్నెప్పుడూ అలా ఆహ్వానించలేదు.

నేను ఇల్లు చేరిన కాసేపటికి రాకేష్ వచ్చాడు.

"ఏడి డాక్టర్ ఆనంద్?" అని అడిగాడు.

అతను లేడని తెలియగానే ఎప్పటిలాగే త్వరగా వెళ్ళాలని లేచాడు.

"ఉండు... ఏమిటంత అర్జంటు?" అన్నాను.

ఉలిక్కిపడి నా ముఖంలోకి చూశాడు. అతన్ని ఏకవచన ప్రయోగం చేశాను కదా, అందుకు.

నేను ఏమీ భావవికారం చూపించకపోడంతో అతను వూరుకున్నాడు.

"ఆనంద్ అరేబియా వెళ్తున్నాడు తెలుసా?"

ఇప్పుడు రాకేష్ నిజంగా కంగారుపడ్డాడు. ఆనంద్‌కి మొదటిసారిగా ఏకవచన ప్రయోగం చేశాను.

నేను నవ్వి, "ఏం, ఏకవచనం చూసి గాభరాగా వుందా? అది మూలభాషలో వాక్యాలు కాదులే. ఇంగ్లీష్‌కి అనువాదం. ఇంగ్లీష్‌లో ఈ వచనాల గోలలేదుకదా, అదేవిధంగా మన భాషలోనూ మాట్లాడితే ఎలావుంటుందా అని ప్రయోగాలు చేస్తున్నాను. సోషియో. లింగ్విస్టిక్ ఎక్స్‌పెరిమెంట్" అన్నాను.

"ఇదేం ప్రయోగం?"

"గివ్ ఎ షాక్ ఎండ్ ఆస్క్ క్వొశ్చన్స్" ఇది లింగ్విస్టిక్ షాకా? సోషియాలాజికల్ షాకా? షాకెందుకు తగిలింది? పదంలో గౌరవం వుంటుందా? పదం ముఖ్యమా? గౌరవం ముఖ్యమా? ప్రేమకొద్దీ పిల్లల్ని ముద్దుముద్దుగా తిట్లతో ముద్దులాడినట్టే. భర్తని ప్రేమతో 'నువ్వ'ని అనచ్చుకదా? ప్రేమలేదు అని వ్యక్తం చేయాలంటే 'మీరు' అనచ్చుకదా?" నవ్వుతూనే అన్నాను.

"బాగుంది మీ ఎక్స్‌పెరిమెంట్. డాక్టర్ ఆనంద్ విదేశాలకి వెళ్ళడం గ్యారంటీనా?"

"విదేశం కాదు, సౌదీ అరేబియా"

"సౌదీ అరేబియా విదేశం కాదా?"

"సౌదీ అరేబియా అంటే సౌదీ అరేబియానే బొంబాయిలో వున్న జనాలకి ఢిల్లీ కలకత్తా విదేశాలకంటే దూరం కావచ్చు. ఎంతమందో జనాలకి అమెరికా అంటే పక్కనున్న పంజాబంత దగ్గిర అనిపించచ్చు. 'ఫారిన్' అనడం ఓల్డ్ కాన్సెప్ట్. ఈ కాలంలో ఫారిన్ అనకూడదు. ఆయా దేశాలపేర్లు చెప్పాలి. 'పొరుగూరు' అనే ప్రయోగం చాలాకాలం క్రితమే మానేశాం. మన దేశం అంతా 'నావూరే' ఇప్పుడు ప్రపంచం అంతా నాలోకమే".

రాకేష్ ఆశ్చర్యంగా నామొహం చూసి,

"ఇవాళ మీరు చాలా ఆశ్చర్యకరంగా మాట్లాడుతున్నారు"




# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.
పోషకాహార లాభం : సెరిలాక్
ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి
కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు,
కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు,
విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి.
అన్నీ సమ పాళల్లో వున్నాయి.
రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్
రుచి ఇష్టం.
సమయం ఆదా లాభం : సెరిలాక్
ముందుగా వండినది. దానిలో పాలూ,
పంచదార వున్నాయి. దానిని వెచ్చటి
నీటితో కలిపితే చాలు.
ఎంపిక లాభం : ఎంచుకునేందుకు
మూడు రకాల సెరిలాక్ వుంది.
మీ పాపాయికి సమతూకంలో
పోషకాహారాన్ని అందించేందుకూ,
తయారుచేయటంలో పరిశుభ్రతను
పాటించేందుకూ, డబ్బా మీది
సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




FSL/5112/TEL

**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం.**

నేను నిర్లిప్తంగా నవ్వాను. ఒక క్షణం ఆగి,

"అన్నట్టు మీ ప్రశ్నకి జవాబు చెప్పాలి కదా! ఇంకా ఖచ్చితంగా చెప్పడానికి లేదు. అప్లికేషన్ పంపించాడు. ఇఫ్తికర్ తనకి చాలా గొప్ప ఫ్రెండ్. తప్పకుండా స్పాన్సర్‌షిప్ పంపిస్తాడు. ఆనంద్ క్వాలిఫికేషన్‌కి ఎక్కడన్నా ఉద్యోగం దొరక్కుండా వుంటుందా?" అన్నాను చిరునవ్వుతో.

రాకేష్ కొంతసేపు మౌనంగా వున్నాడు. తరువాత-

"ఐ.ఎ.ఎస్. రిజల్ట్‌కోసం ఎదురు చూస్తున్నాను- సెలక్టయితే వెళ్ళిపోతాను"

"టీచింగ్ అంటే ఇష్టమనే వాడివికదా?"

"అవును... ఐ.ఎ.ఎస్.లో సెలక్టయ్యేవరకూ" అని నవ్వాడు.

"దొరకలేదనుకో"

"టీచింగ్ ఇష్టమవుతుంది"

"నీకు తప్పకుండా దొరుకుతుందిలే. యు ఆర్ఎ బ్రిలియంట్ బాయ్. యువిల్‌బి ఎ బిగ్ మేన్ వన్‌డే. అప్పుడు నా కూతురో, కొడుకో నీదగ్గరకొస్తే మంచి ఉద్యోగం ఇప్పించాలి నువ్వు. అప్పుడు వెనుక, ముందు చూడకూడదు- ఏం?"

"ఇందులో కొన్ని వాక్యాలు మీవికావు"

"అవును... కొన్ని ఆనంద్‌వి, కొన్ని నావి. చివరి వాక్యం నాదే"

"యుఆర్ టెరిఫిక్" రాకేష్ ఆశ్చర్యపు మైకం నుంచి ఇంకా తేరుకోలేదు.

"నాట్యెట్" అన్నాను నవ్వి, "నేను చెప్పాల్సింది చాలావుంది. ఆనంద్ అరేబియాకి వెళ్తే నేనూ ఈ ఇల్లు వదిలి మరోచోటికి పోతాను"

"అంటే?"

"అంటే, బహుశః మీకు తెలియదు, నాకొక తల్లి వుంది. ఎక్కడయినా చిన్నఇల్లు తీసుకుని ఆవిడని తీసుకొస్తాను"

"ఇప్పుడావిడ ఎక్కడున్నారు?"

"పూనాలో తన అక్కగారింట్లో వుంది, ఏడాదికోసారి వెళ్ళి చూసొస్తూ వుంటాను, ఆనంద్ సమక్షంలో"





"అంటే?"

"అంటే నేనొక్కదాన్నే పూనావెళ్ళి అమ్మని చూసిరావడానికి ఆనంద్ అనుమతి లేదు. అమ్మతో ఏకాంతంగా కూర్చుని మాట్లాడ్డానికి ఆనంద్ అనుమతి లేదు"

రాకేష్ ఆశ్చర్యంగా నా ముఖాన్నే చూస్తున్నాడు. నా నవ్వుల్లో లోతేమిటో ఇప్పుడు అర్థమవుతున్నట్టుగా కనిపించింది.

ఒక నిముషం ఆగి అన్నాడు.

"మీరు ఆనంద్‌తో వెళ్ళకుండా వుండడానికి కుదురుతుందా? ఆయనొదిలి పెడతారా?"

"కుదురుతుంది"

"ఎలా? ఆయనక్కోపం రాదా?"

"ఆయనక్కోపం వస్తే ఏమిటట?" నవ్వుతూ అడిగాను.

రాకేష్ నా ముఖమే చూస్తున్నాడు.

నేనతనికి బాగా దగ్గరగా నుంచుని, "చూడు మిస్టర్ రాకేష్, సుమారు ఒకటిన్నర సంవత్సరం నుంచీ నన్ను చూస్తున్నావు. వాట్‌డు యు తింక్ ఆఫ్ మి?"

"అంటే?"

"అంటే, గింటే ఏమక్కర్లేదు. సూటిగా జవాబుచెప్పు. నేను చెడ్డదాన్నా? మంచిదాన్నా? ఊఁ, వెంటనే చెప్పాలి"

"మంచివారు"

"హౌ హ్యాపీ యామ్ ఐ?"

"యు ఆర్ ఇమ్మెన్సిలీ అన్ హ్యాపీ"

నేను గట్టిగా నవ్వి అతని చెయ్యిపట్టిలాగి-

"మీకు కృతకంగా వుండమంటే ఇష్టమా?"

"ఏమాత్రమూ ఇష్టం ఉండదు"

"మరెందుకీ ముసుగు?" నేనతని ముఖాన్నే సూటిగా చూస్తూ నవ్వాను. ఒక్కక్షణం అతని కళ్ళల్లో పిరికితనం కనిపించింది. నిర్లిప్తంగా నవ్వాను. మరోక్షణానికి ఆ అధైర్యం మాయమైంది. మళ్ళీ అతని చెయ్యిపట్టుకోగానే అతను లేచి నుంచున్నాడు. ఒకసారి రెప్పలార్పడం ద్వారా నామనసు చెప్పాలనుకున్న కథ చెప్పింది. అతనికి అది స్పష్టంగా అర్థమయింది, అతను నాతో లోపలకొచ్చాడు.

బెడ్‌రూంకి రాగానే ఘుమఘుమలాడే అత్తరు వాసన 'ఆహా!' అని గుండెలనిండా పీల్చు

కున్నాడు.

"ఇది మొగలు బాదూషా జనానా, చూడు", అని గోడల్ని చూపించాను.

అమెరికా, ఇంగ్లాండ్, జర్మనీ, జపాన్, ఇండియా దేశాలకి చెందిన సుందరీ మణులంతా నగ్నంగా, అర్ధనగ్నంగా వరుసలో నిలబడి వున్నారు.

"ఏమనిపిస్తోంది?" అనడిగాను.

"షేక్స్‌పియర్ గుర్తొస్తున్నాడు"

"ఏమని?"

"వాట్ ఎ పీస్ ఆఫ్ వర్క్ ఈజ్ మ్యాన్"

"వాట్ ఎబౌట్ వుమన్?"

"షేక్స్‌పియర్ ఆ వాక్యాన్ని కంగారులో రాసుంటాడు. అదనలు రాయాల్సింది 'వుమన్ అనే" అని నవ్వాడు రాకేష్. "నేను కొండల్లో, గుట్టల్లో, పచ్చని ఆకుల్లో, పువ్వుల్లో మాత్రం అందముందనుకున్నాను. మనిషి ఇంత అందమైన ప్రాణి అనుకోలేదు నేను. ఆనంద్ సౌందర్య జ్ఞానాన్ని మెచ్చుకోవల్సిందే" అన్నాడు.

"ఉపన్యాసం తరువాత. ముందు, వచ్చి కూర్చో" అని మంచంమీదున్న వల్చటి బంగారు రంగు దుప్పటిని తీశాను. ఆ దుప్పట్లోవున్న నగ్నంగా కౌగలించుకున్న స్త్రీ పురుషుల చిత్రాన్ని చూసి మళ్ళీ ఆనంద్ ప్రసక్తి వస్తుందేమోనన్న వుద్దేశంతో ఆ దుప్పటి మడిచి పక్కకి పెట్టేశాను.

రాకేష్ మంచం మీద కూర్చున్నాడు.

నేను దగ్గరికి వెళ్ళి నా చేతుల్ని అతని భుజాలమీద వేసి అడిగాను,

"నువ్వు దేవుణ్ణి నమ్ముతావా?"

అతనిగుండె వేగంగా కొట్టుకుంది. అతని బుగ్గలెర్రబడ్డాయి.

"నమ్ముతాను"

అతని స్వరంలో సూక్ష్మమైన, సుందరమైన కంపన వుంది.

"ఏమిటా దేవుడిపేరు?"

నేను మేటర్ ఆఫ్ ఫ్యాక్ట్‌గా అతని భుజంమీద చెయ్యివేసి నుంచోడం, నా ముఖభావంలోగాని, ధ్వనిలోగాని ఏ భావవికారమూ లేకుండా వుండడం చూసి అతను ఆశ్చర్యపో

తుడై వుండాలి. కాని ప్రశ్నించే ధైర్యం అతనికి లేదు. అలాంటి ధైర్యం కేవలం ధూర్తులకి మాత్రమే ఉంటుందన్నసంగతి నాకు తెలుసు. ఒక్క క్షణం అతనంటే జాలేసింది. వెంటనే 'డోంట్ బి సెంటిమెంటల్' అని నాకు నేనే చెప్పుకున్నాను. జాలి రూపాంతరం పొంది అనన్యమైన అపేక్షగామారింది.

"పేరింకా పెట్టలేదు" అన్నాడు.

అతని స్వరంలో కంపనం తగ్గింది. అది ఆగిపోవడమే నాక్కావలసింది.

"పేరులేని దేవుణ్ణెలా తల్చుకుంటావు?" అని నవ్వాను.

అతనో క్షణం ఆలోచించి-

"అది చాలా క్లిష్టమైన ప్రశ్న" అన్నాడు.

"చెప్పు, నువ్వు ఐ.ఎ.ఎస్. పరీక్షకి కట్టినవాడివి"

"ఓడిపోయాను"

"నేను చెప్పనా?"

"చెప్పండి"

"చెప్తాను... కాని దానికి ముందు మరో ప్రశ్నకి జవాబు చెప్పాలి. హృదయం ఏవైపు వుంది?"

"ఎడంవైపు"

"ఎలా తెలుసు?"

"చెవినానిస్తే గుండె చప్పుడు వినిపిస్తుంది"

నేను అతని తలని నాగుండెల ఎడమభాగంపై ఆనించుకుని చెప్పాను,

"ఇదొక ట్రిక్ అనుకోకు, చెవి ఆన్చి విను. గుండె చప్పుడు వినిపిస్తోందా?"

"ఊఁ, వినిపిస్తోంది"

"ఇప్పుడు?" అతని తలని కుడివక్క ఆనించుకుని అడిగాను.

"లేదు"

"అది నీ పాతనమ్మకం. మనసుని కేంద్రీకరించి విను- అప్పుడు వినిపిస్తుంది"

అతను కొంతసేపు విని,

"వినబడ్డంలేదే" అన్నాడు.



"ఎందుకంత తొందర? ఇంకా జాగ్రత్తగా వి ను. అన్నీ మరచి మరీ విను. తప్పకుండా వినిపిస్తుంది. ఎడమవైపు వినిపించినంత స్ప ష్టంగా కాకపోయినా, వినిపించడం మాత్రం ఖాయం"

అతను కొంతసేపు ఆలకించి,

"అవును వినిపిస్తోంది" అన్నాడు.

"అదే దేవుడు లేనిచోట వున్నట్టు అని పించడం" అన్నాను.

"అది ఎడంవైపు కొట్టుకునే గుండె చప్పుడే దూరంగా వినిపిస్తోంది. అంతకుమించి మరే మీకాదు. లేదా నా గుండె చప్పుతే నాకు వినిపించి వుంటుంది"

"ఏదయితేనేంలే. అదే దేవుడు. తన హృద యస్పందనని మరొకరి ఎదలో వినడం, మరొ కరి హృదయస్పందనని తన ఎదతో వినడం. అదే దేవుడు. దాన్ని స్మరించడానికి పేరు అవసరం లేదు. పేరు లేకుండానే దాన్ని స్మరించుకోగలగాలి"

రాకేష్ నాముఖంలోకి సూటిగా చూస్తున్నా డు.

నేనే మాట్లాడాను.

"జీవితంలో ఏమీ వద్దు, ఎవరూ వద్దను కుని అన్నీ త్యజించి తీరా నికృష్టావస్థలో వుండే వాడు కూడా ఆ చప్పుడిని, ఆ స్పందనని వెతుక్కునిపోతాడు. ఎడంవేపు ఎంతవరకు శబ్దం అవుతుందో అది కుడివేపూ విని పిస్తుంది. ఒకరోజు కాకపోతే ఒక రోజు.... అక్కడ శబ్దం చేయగలిగే మరో హృదయాన్ని ఆలింగనం చేసుకోడానికి సిద్ధపడుతుంది"

అతను మౌనంగా వుండిపోయాడు.

నేను అతన్ని కౌగిలించుకు దగ్గరగా లాక్కుని, "ఇప్పుడు చూడు, నా కుడివైపు కూడా ఒక హృదయం వుంది" అన్నాను.

అతను చిరునవ్వు నవ్వాడు. నేనూ అంతే? జీవితాన్ని పుస్తకంతో పోలిస్తే, నా జీవిత పుస్త కంలో ఒక కొత్తపుట రాయబడింది. ఊహూ... పుటకాదు ఒక శబ్దం. ఆ శబ్దమే నాకు కావ ల్సింది. ఆ శబ్దాన్ని మాత్రమే నేను కోరుకు న్నది. దాన్ని రాసేశాక మళ్ళీ మళ్ళీ కావాల నేంలేదు. కొన్ని సంఘటనలంతే - జీవితంలో ఒక్కసారి మాత్రమే సంభవిస్తాయి.



హఠాత్తుగా ఊడిపడ్డ కూతుర్ని చూసి ఆ తల్లి చాలా ఆశ్చర్యపోయింది. ఇలాగెప్పుడూ జరగ లేదు. సుధ, ఆనంద్ దెబ్బలాడు కున్నారా? అనే శంక కూడా మనసులో మొలిచింది.

"ఎలా వచ్చావే సుధా... ఒక్కదానివే! మీ ఆయన రానిచ్చాడా?"

"ఆయన లేరు. కలకత్తా వెళ్ళారు. ఇంకా రెండు మూడురోజులగ్గాని రారు"

"నువ్విక్కడకొచ్చిన సంగతి తెలిస్తే గొడవచె య్యడా?"

"ఏమీ చెయ్యరు. ఇప్పుడాయన చాలా మారిపోయారు" అని అబద్ధం ఆడేసింది సుధ. అబద్ధం చెప్తున్న జంకు ఏ మాత్రం లేదామెలో.

సుధ తల్లికి, దొడ్డమ్మకి చీరెలు తెచ్చింది, పెత్తండ్రికి బట్టలిచ్చింది. పిల్లల సైజులు, కొలతలు తెలీకపోవడంతో ఇంట్లో కట్టుకునే రంగురంగుల, పూలపూల బట్టలు తెచ్చింది.

"చాలా డబ్బు ఖర్చుచేసి తెచ్చావెందుక మ్మా సుధా?" అనడిగింది తల్లి.

"నేను పనిచెయ్యడంలేదా? నాకు జీతం రాదా?"

"అయితే...."

"అయితే లేదు గియితే లేదు. అంతా పూరుకోండి. నేనేమీ యంత్రాన్ని కాదు. మని షిని"

ఆనంద్ సౌదీ అరేబియాకి వెళ్ళే ఆలోచన చేస్తున్నట్టూ, తను వెళ్ళడానికి ఇష్టపడటం





లేదన్న సంగతీ, అన్నీ అమ్మతో చెప్పుకోవాలనే అనుకొని వచ్చింది సుధ. కాని ఇప్పుడా సంగతులు తల్లితో చెప్పకుండానే వెళ్ళటం మంచి దనిపించింది. తీరా తను అన్నీ చెప్పాక నీ నిర్ణయం తప్పు, భర్త అన్నాక వాడెటువంటివా డయినా భార్య అతని నీడలా వుండాల్సిందే. అతనెక్కడికి వెళ్తే అక్కడికి వెళ్ళాల్సిందే. ఇంకెవరూ భర్తంత ముఖ్యం కాదు అని హిత బోధ చేస్తుందేమోనని అనిపించింది. తరువాత ఏదైతే అదవుతుంది అంతే? అయ్యాకే అమ్మతో చెబితేసరి అనుకుంది. ఆడది-అసలు ఈవిధంగా వుండాలన్న సంగతులన్నీ చట్టంగా తయారవడం, మగవాడు ఈ విధంగా వుండాలన్న సూత్రాలన్నీ కేవలం ఆశయాలుగా, ఆదర్శాలుగా అయ్యుండటం ఈ భేధాలెందుకు? అని తల్లితో వాదించడం నిష్ప్రయోజనం అన్న సంగతి సుధకి బాగా తెలుసు. అమ్మకి ఆనంద్ అంటే అసహ్యమే. అయినా, ఆనంద్ సుధల నడుమ అగాథం ఏర్పడటం ఆమె కోరిక కాదు.

కూతురు బయల్దేరేటప్పుడు,

"ఇక్కడి భూమిని అమ్మాలని వుంటే చెప్పు సుధా, అమ్మేద్దాం. నాకు అది కావాలన్న తాపత్రయమేమీ లేదు. దాన్నమ్మేసి ఇల్లు కట్టించే వుద్దేశం వుంటే అలాగే కానియ్యచ్చు. ఆనంద్ ఇప్పుడు మంచిగా మారాడని కూడా చెప్తున్నావు. అతను నీ చెయ్యి వదిలిపెట్టడనే నమ్మకం నీకుంటే డబ్బుంతా అతని చేతిలో పెట్టేద్దాం. ఇల్లు కట్టించుకోనీలే"అని, ఒక క్షణం ఆగి, గద్గద కంఠంతో"మనవణ్ణి చూసే అదృష్టం నాకు లేదు. నువ్వెన్నా బాగుంటే అదే అదృష్టం అనుకుంటాను"

ఆ మాటల్ని విని, అమ్మ కళ్ళలో నిండిన కన్నీళ్ళని చూసి, తను బాగుండాలనే ఆమె గాఢమైన కోరికని చూసి, సుధ అనుకుంది, ప్రేమ అంటే ఈ భూమ్మీద ఇదొక్కటే అని.

తన మాటలు విని కూతురు ఎప్పటిలా కన్నీరు కార్చకుండా చిరునవ్వు నవ్వి బయల్దేరడం చూసి ఆశ్చర్యం కలిగింది ఆ తల్లికి.

* * *

"హలో, ఎవరు?"

"మిల్కీవే నుంచి మాట్లాడుతున్నాను"

"ఓ, మళ్ళీ ఇంత త్వరగా..."

"ఆరు నెలలయింది కదా?"

"అయినా అనుకోకుండా, హఠాత్తుగా... మీ ప్రోగ్రాం తెలియనే లేదు"

"నిన్ను చూడాలనే..."

"పైపై కబుర్లకేంగాని, ఎన్ని రోజులుంటున్నారు?"

"నాలుగైదు రోజులు. ఎలా వున్నావు జమునా?" జాలి నిండిన గుండె.

"బాగున్నాను" తేనెలొలికే నవ్వు.

"నాన్నగారెక్కడున్నారు?"

"ఇప్పుడింట్లో లేరు, కాని వూళ్ళోనే వున్నారు"

"చూడ్డానికి కుదురుతుందా?"

"ఎవర్ని? నాన్నాగార్నా?" గుండెల్లో గిలిగింతలు పెట్టే నవ్వు.

"కాదు, కూతుర్ని"

"చూసి తీరాలా?" వ్యంగ్యపూరిత మాధుర్యం.

"సూటిగా మాట్లాడకూడదా జమునా?"

"సూటిగానే మాట్లాడుతున్నాను ఆనంద్! ఏ రూమ్?"

"తొమ్మిది వందల ముప్పయ్యొకటి"

"ఎప్పుడురాను?"

"నువ్వే చెప్పు"

"సాయంత్రం ఆరు గంటలకి"

"సరే"

"పెట్టెయ్యనా?"

"ఓ.కె. బై!"

* * *

"రూమ్ దొరకడం కష్టమయిందా?"

"మొద్దు ప్రశ్న"

"ఫరవాలేదు, లోపలికి రా"

జమున లోపలకొచ్చింది. ఆనంద్ తలుపు వేసేశాడు. డోంట్ డిస్టర్బ్ అనే ఎర్రలైటు వెలిగే స్విచ్ నొక్కాడు.

"కాఫీ తెప్పించనా?" జమున మృదువైన చేతిని తన పిడికిలిలో మృదువుగా నొక్కుతూ





అడిగాడు.

"ఏమీ వద్దు"

"మరి?"

"ముందు నా ప్రశ్నలకి జవాబు చెప్పండి" అంటూ ఆమె సోఫాలో కూర్చుంది.

"అడుగు" భావవికారం లేకుండా అన్నాడు.

"సుధ ఎలా వుంది?"

"బాగుంది"

"మీకు ఆమె అంటే ప్రేమ వుందా?"

"ఎందుకీ ప్రశ్న"

"జవాబు చెప్పండి"- ఆమె చిరునవ్వు నవ్వింది. కాని ఆ మాటలో ఆజ్ఞవుంది.

"అవును"

"ఎంత?"

"చాలా"

"నన్ను?" తుంటరినవ్వు.

"అంతే" పేలవమైన చిరునవ్వు.

"మీకెన్ని హృదయాలున్నాయి?"

"ఒకటే"

జమున గట్టిగా నవ్వేసింది.

"మీకు రెండు హృదయాలున్నాయనుకున్నాను"

"ఎందుకని?"

"ఎందుకంటే ఈరోజుల్లో ఒక్క హృదయం వుండేవాళ్ళు బొత్తిగా అరుదైపోతున్నారు. ఆ రెండు హృదయాలు ఎక్కడెక్కడుంటాయో తెలుసా?" నవ్వు.

"కాఫీ తెప్పించనా?"

"ప్రశ్నలింకా పూర్తవలేదు"

"అడుగుమరి"

"ముందు కాఫీ చెప్పండి... ఊఁ... కాఫీ వద్దులెండి... ఏదైనా సంథింగ్ కూల్... తరువాత ప్రశ్నలడుగుతాను"

ఆనంద్ ఫోన్‌చేసి ఆర్డరిచ్చాడు.

"ఇంక ప్రశ్నలడుగు"

"అదే రెండు హృదయాల సంగతి మాట్లాడదాం" చిరునవ్వు.

"ఇంకేమన్నా మాట్లాడుకుందాం జమునా"

"లేదు ఆనంద్! ఇవాళ హృదయాల గురించే, అంటే మల్టిపుల్ హార్ట్స్ గురించి మాట్లాడాలి" తుంటరి నవ్వు.

"అంత పంతమయితే సరే, ఏమిటా హృదయాల సంగతి?" నవ్వడానికి ప్రయత్నించాడు.

"మీరింతవరకు ఒకేఒక్క హృదయం వున్నవాళ్ళని ఎంతమందిని చూశారు?"

"నువ్వు, నేను అంతా ఒక్క హృదయం వున్నవాళ్ళమే కదా?"

"బుద్ధిలేని జవాబు, డాక్టర్ ఆనంద్, ఎం.కాం.,ఎల్లెల్బి.,పిహెచ్.డి, బుద్ధిలేని జవాబు!" అని గట్టిగా నవ్వింది జమున. "మీకు కనీసం రెండు హృదయాలుండి వుంటాయి. నాకు నాలుగైదన్నా వుండచ్చు. చాలావరకు రెండు మూడు లేదా నాలుగు హృదయాలున్నవాళ్ళే వుంటారు" అంది.

"దేన్ని నువ్వు హృదయం అంటావు?"

"అదే అందరూ హృదయం, హృదయం అని దేన్నంటారో దాన్నే. నాట్‌ది ఫిజియలాజికల్ వన్!"

ఆనంద్ మౌనంగా వుండిపోయాడు. జమునే మాటల్ని పొడిగించింది.

"ఒకే ఒక్క హృదయం వుందని ఎవరిగురించి అనుకోవచ్చో తెలుసా?"

"ఎవరి గురించి?"

"ఒక పుట్టు గుడ్డివాడు గురించి మాత్రం. ఒక గుడ్డివాడికి అనేక హృదయాలుండటానికి సాధ్యం కాదు. ఎందుకంటే అతను రకరకాల హృదయాలని చూడడు. అతనికి తెలిసింది తన ఒక్క హృదయంమాత్రమే. నిజంగా హృదయం అని దేన్ననాలో అది. అంతేకాక, అటువంటిదే ఒక్కో హృదయం అందరికీ వుంటుందని అతననుకుంటాడు. అందువల్ల అతను ఇంకొక... ఒకే ఒక్క హృదయాన్ని అర్థంచేసుకోగలడు. అందువల్ల మీరు పుట్టుగుడ్డివాడితో వ్యవహరిస్తే ఏక హృదయులై వుండవలసిన అవసరం వున్నది. మీ అనుబంధ హృదయాలన్నిటినీ తొలగించుకుని అతడు లేక ఆమె దగ్గరికి వెళ్ళవలసి వస్తుంది" జమున నవ్వింది.

వాళ్ళ మనశాస్త్రం''

మనసుల్ని చూసిచూసి

జీవితాన్నయినా ఒక ఫిలాస

'జనానికి కేటాయించాలను

...ఏమయినాగాని ఇది కుళ్ళిపోయే జీవితమన్న సంగతి నాకు స్పష్టమయిపోయింది'' అంది జమున నవ్వుతూనే.

ఆనంద్ హృదయం జాలినిండిన చెలమగా అయిపోయింది.

అతను దగ్గరకొచ్చి ఆమె పక్కన కూర్చుని, ఆమెని దగ్గరకు లాక్కుని-

''యు సీమ్ డిస్టర్బ్‌డ్'' అన్నాడు.

''షటప్ యు ఆర్ రాంగ్'' అని నవ్వింది.

అది ప్రపంచంలోని రహస్యాలన్నింటిని అర్థంచేసుకున్న నవ్వులా అనిపించింది ఆనంద్‌కి.

ఎందుకు నవ్వుతావని అడిగే ధైర్యంలేదు.

అతని కామం క్రుంగిపోసాగింది. దాన్ని నిలుపుకోవాలని శత ప్రయత్నంచేశాడు.

జమునకి ఆసంగతి అర్థమైపోతుందని పించి మరింత ఓడిపోసాగాడు. ఊహూఁ... ఓడిపోకూడదు అనుకున్నాడు.

జమున లేచివెళ్ళి మంచంమీద వెల్లకిలాపడుకుని అంది-

''రండి... ఇక్కడికొచ్చి కూర్చోండి''

అతనువెళ్ళి ఆమెదగ్గర కూర్చున్నాడు.

ఆమె నవ్వుతూ అడిగింది-

''నాకు, సుధకి ఏమిటి తేడా?''

''ఏమీ తేడాలేదు'' ఆ ముఖాన్ని, మెడని మృదువుగా నవరిస్తూ, గడ్డాన్ని పట్టుకొని అన్నాడు.

**''మరెందుకీ మోహం. ఇద్దరూ ఒకటే అన్నప్పుడు ఒకరు చాలరా? ఒకరితోనే తృప్తిపడటానికి సాధ్యంకాదా? ఒక్కరితో తృప్తిచెందే మగవాడిన్నొక్కడినయినా చూడలేదు ఆనంద్. అటువంటివాడుండివుంటే ఇవాళ నాబిడ్డ తండ్రిలేనివాడయ్యేవాడుకాడు... తెలుసా?''**

**ఆనంద్ ఆమెని సూటిగా చూశాడు. అతని గుండెల్లో కరుణ పొంగి పొర్లసాగింది. ఇంకేమీ మాట్లాడకుండా ఆమెను కౌగలించుకున్నాడు.**

ఆమె మాట్లాడింది.

''కుళ్ళిపోతున్న జీవితం, పురుగులు వచ్చే జీవం అన్నాను కదా- దానర్థం ఇప్పుడే నేను వల్లకాటికిపోతానని కాదు, నాలో ఇంకా మోహం వుంది. నేను ఇంకా అన్వేషణలోనే వున్నాను. నాప్రయోగం పూర్తికాకుండా నేను గోరీలోకి వెళ్ళను. చూడండి, స్టిల్ ఆయామ్ వండర్ ఫుల్'' అంటూ బట్టల్నొక్కసారిగా తీసేసింది జమున.

ఆనంద్ ఒళ్ళు మర్చిపోడానికి ఒక్కక్షణంకూడా వ్యవధిలేదు.

వెళ్ళేటప్పుడు ఆమె అన్నది-

''అయింది'' అని తుంటరిగా నవ్వుతూ.

''ఏమిటయింది?'' ఆనంద్ ఆశ్చర్యంగా అడిగాడు.

''ఈ అధ్యాయం పూర్తయింది'' అని కొత్తరకంగా నవ్వింది. ఆ నవ్వులో తీపి, చేదు నమపాళ్ళలో వున్నాయి.

''అంటే?''

''ఇక నేను మీకు కనపడను''

''ఎందుకని?'' ఆశ్చర్యంగా అడిగాడు.

''నేను మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నాను''

''ఏమిటి... మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నావా?''

''ఏం... నేనందంగాలేనా?'' ఆమెకి అలవాటయిన, నిర్లిప్తమైన నవ్వు. ''క్రితంసారి మీరే అన్నారు కదా మళ్ళీ పెళ్ళిచేసుకో అని?''

''అవునవును. కాని నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకుంటావు అనేసంగతి హఠాత్తుగా వినడంతో ఆశ్చర్యంగా అనిపించింది- అంతే''

''నమాధిలో వున్న భర్త కూడా ఇదేమాట అనచ్చు! ఓహ్... నేను చాలా అదృష్టవంతురాలిని''

''ఎందుకు?''

**''సాధ్యమయితే అర్థంచేసుకోండి లేకపోతే వూరుకోండి. జీవితం అనేది ఆకస్మికాల మాల. అసలు ఏది ఆకస్మికం కాదు? పోనీ అవన్నీ ఎందుకు? ఇదే మన చివరి కలయిక''**

''నువ్వు చెప్పినది నిజమేనా?''





"నేనెప్పుడూ అబద్ధాలు చెప్పను. ఇంకో నెలరోజుల్లో నేను మరొకరి భార్యనవుతాను. ఇంచుమించు ఈ దేశాన్ని శాశ్వతంగా వదిలివె ళ్ళిపోతాను. నేనెప్పుడైనా ఇక్కడికొచ్చినా నిన్న నలు తల్చుకోను. నాపాలిటికి నువ్వికఈ లోకంలో లేవని నేను అనుకుంటాను. నువ్వూ నేను చచ్చిపోయాననే అనుకో. క్షమించు, 'ను వ్వు' అనేశాను"

"ఫర్వాలేదు... అదే నాకిష్టం"

"సరే... నా భర్త కాబోయేవ్యక్తి ఎవరని నువ్వ డగచ్చుకదా?"

"ఎవరు?"

"నవాబుల వంశంవాడు, కోటీశ్వరుడు. ను మారు నా వయసే. విద్యావంతుడు. సహృద యుడూను"

"అదేమిటి? ఇంతవరకు అతనికి పెళ్ళేకా లేదా?"

"నీప్రశ్న వంకరగా వుంది ఆనంద్. నేరుగా అడగచ్చు కదా, 'అతను నిన్నెలా పెళ్ళాడతా డు?' అని? ఏం? నాకేమయింది? ఇప్పుడే కదా నువ్వన్నీ చూసేవు? నాకేంతక్కువయింది? ఒక బిడ్డని కన్నానంతేనా? జాక్విలిన్ కెనడి మళ్ళీ పెళ్ళి చేనుకుందంటే, నువ్వూ చేనుకోవచ్చు అంటారు ముశాబిర్‌షా"

"ఎవరాయన?"

"నా తండ్రి స్నేహితుడు. రెహమాన్ తండ్రి. రెహమాన్ ఎవరో తెలుసా? నన్ను పెళ్ళాడబోయేవాడు" అని జమున నవ్వి, "ఇ ప్పుడు నీ వంకర ప్రశ్నకి సూటయిన జవాబు- బహుశా నన్నే పెళ్ళాడాలని రెహమాన్ నుదుట రాసి వుండుండాలి" అని జమున ఆనందంగా నవ్వి, సహృదయుడన్నానుకదా, నేనతన్ని చూశాక నాకు ఆ విషయంలో ఏమా త్రం సందేహం మిగల్లేదు. నా సౌందర్యాన్ని అంటే నువ్విప్పుడు బట్టలు లేకుండా చూసిన సౌందర్యాన్ని అతనూ చూసి మాయలో పడ కుండా చేసి అతన్ని నాబందీగా చేసుకుంటా ను. నేనూ అతనికి బందీనవుతాను" అని గట్టిగా నవ్వింది. ఆ నవ్వులో హర్షోల్లాసం నిండి తొణికిసలాడింది.

"ఎందుకంత నవ్వు?"

"నేను పెళ్ళాడబోయే అతను చాలా అందంగా వుంటాడు. నీ అంత... కాదు, కాదు. నీకంటే ఎత్తుగా వుంటాడు. వల్చగా, కళాకారు డిలా అనిపిస్తాడు"

"దానికింత సంతోషమా?"

"అందుక్కాదు నేనతనికి మమతామూర్తినే కాదు, అనురాగదీపాన్ని కూడా అవుతాను" అని మళ్ళీ నవ్వింది.

ఆనంద్ గందరగోళంలో పడి ఆమె వంక చూశాడు. ఆమె నవ్వుతూనే వుంది.

"నీమాట నాకర్థంకాలేదు"

"నేను చెప్పినదాంట్లో ఉత్ప్రేక్షగాని, గూఢా ర్థాలుగాని, అబద్ధాలుగాని ఏమీ లేవు. అంతా నిజం. స్పష్టం. ఒక్క సంగతి చెప్పలేదంతే. ఎందుకంటే అదేమంత ముఖ్యమైన విషయం కాదు గనుక"

"ఏమిటది?"

"రెహమాన్ పుట్టు గుడ్డి"

ఆనంద్ తెల్లబోయి చూస్తూ నుంచుండిపో యాడు.

జమున గబుక్కున లేచి,

"ఇక్కడ నీ జాలి, కరుణ, కనికరం, దయ లాంటి బుల్‌షిట్ ఎవరికీ అవసరం లేదు. గుర్తుంచుకో. ఇటీస్ మై ఛాయిస్ టూ. ఊఁ, చెప్పు 'కంగ్రాచ్యులేషన్స్ ఎండ్ గుడ్‌లక్' అని" అంటూ చెయ్యిజాపింది.

మంత్రముగ్ధుడిలా ఆనంద్ ఆ చేతినందు కుని షేక్ చేసి "కంగ్రాచ్యులేషన్స్- మై బెస్ట్ విషెస్ టు యు" అన్నాడు.

"నీ బెస్ట్ విషెస్ వద్దు, గుడ్‌లక్ చెప్పు, చాలు" అని నవ్వింది.

"ఓ.కె. గుడ్‌లక్"

"సరే... నేనింక వెళ్ళొస్తాను. మేగాడ్ బ్లెస్ యు" అని మరోసారి గట్టిగా నవ్వేసి వెళ్ళిపో యింది జమున.

తన హృదయంలో చైతన్యం వెళ్ళిపోయిన ట్టయి ఆనంద్ కూలబడ్డాడు.

ఎదురుగా వున్న నిలువుటద్దంలో ప్రతి బింబం కనిపిస్తోంది. ఆ వ్యక్తి చాలా వేరుగా కనిపిస్తున్నాడు.

అతను వృద్ధుడిలా కనిపించాడు. ము

ఖంమీద వార్ధక్యపు ముడుతలు కనిపించాయి. వయసు గుర్తొచ్చింది. ఆరునెల్ల క్రితమే కదా నలభైఆరవ పుట్టినరోజు ఇదే హోటల్లో జరుపుకున్నాడు. నలభైఆరేళ్ళంటే ముసలితనం ఏమీకాదు. తన ఏ క్రియలోనూ వార్ధక్య లక్షణాలు లేవు. ఈ అద్దమే సరిఅయినది కాదేమో అనుకుని లేచి నుంచున్నాడు. చాలా అలసటగా అనిపించింది. జమున గుర్తొచ్చింది. పరుపుమీద వాలిపోయాడు. లోపల్నుంచెక్కడో ఆక్రందనలు- జమున... జమున... జమున... అంటూ.

అద్దం ఇప్పుడతని వెనుకభాగాన వుంది, ఒక సంవత్సరం అంతా అతనికి మీనాక్షి పిచ్చి పట్టింది. నుంచున్నా కూర్చున్నా మీనాక్షి ధ్యానమే. అతను పి.హెచ్.డి చేసేటప్పుడు బి.ఎ.కి పాఠాలు చెప్పడానికొచ్చిన మీనాక్షి కాలేజీ కంటి పాపగా వెలిగింది. ఆమెకోసం పిచ్చెక్కని మగ హృదయంలేదు: ఆనంద్ మాత్రం అదెలాగో ఆమె స్నేహం సంపాదించాడు. అతినిర్భయంగా మెలిగే మీనాక్షి మాటల్లో, వాదనలో ఎలాంటి ఇంటలెక్చ్యువల్‌కైనా సవాల్‌గా నిలబడే మీనాక్షి చైతన్యానికి మారుపేరులా వుండేది. అందాలరాశి ఆమె. ఎన్ని సాయంత్రాలో ఆమెతో గడపాడతడు. అయితే ఒక్కసారయినా ఆమె దేహాన్ని సరిగ్గా స్పృశించే అవకాశం అతనికి దొరకలేదు. హొటల్ టెర్రస్‌లపై, తోటల్లోను, సముద్రతీరంలోను అప్పుడోసారి, ఇప్పుడోసారి అన్నట్టుగా ఒంటికి ఒంటిని తాకించిన భాగ్యం కలిగిందంతే. ఓసారి సముద్రతీరంలో అతడామెను కౌగిలించుకోడానికి ప్రయత్నించినప్పుడు-

“నువ్విలాంటివన్నీ చేస్తే రేపట్నుంచి మనిద్దరం పూర్తిగా అపరిచితులమవుతాం. ఐ కెన్ ఎరేజ్ యు ఫ్రం మై మెమరీ” అంది మీనాక్షి. “నువ్వు కోరుకుంటున్నదానిలో ఆనందం, సుఖం వుండదు ఆనంద్. పైగా ఆ సుఖ సంతోషాలు అందులో సమాధి అయిపోతాయి. ఎన్నో వివాహానంతర సంబంధాల్లో కూడా ఈ దురంతం జరిగింది - నాకు తెలుసు. అవివాహితుల మధ్య సంబంధాల్లో సుఖ సంతోషాలన్నవి భ్రమ మాత్రమే. ఆనందం దొరికేది స్నేహంలో మాత్రమే. లైంగిక సంబంధంలో కాదు. నా దృష్టిలో నా శరీరంలోవున్నమాంసానికీ, నీ శరీరంలో వున్న మాంసానికి తేడాలేదు. తేడా అల్లా మెదడులో మాత్రమే. దాన్ని శుద్ధంగా వుంచుకుంటే శాంతి దొరుకుతుంది”

మీనాక్షి మనసు తెలిశాక ఆనంద్ జాగ్రత్తగా మెలగసాగాడు. ఆమె సామీప్యంతోటే తృప్తిపడసాగాడు. అతను పొందుతున్న తృప్తి లక్షణాలను ఆమె గమనించినట్టులేదు. అదొక విచిత్ర పరిస్థితి. మీనాక్షి అతనికొక సజీవచిత్రమై కూర్చుంది. ఆమె చెప్పిన విధానంలో సుఖసంతోషాలని పొందడానికి ఆనంద్ అసమర్థుడు.

తరువాత మీనాక్షి హఠాత్తుగా వెళ్ళిపోయింది. ఆఫ్రికాలో పనిచేస్తున్న ఒక డాక్టర్ని పెళ్ళిచేసుకొని వెళ్ళిన మీనాక్షి ఆరునెల్లకల్లా వెనక్కి స్వదేశానికి వచ్చింది-నిర్జీవంగా....శవంగా....ఆమె డాక్టర్ మొగుడు ఆవిడశవాన్ని విమానంలోవేసి ఆమె తండ్రికి పంపించాడు.

మీనాక్షి అదృశ్యమయ్యాక జమున వచ్చింది. ఆనంద్ ప్రాణంలో ప్రాణం అయిపోయింది. ఆనంద్ డాక్టరేట్ పూర్తిచేసి బొంబాయివెళ్ళి జమునని మరచి మరొకామెని వివాహమాడాడు. జమున ఏమాత్రం బాధపడలేదు.

మరొకడిని పెళ్ళాడి, తల్లిఅయ్యి, రెండేళ్ళ తరువాత విచ్ఛేదనజరిగి తండ్రి ఇంట్లో వుండాల్సివచ్చినా ఆమె చలించలేదు. విడిపోయిన తరువాత ఆమె మాజీ భర్త మరో పెళ్ళి చేసుకున్న నెలరోజులకల్లా విమానప్రమాదంలో చనిపోయాడని తెలిసినప్పుడు ఆమె సంతోషించలేదు. రెండు బొట్లు కన్నీరు కార్చింది. అది ఆమె మానవత్వం. అంతే.

మళ్ళీ ఆమెని ఆనంద్ కలకత్తాలో చూసినప్పుడు అదే పాత జమునగా దర్శనమిచ్చింది. మళ్ళీ ఏ భావంతో ఆమె తన దేహాన్ని అతనికప్పగించిందో అతనికర్థంకాలేదు. ఆమె ఎత్తుకి అతను ఎదగలేకపోయాడు. పరిస్థితులన్ని ఆమె అదుపులోనే వుంటాయి. ఇప్పుడు, మళ్ళీ పెళ్ళిచేసుకుంటాను, గుడ్డివాడిని పెళ్ళాడతాను అని ఆమె నవ్వుతూ చెప్పి వెళ్ళిపోతున్నప్పుడు మళ్ళీ పాత జమునలాగే కనిపించింది.

జమునని మర్చిపోడానికి ప్రయత్నించాడు.





'నేను సుధలాగే వున్నప్పుడు నీకు రెండు దేహాలెందుకు? ఒక దేహం చాలదా?' అనడ గింది జమున.

ఆలోచించినకొద్దీ, 'తను సుధలోనే తన ప్రేమ సాయుజ్యాన్ని పొందగలగాలి. అద్దంలో తను ఇందాకా చూసుకున్న నిర్జీవ రూపానికి జీవం పొయ్యాలి. ఇంక ఎవరి మోహానికీ చిక్కుకో కూడదు. అంతా తన వశంలోనే వుంచుకోవాలి. తను ఫుట్‌బాలవకూడదు. తనే ఆటగాడవ్వాలి. ఇక తప్పులు జరగకూడదు, అనిపిస్తోంది.

అంటే....

అదొక భయంకర కాళరాత్రి అయిపోయింది. ఒంటరితనం, దిక్కులేనితనం, నిరాధార భావం అతన్ని జీవితంలో మొదటిసారిగా వేధించాయి. రాత్రంతా అతను నిద్రపోలేదు.

మళ్ళీ పొద్దున్నే కాన్ఫరెన్స్‌లో మాట్లాడి, మధ్యాహ్నం భోంచేసి నిద్రపోయినవాడు సాయంత్రం ఐదు గంటలకి లేచాడు.

కాఫీ తాగి కూర్చున్నాక, తలుపు ఓరగా తెరచి ఒక సుందర వదనం లోపలికి తొంగి చూసి, మధురస్వరంతో

"డు యు రిక్వైర్ ఎనీ సర్వీస్?" అనడిగింది. అహ్లాదంగా అత్తరు పరిమళం వ్యాపించింది.

"ప్లీజ్ కమిన్" అన్నాడు రెక్కలు విప్పి ఎగరడానికి సిద్ధమైన పక్షిలా.



మహేష్, శీలా మరీ ఒత్తిడిచేయడంతో నేనూ నీళ్ళల్లోకి దిగాను. శీలా ఏర్పాట్లతోటే వచ్చింది. తను బికినీ తొడుక్కుని నీళ్ళల్లోకి దిగుతుంటే మొట్టమొదటిసారి అనిపించింది, 'శీలా మరీ గడకర్ర కాదు, ఆమె దేహంలో కూడా కొంచెం ఎత్తువల్లాలున్నాయ'ని. నేను చీరకట్టుకునే నీళ్ళల్లోకి దిగబోయాను.

శీలా నన్ను చూసి- "మరీ పల్లెటూరి గబ్బిలాయిలా వేషాలెయ్యకు" అని చీర తీయించేసి నా చెయ్యిపట్టుకుని నీళ్ళల్లోకి లాగింది. నాకు ముగ్గురు మగవాళ్ళుండగా ఈ వేషంలో కనిపించడం మొహమాటంగానే అనిపించింది. ఆనంద్ వంక చూశాను. అతననలు ఈ విషయం అంతగా పట్టించుకున్నట్టు లేదు. ఈసారి కలకత్తానుంచి వచ్చినప్పట్నుంచీ వాగుడు తగ్గిపోయిందిగాని ఎందుకో కలవరపడుతున్నట్టున్నాడు.

రాకేష్ తనమానానతను అలలతో ఆడుకుంటున్నాడు. అప్పుడప్పుడు నావేపు దొంగ చూపులు చూస్తున్నది మహేష్ ఒక్కడే. రాకేష్‌కి ఇప్పుడు నన్ను ఈవిధంగా చూడాలనే కొత్త కోరికేమీ వుండదనిపించింది. నీళ్ళలో మునిగి లేచాక సిగ్గు తగ్గినట్టనిపించినా లంగా తడిసిపోయి ఒంటికంటుకుపోతుంటే ఏదో ఇబ్బందిగానే వుంది. శీలాకి ఈత బాగావచ్చు. నాకంత బాగా రాదు. అంతేకాక సముద్రస్నానానికి దిగడం ఇదే మొదటిసారి. శీలా ఒత్తిడి లేకపోతే ఈ సముద్రం నాకు అపరిచితంగానే వుండిపోయేది. నీళ్ళలోకి దిగాక ఒక కెరటం వచ్చి నా ఒంటిమీద విరిగాక భయం తొలగిపోయింది. కెరటాలు నిండిన నీటి పానుపుపై తేలాడుతుంటే ఇలా తేలిపోతూ దూరంగా....ఎవరికీ అందనంత దూరంగా వెళ్ళిపోతే ఎలా వుంటుందన్న పిచ్చి ఆలోచనొకటి మెరిసింది.

రాకేష్, మహేష్ కూడా ఈదుతున్నారు. ఈత రానిదల్లా ఆనంద్‌కొక్కడికే. అతను మోకాలి లోతు నీళ్ళల్లో నుంచుని, కూర్చుని కెరటం వచ్చినప్పుడల్లా భయంతో ఇసుకవేపు అడుగులేస్తున్నాడు.

"సముద్రతీరంలో పుట్టి పెరిగినవాడివి, అలలంటే భయపడతావేమిటయ్యా బాబూ" అన్నాడు మహేష్ నవ్వుతూ.

"చెరువులో బాగా ఈతలు కొట్టేవాడిని. ఎందుకోగాని ఈదడం కోసం సముద్రంలో

ఎప్పుడూ దిగేవాడిని కాను'' అన్నాడు ఆనంద్.

"సముద్రంలో ఈదగలిగినవాడే నిజమైన ఈతగాడు''

"పోన్లేద్దూ... నేనిప్పుడేమీ ఈత పోటీల్లో పాల్గోటానికి రెడీ అవక్కర్లేదు. సముద్రానికి వచ్చేతీరిక మాత్రం ఎప్పుడుంది గనుక. ఏదో సంవత్సరానికోసారి రాగలిగితే గొప్ప'' అన్నాడు ఆనంద్.

ఎందుకిన్ని కబుర్లు. ఈతరాదని సూటిగా చెప్పచ్చు కదా మానవుడు, అనుకున్నాను.

ముగ్గురు మగవాళ్ళలో రాకేష్ స్విమింగ్ షార్ట్స్‌లో అందంగా కనిపించాడు. అతను మహేష్‌కంటే పధ్నాలుగేళ్ళు, ఆనంద్‌కంటే పద్దెనిమిదేళ్ళు చిన్న. పొడుగులో మహేష్, రాకేష్ సమానంగా వున్నా మహేష్‌కి కొద్దిగా బొజ్జవుంది. అది నిజమైన బొజ్జకాదని ఒకసారి ప్రాణాపాయ కారణమైన ఎలర్జీ వచ్చినప్పుడు దాన్ని అరికట్టడానికి ఏదో మందు తీసుకుంటే దానివల్ల రియాక్షన్‌గా ఈ 'ఇర్రివర్సిబుల్



ఫ్యాటో వచ్చేసిందని మహేష్ చెప్పేవాడు. అసలు సంగతేమిటో అతనికే తెలును. ఆనంద్ కొలతలు, ఆకారం పరిమితంగా, కరెక్ట్‌గా వున్నా అన్నీ పేలవంగా అని పించాయి. రాకేష్ దృఢమైన భుజాలు, దట్టమైన నల్లని రోమాలతో నిండిన విశాల వక్షస్థలం, బిగువైన కండరాలతో నిండిన బాహువులు, దృఢమైన తొడలు, కాళ్ళు, పలుచటి పొట్ట ఆకర్షణీయంగా కనిపించాయి. దట్టమైన నల్లటి జుట్టు విశాలమైన ముఖసౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసింది. ముక్కు ఇంకొంచెం సూదిగా వుంటే బాగుండేదేమో. కనుబొమ్మలు నల్లగా దట్టంగా వుండటం అందమా, కాదా అని ఇంకా నిర్ణయించడానికి వీలవలేదు. ఆనంద్‌కీ అలాంటి కనుబొమలే వున్నాయి. ఆనంద్ విషయంలో దైవికంగా నేను జుగుప్స చెందే విషయమేమిటంటే అతని చెవుల మీదుండే రోమాలు. అలాంటి రోమాలు రాకేష్‌కి లేవు. దట్టమైన కనుబొమల నీడల్లో రాకేష్ కళ్ళూ ఆనంద్ కళ్ళలాగే అందమైనవి. చిరునవ్వు నవ్వినపుడు మాత్రం రాకేష్ కళ్ళు నిర్మలంగా, నిష్కపటంగా పసిబిడ్డ కళ్ళలా వుంటాయి. ఆనంద్ ఏదో కృత్రిమతని లోపల దాచుకున్న విలన్‌లా కనిపిస్తాడు. నేను ఆనంద్‌ని బాగా అర్థం చేసుకున్న మనిషిని కనుక నాకలా అనిపించవచ్చు.

రాకేష్ విగ్రహాన్ని నేను గమనిస్తున్నదిప్పుడే అన్న సంగతికి నాక్కొంచం ఆశ్చర్యం కలిగింది. 'ఇందులో ఆశ్చర్యపడ్డానికేముంది? అన్ని సందర్భాల్లోనూ మనసు అన్నింటినీ గమనించదు. ఆయా సన్నివేశాల్లో మానసిక ఆకర్షణకి సంబంధించినదాన్ని మాత్రం గమనిస్తుంది, అన్నదొక్కటే నిజం' అన్న విషయాన్ని గ్రహించాక ఆశ్చర్యం తగ్గింది.

ఒక పాసింగ్ థాట్. ఎమిలీజోలా సృష్టించిన తెరెసా ర్యాక్విన్ గురించి దానిలాగే ఇక్కడ జరిగితే ఎలా వుంటుందని? రాకేష్ ఆనంద్‌ని సముద్రంలోకి తోసెయ్యాలని కాదు, ఒక పెద్ద కెరటం వచ్చి ఆనంద్‌ని లాక్కుపోతే... రక్షించడానికి అవకాశం వున్నా రాకేష్ ప్రయత్నించకపోవడం.... వగైరా....ఒకవేళ ఆ కెరటం అతన్ని అరేబియాల్లోకి తీసుకెళ్ళి వదిలినా సరే, అనుకుని మనసులోనే నవ్వుకున్నాను.

స్నానంచేసి, బండ చాటుకి వెళ్ళి బట్టలు మార్చుకున్నాను. ఆనంద్ అదేదో కొత్తరకంగా నా దేహాన్ని చూసినట్టనిపించింది. బహుశా శీలా అలంకారం వెనుకనున్న గడకర్ర దేహాన్ని చూశాక నామీద ఆకర్షణ పెరిగిందేమో లేదా నేనేమన్నా కొత్తగా కనిపిస్తుండి వుండవచ్చా!? కొందరు మగవాళ్ళకి భార్య 'ఎవరోలా కనిపిస్తే మజాగా వుంటుంది లేదా ఎవరెవరినో తన భార్యగా వూహించుకుంటే ఇంకా మజాగా వుంటుందట.

కాని ఆనంద్ ముఖంలో భావవికారం లేదు. కళ్ళు నామీదున్నా దృష్టి ఇక్కడ లేదు. అతను చూస్తున్నదేమిటి? కనిపిస్తున్నదేమిటి?

ఈ రకమైన అలజడి తీరు మరీ కొత్తగా అనిపిస్తోంది. ఆనంద్ సహజత్వం ఏమిటంటే కోతిచేష్టగా ప్రవర్తించడం, ఇలా వుంటే అతను అతను కాడు.

★ ★ ★

ఈ డిస్కవరీ రోమాంచననీ, విలక్షణమయిన ఒక సంతోషాన్ని నాలో కలుగజేసింది. దానితో బాటు ఏదో భయం. భయం వెనువెంటే ఏదో పిచ్చిధైర్యం.

ఇదివరకు హత్య గురించి, హంతకురాలిగా ఆలోచించాను. అప్పుడు హత్య కొత్తరకంగా వుండాలని, హత్య ఎట్టి పరిస్థితుల్లోనూ హత్యగా బయటపడకూడదని, హత్యచేయకుండానే చంపాలని విచిత్రంగా ఆలోచించిన సంగతి గుర్తొచ్చింది.

ఎప్పటికీ పరిశోధింపబడని హత్యలో కూడా రెండు రకాలుండాలి. ఇది హత్య అని హత్య చేయబడ్డవాడికి తెలియకూడదు. హంతకుడు లేక హంతకురాలెవరన్న సంగతి ఇతరులకి గాని, హత్యచేయబడ్డవాడికి గాని తెలియకూడదు. ఒకవేళ హత్య చేయబడ్డవాడికి తన హంతకుడెవరో తెలిసినా ఆమాట పైకి చెప్పలేక చావాలి. ప్రాణం పోయేటప్పుడు కూడా హంతకుడెదురుగా వచ్చినా చెప్పలేని పరిస్థితిలో పడాలి. చావు దెబ్బతగిలి అతడి ప్రాణం పోయేలోగా ఈమధ్యకాలంలో అతన్నేమని వివరించచ్చు? 'హత్య జరిగింది, చావు ఖాయం, కాని ఇంకా చావలేదు' అని అతని గురించి




వివరించవచ్చు. అంటే ఆ స్థితిలో అతను బతికినట్టుకాదు, చచ్చినట్టూ కాదు అని అర్థం. ఇప్పుడు నాలో తలెత్తిన ప్రశ్న ఒక్కటే. ఆ అవధి 'ఎక్కువ' అంటే ఎంతకాలం కావచ్చు? ఎంత దీర్ఘకాలం కావడానికి సాధ్యం? ఆకాశాన్నంటే హర్మ్యాగ్రం నుంచి నేనతన్ని తోసేస్తే ఆ అవధి బొత్తిగా తక్కువ. కేవలం ఒకటి రెండు సెకన్లు అంతే.

'అతి దీర్ఘం' అంటే?

జీవిత పర్యంతం కావచ్చుకదా? ఒక మనిషికి నాలుకని, కళ్ళని, కాళ్ళు చేతుల్ని పీకి పారేస్తే అతను తన హంతకుడెవరైనదీ చెప్పలేడు. దీన్ని 'చిత్ర హింస' అని అంటే, దాని బదులు మెదడులో ఒక భాగాన్ని క్రియాహీనం చేసేయొచ్చుకదా.

మన చుట్టూ ఎంతోమంది హత్యచేయబడ్డ వ్యక్తులు తిరుగుతున్నారు. ఎంతోమందికి తమని హత్య చేసినవాళ్ళెవరో తెలును. అయినా నోరు విప్పిచెప్పలేరు.

ఈ రిసెర్చి ఏదో బాగుంది. దీని గురించి ఇంకా ఆలోచించాల్సింది చాలా వుంది.

'డిస్కవరీ' ఉద్వేగంలో వుండగానే ఒకరోజు సాయంత్రం ఆనంద్‌కంటే ముందుగా రాకేష్ ఇంటికి వచ్చేసరికి, ఆనందం పట్టలేక చెప్పేశాను.

"ఐ యామ్ థ్రిల్డ్"

"ఎందుకు?"

"ఒక డిస్కవరీ చేసి"

"ఏమిటది?"

"గెస్ ఇట్" అన్నాను.

రాకేష్ కొంతసేపు ఆలోచించాడు.

"ఏమీ తట్టటం లేదే" అన్నాడు.

"ఇన్నేళ్ళుగా జరగని సంగతొకటి జరిగినట్టుంది"

అయినా అతనికర్థం కాలేదు.

"నువ్వొక మొద్దువి. నీకు ఐ.ఎ.యస్.సెలెక్షన్ దొరకడం అనుమానమే" అని నవ్వాను.

"మీ మాటలు మరీ చిక్కు ప్రశ్నలాగున్నాయి"

"ఒక వ్యక్తియొక్క చిక్కు ప్రశ్న ముడివిడితే ఆ వ్యక్తే చివరికి చిక్కు ప్రశ్నగా మిగిలిపోతాడు"

"ఏ చిక్కు ప్రశ్న ముడి విడింది?"

"పన్నెండేళ్ళ నుంచీ విడివడని చిక్కు ప్రశ్న"

రాకేష్ ఆశ్చర్యం ఆలోచనగా మారింది.

"అనుకోనిదేమీ కాదనుకో. ఆడపిల్లేనేమో"

రాకేష్ ముఖభావం తేలికపడింది. తరువాత గంభీరం కూడా అయింది.

"ఆడపిల్లనే నేనూ కోరుకున్నది. ఖచ్చితంగా ఆడపిల్లే అయ్యుంటుంది కూడా" అన్నాను ఆనందంగా.

రాకేష్ ఏమీ మాట్లాడకుండా నేలవంక చూస్తూ కూర్చున్నాడు.

"ఏమిటంత ఆలోచన?"

అతనింకా మౌనంగానే వున్నాడు.

"చెప్పుమరి" ఒత్తిడి చేశాను.

"ఏమిటో గందరగోళంగా వుంది" అన్నాడు రాకేష్.

"భయమా?"

"కొద్దిగా అదే. ఆనంద్ రియాక్షన్ ఏవిధంగా వుంటుందా అని"

"హూ కేర్స్? ఒక్క సంగతి మాత్రం అతనికీ నాకూ కూడా తెలును"

"ఏమిటది?"

"నేను తల్లిని కాగలను. అతను తండ్రి కాలేడు. అలాగని అతను నాకు చెప్పలేదు. నేను అతనికి చెప్పలేదు. ఈ స్థితిని లోకం ఏమంటుందో తెలుసా? ఇంకా అవైజ్ఞానికత వంచాంగంలో బతికే సమాజం స్త్రీని 'గొడ్రాలు' అంటుంది. అలాంటి మగవాడినేమనిపిలవాలో సమాజానికింకా తెలిసినట్టులేదు. దానికింకా ఒక శబ్దాన్ని సమాజం సృష్టించలేదు. ఎందుకంటే ఇది పురుషుడి సమాజం. స్త్రీ కంఠంనుంచి వచ్చేదికూడా పురుషుడి భాషే, పురుషుడిదే ధ్వని. 'గొడ్డుమోతు' అనే పదం ఒక అవహేళనాపదంకాదు, వైజ్ఞానికపదం అని అనేమాటుంటే, ఇట్ మస్ట్ బి యూస్డ్ ఫర్ ది రాంగ్ పెర్సన్. ఆ పదాన్నే పుల్లింగానికి కూడా వాడాలి"

"మీ వాదం కరక్టే"

"నీకేమనిపిస్తుంది?"

"నాకూ అలాగే అనిపిస్తుంది" అని నవ్వటానికి ప్రయత్నించాడు.

"ఎలా?" అని ఆశ్చర్యపోయాను.

"ది ఫుల్‌ఫిల్‌మెంట్ ఆఫ్ ది మేరీడ్ లైఫ్ ఈజ్ పేరెంట్‌హుడ్. వీ నోస్ వీ కాంట్ ఎటెయియన్ ఇట్. ఎండ్ హికాంట్ మేక్ యూ ఎటెయిన్ ఇట్. ఎండ్ దట్ కాజెస్ ఎ సైకలాజికల్ సిక్‌నెస్. అందమైన భార్యని ఇంట్లో బంధించి కనిపించిన ఆడదాన్నల్లా కౌగిలించుకోడానికి పరుగులెడతాడు. అదే ఈ రోగలక్షణాల్లో ఒకటి"

ఇప్పుడు రాకేష్ మొహంలో వెలుగొచ్చింది.

నేను నవ్వుతూ,

"నీకు ఐ.ఎ.యస్ సెలక్షనొస్తుంది" అని చెప్పాను.

అతనూ మందహాసం చేశాడు.

"మనం పెళ్ళి చేసుకుందామా?"

అతని ముఖంలో దిగులు స్పష్టంగా దర్శనమిచ్చింది.

"భయపడకు, తమాషాకి అన్నాను" అని, "నీ రిజల్ట్స్ ఎప్పుడొస్తాయి?" అనడిగాను.

"ఈ నెలలో రావచ్చు"

"సెలక్షన్ దొరికితే వెళ్ళేముందు చెప్పి వెళ్తావు కదా?"

"ఇదేం ప్రశ్న?"

"ఊరికే ప్రశ్న. అంతే. అయినా అడగాలని అనిపించింది. ఇప్పుడేమీ మహా విచిత్రం జరిగిపోలేదు, కొన్నిసార్లు ఇలాంటివి జరుగుతాయి. నా దృష్టిలో ఇలా జరగడంలో తప్పేమీ లేదు"

"మీకేం భయంగా లేదా?"

"ఏం భయం?"

"ఆనంద్ గురించి"

"నేను అన్నింటికీ సిద్ధంగా వున్నాను రాకేష్. చావడానికీ భయపడను, బతకడానికీ భయపడను. ఆనంద్ నన్ను చంపాలనుకుంటే అతని చేతికి ఆయుధాన్ని అందివ్వగలను. ఈ సమాజం నిర్మించిన కట్టుబాట్లమీద నాకేం నమ్మకంలేదు. ఇఫ్ ఐ లివ్, ఐ లివ్ యాజ్ ఎ మదర్. ఇఫ్ ఐ డై ఐ డై" అని ఉద్వేగంతో చెప్పాను.

రాకేష్ మౌనంగా కూర్చున్నాడు.

"నీ సంతోషంకోసం నేనోమాట చెప్పాలి" అన్నాను.

"ఏమిటది?"

"అన్నీ మర్చిపో"

"ఎందుకనీ?"

"ఇవన్నీ చిన్నచిన్న విషయాలు" నవ్వుతూ అన్నాను. అతను వూరుకున్నాడు.

"ఆనంద్, మహేష్ కోతలు కోసేస్తుంటారెప్పుడైనా విన్నావా?"

"కొద్దికొద్దిగా విన్నాను"

"నువ్వూ డబ్బా కొట్టుకోనక్కర్లేదు అంతే"

రాకేష్ నేలవైపు చూస్తూ కూర్చున్నాడు.

"విల్ యు లవ్ యువర్ వైఫ్?"

"అంటే...?"

"యు మస్ట్ లవ్ యువర్ వైఫ్" అన్నాను.

ఏదేదో మాట్లాడేస్తున్నాననిపించి ఉద్వేగాన్ని అణచుకుని మాటలాపేశాను.

రాకేష్ ఆలోచిస్తూ కూర్చున్నాడు.

తలుపు తీసేవుంది.

ఆనంద్ లోపలికొచ్చాడు.

ఆనంద్‌ని చూడగానే రాకేష్ ముఖం కాంతిహీనమయింది. కష్టపడి చిరునవ్వు నవ్వాడు. రాకేష్ భావాల్ని ఆనంద్ గమనించాడేమోనని అనుమానం వచ్చింది.

"హలో రాకేష్... ఎప్పుడొచ్చారు?"

"ఇప్పుడే" రాకేష్ గొంతులో కొద్దిగా కంపనం వుంది. అయినా తన భావవికారాన్ని మాత్రం త్వరగా సరిదిద్దుకున్నాడు.

ఆనంద్ చటుక్కున తిరిగి నా ముఖంవైపు చూశాడు.

ఓడిపోయాడు.

భావాల్ని బయటపెట్టకుండా వుండటంలో నేను చాలా సమర్థురాల్ని. ఇంతవరకూ అదే కదా చేసింది. నా ముఖంలో కేవలం చిరునవ్వు.

నేను గంభీరంగా లేచి టీ కలపడానికి





వెళ్ళాను. ఆనంద్ మా విప్పి బెడ్‌రూమ్‌కి వెళ్ళాడు.

పై మాత్రం విప్పి బాత్రూంకి వెళ్ళొచ్చాడు.

అంతలోకే టీ సిద్ధమైంది.

టీ తాగేటప్పుడూ ఎవరి నోటివెంటా ఒక్క మాటకూడా బయటికి రాలేదు. సౌజన్యానికయినా సుధ అయినా ఏమన్నా మాట్లాడాల్సింది. కాని అటువంటి భయం ఆమెకేమీ లేదు. ఆ కొత్త ధైర్యం వచ్చినందుకు లోలోపలే అభినందించాను. ఆ ఆనందంలో మొట్టమొదటి టీ కప్పు ఖాళీచేసింది నేనే.

టీ తాగి రెండే రెండు నిమిషాలు కూర్చున్న రాకేష్,

"నేనింక వెళ్ళొస్తాను" అని వినయపూర్వకంగా చెప్పి బయల్దేరాడు. ఆ మాట చెప్పేప్పుడు నా ముఖం చూశాడు. మాటలయిపోయాక ఆనంద్‌ని చూశాడు.

నా గురించి రాకేష్ ముఖంలో కంగారు, భయమే కనిపించింది.

అతను వెళ్ళిన తర్వాత ఆనంద్ నన్ను సూటిగా చూసి, గంభీరంగా అడిగాడు-

"ఇతనెందుకీమధ్య అప్పుడప్పుడొస్తున్నాడు?"

"ఏమో బాబూ నాకు తెలీదు"

"అదీ నేను లేని సమయంలోనా?"

"అలాంటిదేమీ ఉండుండదు"

"కాలేజీలో ఎలా ఉంటాడు?"

"అంటే?"

"అతను నీ రూపంచూసి ఆకర్షితుడైనట్టు నాకు కొన్నిసార్లు అనిపించింది. అలాగేమన్నా..."

"అలాగేమన్నా?"

ఆనంద్‌కి ఓరిమి నశించింది.

"నీకు, అతనికి ఏమిటి సంబంధం?"

"అతను నా కొలీగ్"

"అది కాలేజీలో"

"ఓహో... అంటే ఇక్కడ అతనికి, నాకు మధ్య వున్న సంబంధం ఏమిటీ- అని అడిగారా?" అని గట్టిగా నవ్వేశాను.

"ఎందుకా నవ్వు?" ఆనంద్ విసుగ్గా ఆశ్చర్యంగా అడిగాడు.

"సంబంధం అనే శబ్దం గురించి"

"ఏముంది అందులో అంత నవ్వు రావడానికి?"

"సంబంధం లేకుండా వుండటం కూడా ఒక సంబంధమేగా?"

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకు"

"అతనూ మీలాగే ఒక మనిషి"

వెంటనే గంభీరంగా జవాబిచ్చాను.

కొంచెంసేపు వూరుకుని అతనన్నాడు.

"అతన్ని కాస్త హెచ్చరించాల్సిన అవసరం వున్నట్టుగా కనిపిస్తోంది. "నీచేతకాకపోతే చెప్పు, నేనే హెచ్చరిస్తాను"

"అవసరం లేదు"

"ఎందుకవసరం లేదు?"

"అతను త్వరలో వెళ్ళిపోతాడనుకుంటా"

"ఎక్కడికి?"

"అతనికి ఐ.ఎ.యస్.కి సెలక్షన్ వచ్చే అవకాశం వుంది"

"ఆరునెల్లనుంచి ఈ సంగతి చెప్తూనే వున్నాడు. డుయు థింక్ హివిల్ గెటిట్?"

"ఐ థింక్ హి హాజ్ గాట్ ఇట్" అని చిరునవ్వు నవ్వాను.

"అలా అని అతను నీతో చెప్పాడా?"

"ఇంచుమించు"

"అంతసేపు నీతో కూర్చుని మాట్లాడాడు. నేనొస్తే నాదగ్గర ఒక్కమాట కూడా మాట్లాడలేదు?"

అతని మాటలు కుర్రతనంగా అనిపించి నవ్వొచ్చింది.

"మళ్ళీ ఎందుకు నవ్వు?" ఉరిమాడు.

"ఈ మగవాళ్ళు ఎందుకిలా చేస్తారని"

"ఎలా?"

"ఒక మగవాడిని తన భర్తకి చూపించి- చూడండి, ఎంత అందంగా వున్నాడో అని చెప్పడానికి ఎంతమంది ఆడవాళ్ళకి సాధ్యమా అని" మెల్లిగా నవ్వాను.

ఒక క్షణం ఆగి అతనన్నాడు-

"ఒక ఆడదాన్ని చూపించి ఇదేమాటని

భార్యతో అనడానికి ఎంతమంది మగవాళ్ళకి సాధ్యం?"

"బహుశా మీకు సాధ్యం" అని గట్టిగా నవ్వాను.

"బికాజ్ అయామ్ బ్రాడ్ మైండెడ్"

"అలాగని మీరు అన్నింటినీ 'సంబంధం' అని అనుకోడం సరికాదుకదా" అని గంభీరంగా అడిగాను.

అతను వూరుకున్నాడు.

★ ★ ★

ఇఫ్తికార్ దగ్గర్నుంచి స్పాన్సర్‌షిప్ లెటర్ ప్రొవిజనల్ ఎపాయింట్‌మెంట్ లెటర్, వగైరా వచ్చాయి. వాటితోపాటు-

'ఉద్యోగం విషయంలో అన్ని ఏర్పాట్లుచేశాను. ధైర్యంగా బయల్దేరు. రాజీనామా ఇవ్వద్దు. ఒక నెల్లాళ్ళు సెలవు తీసుకుని రా. నువ్విక్కడి కొచ్చి చేరితే చాలు. సుధనీ తీసుకురా. ఆమెకీ ఉద్యోగం వేయించే ఏర్పాటుచేశాను'- అనే ఉత్తరం వచ్చింది.

ఉత్తరం సుధకి చూపించి, ఆనంద్ అన్నాడు-

"ఇప్పుడెలాగూ నీకు సెలవులు. మే రెండవవారంలో వెళ్దాం. జూన్ ఒక్క నెలకి లీవ్ లెటర్ రాసెయ్యి. ఇద్దరం వెళ్దాం. తరువాత నువ్వొక్కత్తెవీ రావడం కష్టం. ఒకవేళ అక్కడేమన్నా ఇబ్బందులుంటే సెలవు పూర్తయ్యేలోగా తిరిగి వెనక్కొచ్చేస్తే సరి. ఇఫ్తికార్ ఇంతగా రాశాక భయపడాల్సిన అవసరం లేదు"

"నేను రాకపోతేనేం? మీరు వెళ్ళి రాకూడదూ?" సుధ అనాసక్తిగా అంది.

"నీకూ ఉద్యోగం దొరుకుతుందని ఇఫ్తికార్ రాశాడు"

"నా కిష్టం లేదు, ఈ ఉద్యోగం చాలు"

"ఇంతకాలం మనిద్దరం చాకిరీ చేసినా ఏం దొరికింది? నెలకో వెయ్యి రూపాయలైనా పొదుపుచెయ్యలేకపోయాం. అక్కడ నాలుగైదేళ్ళు కష్టపడితే చాలు, తరువాత ఇక్కడికొచ్చి హాయిగా వుండచ్చు"

"నాకు దేశాన్నొదిలి వెళ్ళడం ఇష్టం లేదు"

"ఇక్కడే వుంటే, ఇలాంటి ఆలోచనలే వస్తాయి- నూతిలో కప్పల్లాగ"

"ఎంత సంపాదించినా ఇక్కడ దొరికే శాంతి సౌఖ్యాలు అక్కడ దొరకవు"

"నీకేమి తెలును?"

"నాకూ తెలును. అదొక ఇసుక ఎడారి. పెట్రోలు వల్ల దాన్నీ ఒక దేశం అంటున్నారు. నీళ్ళు మట్టీ అన్నీ ఇంపోర్ట్ చేసుకుని బతుకుతారట. అక్కడి నియమాలూ విచిత్రమట. ఇక్కడి ఆడవాళ్ళల్లా అక్కడ ఆడవాళ్ళు రోడ్ల మీద నడవకూడదట కదా? జెడ్డాలో దిగినప్పుడే బురఖాలో దూరాలేమో"

"అలాగేం వుండదు. ఏమైనా మనిద్దరం అక్కడకి శాశ్వతంగా వుండటానికి వెళ్ళటం లేదు కదా. నాలుగైదేళ్ళుండి వచ్చేస్తాం కదా"

"నెలకి వేలకొద్దీ రూపాయలొస్తుంటే, లక్షలకి లక్షలు పోగుచేసే ఆశతో, ధ్యాసతో అక్కడే వుండిపోతారు మన ప్రజలు. స్వదేశానికి వచ్చే మాట కేవలం మాటగానే మిగిలిపోతుంది"

"ఇన్నేసి ఆలోచనలు నీకెలా తెలును?"

"నేనేమన్నా చంటిపిల్లనా, చదువులేని మొద్దునా? మీకు పదిరకాల సంగతులు తెలిసినట్టే నాకూ తెలియవా?"

"అవన్నీ అలా వుంచు. నువ్వు నాతో ప్రయాణమవ్వాలి. నువ్వు లేకపోతే నాకొక్కరోజు కూడా గడవదు"

"అలాంటిదేమీ వుండదు. సౌదీఅరేబియాలో ఆడవాళ్ళకేం కరువుండదు. బహిరంగంగా కాకపోయినా చాటుమాటుగా అన్ని వ్యవహారాలు నడుస్తాయట. బురఖా దాటి బయటకి రాలేని టొమేటోల్లాంటి ఆడవాళ్ళు ఎవరొస్తారా అని ఎదురుచూస్తుంటారట! కొద్దిగా జాగ్రత్తగా వుంటేసరి"

ఆనంద్ ఆశ్చర్యంగా నాముఖంలోకి చూశాడు. సుధేనా ఇంతలా మాట్లాడుతోందని తెల్లబోతున్నాడు.

"కొత్త కొత్త విషయాలన్నీ చెప్తున్నావే"

"నాకు మొదట విచిత్రంగానే అనిపించాయి"

"ఎవరు చెప్పారివన్నీ"

"మా కాలేజీలో ఒక లెక్చరర్‌గారున్నారు. ఆయన రెండేళ్ళు సౌదీఅరేబియాలో వుండొ





చ్చారు''

"మగాయనా?"

"ఊఁ"

"ఇలాంటి విషయాలన్నీ ఆయన నీతో మాట్లాడారా?" ఆనంద్ అసూయ, సందేహాలతో కూడిన బుద్ధి తోకాడించసాగింది.

"ఛ ఛ... లేదు. వాళ్ళావిడ చెప్పారు. కాలేజి దగ్గరే వాళ్ళిల్లు. ఒకటి రెండుసార్లు వాళ్ళింటికెళ్ళాను.
ముఖ్యంగా ఈ అరేబియా సంగతులేమిటో కొద్దిగా తెలుసుకువద్దామని''

"నువ్వు నాతో చెప్పనేలేదే?''

"చెప్పలేదు... మీరన్నీ నాతో చెప్తారా? అదీ కాక ఒక కారణం కూడా వుంది.''

"ఏమిటది?''

"ఆవిడది చిన్నవయసు. చాలా అందంగా వుంటుంది. నా కంటే అందమైన మనిషి. మీరు అక్కడికి వెళ్ళి ఆవిడ సౌందర్యపు మోహంలో పడకూడదనిపించింది''

"ఏమిటివాళ వివరీతంగా మాట్లాడుతున్నావేం?''

"ఆరోజు హంసరాజ్ మోహతాగారి భార్యతో మీరు ప్రవర్తించిన తీరు నేనింకా మర్చిపోలేదు''

"పోన్లే... ఆ సంగతొదిలేసెయ్. నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తానో నీకు తెలుసు. కాని, ఐ వర్షిప్ బ్యూటీ. అదే నా బలహీనత. ఐయామ్ ఎట్రాక్టెడ్ బై ఆల్ దిటీస్ బ్యూటిఫుల్. అది స్త్రీ కావచ్చు, పువ్వుకావచ్చు, ఒక సుందర శిల్పం కావచ్చు, ఒక చిత్రం కావచ్చు. నేను నిన్ను నీ సౌందర్యాన్ని ఆరాధిస్తాను''

"ఆ ఆరాధన సంగతి నాకూ తెలుసులెండి'' సుధ చిన్నగా నవ్వి అంది.

"చాలామంది ఇంటలెక్చువల్స్ ఇంతే''

"ఇంటలెక్చువల్స్ అంటే ఎం.కాం., ఎల్లెల్బి, పి.హెచ్.డి. అని అర్థం కదా'' సుధ గట్టిగా నవ్వింది.

ఆనంద్ ఆశ్చర్యంగా!

"ఏమయింది నీకివాళ? పిచ్చిగాని పట్టలేదుకదా? నన్ను అవహేళన చేసే స్టేజీకొచ్చావే!''

"ఛఛ... అదేంలేదు. ఇంటలెక్చువల్స్ అంటే ఎవరు?'' 'దారిలో చీరకొంగు కనిపిస్తే దాని వెనకాలే వెళ్ళేవాళ్ళా' అని అనుమానం వచ్చిందంతే. అయితే ఒక చిన్న సంగతి, ఇంటలెక్చువల్స్‌కిలా అవుతుందన్న సంగతి నాకు తెలీదు. కొంతమంది కళాకారులకవుతుందని వాళ్ళ జీవితచరిత్రలు చదివినప్పుడు తెలుస్తుంది''

"కళాకారులు కూడా ఒకరకంగా ఇంటలెక్చువల్సేగా''

"కావచ్చు. కాని, ఇంటలెక్చువల్స్ అనిపించుకున్న వాళ్ళంతా కళాకారులు కాలేరు. వారిలో కళప్రాణాన్ని పిండి పిప్పిచేసేవాళ్ళు, కళాగ్నిలో తమ ఆహారాన్ని వండుకుతినే వాళ్ళు, కళని మానభంగం చేసేవారు. కళ పుట్టకని ఆదిలోనే తుంచేసేవాళ్ళు — అనేక మంది వుంటారు''

సుధ నిరర్గళంగా వాదించడం చూసి ఒక క్షణం మూగవాడిలా కూర్చుండి పోయాడు ఆనంద్.

ఇంకేమీ చెప్పలేక,

"ఆ సంగతులలా వుంచు. నేను ఇక రెండు వారాల్లో బయల్దేరాలని నిర్ణయించాను. నువ్వు అన్నీ సిద్ధంచేసుకో. నువ్వు కూడా నాతో బయల్దేరాల్సిందే. కావాలంటే ఓసారి వెళ్ళి మీ అమ్మని చూసొద్దాం''

సుధ మౌనంగా వుండిపోయింది.

★ ★ ★

పాస్‌పోర్టులు రెడీ అయ్యాయి. వీసా కూడా వచ్చేసింది. బయల్దేరే రోజు నిర్ణయించుకుని టికెట్ కొనుక్కోవడం ఒకటే బాకీ.

మహేష్ మా కోసం పార్టీ ఏర్పాటుచేశాడు.

మహేష్, శీలా, శైలేష్, పింకూ ఆహ్వానించడానికి వచ్చారు.

"ప్రయాణం ఏర్పాట్లన్నీ అయినట్టేనా?'' అని శీలా అడిగింది.

"ఇంచుమించు అంతా అయినట్టే. సుధ మాత్రం ఇంకా సందిగ్ధంలోనే వుంది''

"ఎందుకు సందిగ్ధం? ఇలాంటి అవకాశాల్ని పోగొట్టుకోకూడదు. విదేశాలకి వెళ్ళి

రావడం అనేది విశేషమైన అనుభవం. యు విల్ ఎంజాయ్ ఇట్" మహేష్ నన్నేచూస్తూ చెప్పాడు.

నేను మౌనంగా వూరుకున్నాను. నాకు సౌది అరేబియా వెళ్ళడం మాట అటుంచి, మహేష్ ఇంటికి పార్టీకి వెళ్ళటమే ఇష్టంలేదు. శైలేష్ పుట్టిన రోజునాడు నాకయిన అనుభవాన్నింకా మర్చిపోలేదు నేను. మళ్ళీ ఆ 'ముఖా'లు జ్ఞాపకం వచ్చి ఒకరకం భయం గుండెల్లో గూడుకట్టుకుంది.

వాళ్ళు వెళ్ళిపోయాక నేను ఆనంద్‌తో అన్నాను.

"ఈ పార్టీకి వెళ్ళటం నాకు బొత్తిగా ఇష్టంలేదు"

"ఛ... అలాగంటే ఎలా? మనకోసమే పార్టీ ఎరేంజ్ చేస్తుంటే, నువ్వు రాకుండా వుండటా నికెలా వీలవుతుంది?"

"నాకు ఇలాంటి పార్టీలు నచ్చవు"

"నువ్వేక పల్లెటూరి గబ్బిలాయివి, బొంబాయిలో పుట్టి పెరిగావంటే ఎవరూ నమ్మరు"

"పల్లెటూరి గబ్బిలాయిగా వుండటమే నా కిష్టం"

"ఎందుకిలా మాట్లాడుతున్నావు?"

"క్రితంసారి జరిగిన బర్త్‌డే పార్టీయే నాకు 'చాలు బాబూ, చాలు' అనిపించిపోయింది".

"ఆ ఫేస్ మాస్కుల గురించా?"

"అదేం కాదు, నాచేత బలవంతంగా ఎందుకు తాగించాలి?"

"ఈసారి తాగద్దులే. డాన్స్ చెయ్యమని గొడవ చేస్తే వూరికే రెండడుగులు వేసి కూర్చో"

"మరి మాస్కులు?"

"అవి బయటికి రాకుండా నేను చూసుకుంటాలే. క్రితంసారి సంగతి వదిలేయ్. అది జాన్సన్, గ్రేసీ ఇచ్చిన ఐడియా. ఈసారి మనమే చీఫ్ గెస్టులం కదా, మన కిష్టంలేనివి ఎవరూ చేయరు" అన్నాడు ఆనంద్.

మనుషులంతా ఒక విధంగా ముఖాలతికించుకునే వ్యవహరిస్తారు. అలాంటప్పుడు ఇంకా రకరకాల ముఖాలు ఎందుకు? అందులోనూ మరీ ఎలుగుబంటి ముఖం, పులిముఖంలాంటివి? కృత్రిమత ఎరుగని, కొత్తముఖాలతికించుకోవడం అలవాటులేని జంతువుల మాదిరి ముఖాలు! దాని బదులు వీళ్ళల్లో వీళ్ళే ఒకరి ముఖాలనొకరు ధరిస్తే! రాకేష్‌ని ఆనంద్ ముఖంతో, ఆనంద్‌ని మహేష్ ముఖంతో, మహేష్‌ని విల్సన్ ముఖంతో.... ఇలా వూహించుకుంటూ పోతే ఫన్నీగా అనిపించింది.

నా ముఖంలో అస్పష్టంగా కనిపించిన చిరునవ్వు చూసి ఆనంద్ అడిగాడు ఆశ్చర్యంగా

"ఎందుకు నవ్వు?"

"ఏం లేదు" అని నవ్వుని అణిచేసుకున్నాను.

"ఏదేవుంది, చెప్పరాదా?"

"మాస్కుల గురించి ఆలోచిస్తున్నాను"

"ఏమిటది?"

"అందరూ ముఖాలు అతికించుకునేవాళ్ళే"

"ఎలా చెప్పగలవు?"

"ఈ కృత్రిమ ముఖాలవల్లనే ఈ సమాజ వ్యవహారాలు అర్థంకాకుండా పోతున్నాయి కదా!"

"సమాజాన్నర్థం చేసుకోవాలంటే మొదట వ్యక్తిని అర్థంచేసుకోవాలి"

"వ్యక్తి కూడా అర్థంకావటంలేదు. ఎందుకంటే అసలు వ్యక్తికంటే ముందు మాస్కే కనిపిస్తోంది" అని నవ్వాను.

"ఎలా?"

"మాటలకి చేష్టలకి అంతరం, సత్యాన్ని దాచేసే అబద్ధాలు, అన్నిటికంటే ముఖ్యంగా ఎక్కడ చూసినా అన్నిటికంటే ఎక్కువగా...."

"ఏమిటి?"

"దాగని అబద్ధాలు, దాచలేని అబద్ధాలు. అంటే తను చెప్పేది అబద్ధమన్న సంగతి వినేవాడికి తెలుసునని చెప్పేవాడికీ తెలిసినా, వినేవాడు వినే నాటకం ఆడితే, చెప్పేవాడు చెప్పే నాటకం ఆడతాడు"

"ఏమిటేమిటి?"! ఒక్కటీ అర్థంకాలేదు. తను చెప్పేది అబద్ధమని.... ఆనంద్ ముఖంలో భయం, కుతూహలం.




నేను నవ్వి మళ్ళీ చెప్పాను.

"తను చెప్తున్నది అబద్ధమన్న సంగతి వినే వాడికి తెలుసునని చెప్పేవాడికి తెలిసినా కూడా, వినేవాడు వినే నాటకం ఆడితే చెప్పేవాడు చెప్పేనాటకం ఆడతాడు"

"నీ మాటలు చాలా ఫిలాసఫికల్‌గా వున్నాయే"

"ఆలోచనల్లో మాత్రమే ఫిలాసఫీ. మాటల్లో లేదు. ఇది కేవలం లాజిక్. అంతే. అంటే మాస్కుల వెనుక వుండే లాజిక్."

ఆనంద్ నవ్వేసి మాట మార్చాడు.

"నీ మాస్క్ ఏమిటి చెప్పు"

"ఇప్పుడు మీరు చూస్తున్నదే"

"అంతే?"

"ఏం చెప్పాలో తెలియటంలేదని" నవ్వేశాను.

"కొంతమంది మాటల్లో ఫిలాసఫీ పుట్టిస్తారు. అలాగే ఇదీను"

"ఇది అలాంటిదేం కాదు. ఒక ఉదాహరణ చెప్పనా?"

"చెప్పు?"

"మీ స్నేహితుడేదో ఫంక్షన్‌కి పిలుస్తాడనుకోండి, మీకు వెళ్ళడం ఇష్టం వుండదు. మీరు వెళ్ళడం మానేస్తారు. తరువాతెప్పుడో కనబడ్డప్పుడు ఆరోజు మీరు రానేలేదు, ఎందుకని? అంటాడతను. 'రావడానికి వీలవలేదు... క్షమించండి. ఆ రోజు మా పక్కింటి పిల్లాడు పడి, గాయంచేసుకున్నాడు. వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాల్సొచ్చింది, చాలా కంగారయింది' అంటారు మీరు. మీరు చెప్పేది అబద్ధమని మీ ఫ్రెండ్‌కి తెలుసు. మీరు చెప్పేది అతను నమ్మడని మీకూ తెలుసు. అయినా మీరు వివరాల్తో సహా చెప్తూనే వుంటారు. పాపం అంటూ అతను నమ్మినట్టే తల ఆడిస్తాడు" అని చిన్నగా నవ్వి, "ఈ ముఖాల ఆట తప్పిస్తే ఈ సమాజంలో మిగిలింది చాలా తక్కువ" అన్నాను.

"ఇందులో ఆశ్చర్యపోవల్సిందేముంది?"

"ఉంది. మీకు, మీ మిత్రుడికి మధ్య స్నేహం అదే పద్ధతిలో కొనసాగుతూ వుంటుంది. మీరు మీరుగా వుండరు, అతను అతనుగా వుండడు. ఇది ఎవరి మధ్య స్నేహసంబంధం? ఇలాంటి సందర్భాలు చాలానే వస్తుంటాయి. ఒకరి నిజమైన ముఖాన్ని ఇంకొకరు చూసుకోరు. ఇదెంత విచిత్రపరిస్థితి"

"నువ్వెందుకు ఇలాంటివాటి గురించి తలకాయ పాడుచేసుకుంటావు?"

"ఎందుకంటే, నేనూ మనిషిని గనుక నేనూ జీవిస్తున్నాను గనుక"

నా మాటల తీక్షణత గమనించి ఇదేదో కొత్తరకంగా అనిపించి అదోవిధమైన కంగారుతో ఆనంద్ నన్నేచూస్తూ కూర్చున్నాడు.

నేను,

"ఒక ప్రశ్న అడగనా?" అన్నాను.

"ఇదేమన్నా నీ క్లాసా?" అని నవ్వి, "సరే. అడుగు" అన్నాడు.

"అసలు ముఖం నుంచి అతుకు ముఖం పుడుతుందా? అతుకు ముఖం నుంచి అసలు ముఖం పుడుతుందా?"

"దేన్నుంచీ ఏదీ పుట్టదు. సందర్భాన్నిబట్టి అసలు ముఖం అతుకుముఖమవుతుంది, అతుకు ముఖం అసలు ముఖంగా మారుతుంది"

"ఏది సత్యం? ఏది మిధ్య?"

"సత్యమనుకుంటే రెండూ సత్యమే, మిథ్యే అనుకుంటే రెండూ మిథ్యే"

"ఏ ఇద్దరిమధ్యయినా అంటే భార్యాభర్తలు అయినా, స్నేహితులయినా ఇద్దరిమధ్య నాలుగు రకాల కాంబినేషన్స్ తయారవుతాయి"

"ఏమిటది?" ఆనంద్ అర్థంకాక అడిగాడు.

"అసలు ముఖం + అసలు ముఖం, అసలు ముఖం + అతుకు ముఖం, అతుకు ముఖం + అసలు ముఖం, అతుకు ముఖం + అతుకు ముఖం" అని పగలబడి నవ్వాను.

ఆనంద్ -వెర్రిమొహంపెట్టుకుని నాకేసే చూస్తున్నాడు.

"ఈ విశ్లేషణ సమాజంలో అన్ని సంబంధాలకీ వర్తిస్తే ఇందులో సహజమైన, నిజమైన సంబంధం మొత్తంమీద ఇరవై ఐదు శాతంమాత్రమే అని తేలింది, ఏమంటారు?"



"సంతింగ్ ఈజ్ రాంగ్ విత్‌యూ" అన్నాడు.

"ఇట్ సీమ్స్" అన్నాను మందహాసంతో.

★ ★ ★

ఇంచుమించు అదే గుంపు. అదే జాతి జనం, సిగరెట్లు, మందు, మాంసం, కబుర్లు, నవ్వులు, పాశ్చాత్య సంగీతం, డాన్స్.

ఈరకం పార్టీలు ఎప్పుడు మొదలయ్యాయి, ఎవరు కనిపెట్టారు అని ఆలోచిస్తూ కూర్చుంది సుధ. ఈమధ్య తమాషా పద్ధతిలో ఆలోచించడం, లోలోపల ఆనందించుకు నవ్వుకోడం అలవాటయిపోయింది సుధకి.

మహేష్, శీలాల బలవంతానికి లొంగి సుధ కూడా ఇష్టంలేకపోయినా ఆనంద్‌తో డాన్స్‌చేసింది. కర్ణీలాగుండే శీలా కాకిలా గెంతుతుంటే అసహ్యంగా అనిపించింది. వేగిన మేక మాంసం వాసన కడుపులో తిప్పేనట్టయింది. వాంతయిపోతుందేమో ననిపించింది. ఎవరెంత బలవంతం చేసినా విస్కీ ముట్టలేదు. తాగితే అనాహుతం తప్పదనుకుంది.

గ్రేస్ చాలా అందంగా డాన్స్‌చేస్తోంది. సప్నా కూడా ఫరవాలేదు. కానీ, అసలీ డాన్స్ ఎక్కణ్ణుంచొచ్చింది, దీని అవసరం ఏమిటి అన్న ఆలోచన ఆమె బుర్రలోంచి పోలేదు. ఇలాంటప్పుడు మాత్రమే ఎందుకు డాన్స్ చేస్తారు? తమ బెడ్‌రూమ్స్‌లో కూడా ఆనందంగా వున్నప్పుడు డాన్స్ చేస్తారా? - అని ప్రశ్నలు.

గబుక్కున వాంతి వచ్చినట్టయింది. ఆనంద్‌ని వదిలేసి బాత్రూంలోకి పరిగెత్తింది.

డాన్స్ ఆగిపోయింది. శీలా కూడా టేప్‌రికార్డర్ సౌండ్‌ని మంద్రానికి దించి బాత్రూం వేపు వెళ్ళింది.

"సుధా... ఏమయింది?" అనడిగింది.

సుధ నుదురొత్తుకుంటూ వాంతిచేస్తోంది. వాంతిచేయడం కాగానే లేచి నుంచుని సింక్‌లో నేరు పుక్కిలించి, ఒక అడుగువేసిందో లేదో కళ్ళు తిరిగాయి. శీలా ఆమెని పట్టుకుని జాగ్రత్తగా పడగ్గదిలోకి తీసుకెళ్ళింది.

"ఆహారంలో ఏదో పడనిదుండి వుంటుంది" అంది సప్నా.

ఏదన్నా ఫుడ్ పాయిజనింగ్ అయ్యుంటుందా? తమకీ ఏమన్నా అవుతుందా? - అని మిగతావాళ్ళూ కంగారుపడ్డారు.

శీలా సుధని తన పరుపుమీద పడుకోపెట్టింది. ఫ్యాన్ వేసింది. ఫ్యాన్ గాలి చల్లగా ముఖానికికొట్టేసరికి హాయిగా అనిపించింది సుధకి.

మహేష్ వచ్చి సుధ కళ్ళు, నాలుక పరీక్షించి స్టెతస్కోపు తేడానికి వెళ్ళాడు.

శీలా పక్కనే నుంచుంది.

మహేష్ టెస్ట్‌చేస్తుంటే శైలేష్ పిలిచాడని శీలా పక్కగదిలోకి వెళ్ళింది. అప్పుడు మహేష్ అడిగాడు -

"ఎన్నో నెల?"

"మూడు" వెంటనే జవాబిచ్చింది సుధ.

"కంగ్రాచ్యులేషన్స్. షల్ ఐ ఎనౌన్స్?" అని అడిగాడు పరీక్షించడం పూర్తిచేసి, నవ్వుతూ.

"ఒద్దొద్దు" అంది.

"ఏం?"

"అవసరంలేదు, తరువాత మెల్లగా తెలుస్తుందిగా" "ఆనంద్‌కి చెప్పనా?"

"ఒద్దు, ఇంటికెళ్ళాక నేనే చెప్తాను" అంది.

"సరే" అని మహేష్ వెళ్ళిపోయాడు.

"కొద్దిగా అజీర్ణం, అంతే. షి ఈజ్ పెర్ఫెక్ట్‌లీ ఆల్‌రైట్" అని చెప్పడం సుధకి వినిపించింది.

తరువాత డాన్స్ కొనసాగలేదు. కొంచెంసేపటికి కాసెట్ పూర్తయి, టేప్‌రికార్డర్ నిశ్శబ్దమైంది.

శీలా వచ్చి సుధకి రెండు మాత్రలిచ్చింది.

వచ్చినవాళ్ళంతా బయల్దేరడానికి సిద్ధపడ్డారు. అందరూ వచ్చి సుధని చూసి ఆనంద్‌కి, సుధకి సుఖప్రయాణం జరగాలని కోరారు. విదేశవాసం సుఖదాయకం కావాలన్నారు. రిటర్న్ రిచ్ - అని ఆశించారు.

వాళ్ళంతా వెళ్ళాక ఆనంద్...

"ఎలా వున్నావ్ సుధా వెళ్దామా?" అనడిగాడు...

సుధ లేచి కూర్చుంది.

"తల ఇంకా తిరుగుతోందా?" శీలా అడిగింది.

"లేదు" అని లేచింది సుధ.

ఆనంద్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. చాలా చల్లగా వుందది.

దగ్గిరే కదా అని నడిచే వచ్చారు వాళ్ళు.

"నడిచి వెళ్ళడం కష్టంకావచ్చు ఐవిల్ డ్రాప్ యు" అన్నాడు మహేష్.

"ఏంవద్దు... నేను బాగానే వున్నాను" అంది సుధ.

ఆమె మాట పట్టించుకోకుండా మహేష్ కారు స్టార్ట్ చేశాడు.

ఆనంద్, సుధ ఎక్కికూర్చున్నారు.

కారు వెళ్తుంటే మహేష్ అన్నాడు-
"రాకేష్ రానేలేదు"

"అతను అనూయతో చస్తున్నాడు" అన్నాడు ఆనంద్.

"ఐ.ఎ.ఎస్ సెలక్షనయిందట కదా!"

"అవునా? ఎవరు చెప్పారు?"

"నిన్ననెవరో అన్నారబ్బా"

"వాడే బ్లఫ్ చేసుంటాడు"

ఆనంద్, సుధ ఇంట్లోకి వెళ్ళేవరకు వాళ్ళనే చూస్తున్న మహేష్ చిన్నగా నవ్వుకుని కార్ని పోనిచ్చాడు. వాళ్ళిద్దరూ చెయ్యి వూపారు. అతనూ చెయ్యూపి, గట్టిగా గుడ్‌నైట్ అని అరిచాడు.

ఇంట్లో అడుగుపెట్టగానే సుధ తిన్నగా గదిలోకి వెళ్ళి మంచంమీద వాలింది.

ఆనంద్ వెళ్ళి ఆమె పక్కన కూర్చుని

"ఏమవుతోంది?" అని మృదువుగా అడిగాడు.

"ఏంలేదు... కొద్దిగా నీరసం అంతే" అంది.

* * *

రాకేష్ నాతో మొదటిలాగే అన్యోన్యంగా వున్నా ఇంటికి రావడం మానేశాడు. కాలేజీలో అప్పుడప్పుడు దొరుకుతాడంతే. ఆనంద్ రాకేష్ ఒకర్నొకరు చూసుకొని, మాట్లాడుకుని రెండూ రెండున్నర నెలలు దాటి వుంటుంది.

ఒకసారి మాత్రం ఆనంద్ అడిగాడు,

"ఏమిటీమధ్య ఇటువేపు రాకేష్ దర్శనం కావడంలేదు?"

అతన్ని చూస్తే మీకంత కడుపుమంటగా వుంటే, అతనెందుకొస్తాడు అంది నా మనసు. నేను మాత్రం జవాబివ్వలేదు.

పార్టీ జరిగిన మర్నాడు, డిపార్ట్‌మెంట్‌లో నేను ఒక్కదాన్నే వున్నపుడు రాకేష్ వచ్చాడు.

"ఐ.ఎ.ఎస్ రిజల్ట్స్ వచ్చాయి" అన్నాడు నిర్వికారంగా.

"ఏమయింది?" అనడిగాను కుతూహలంగా.

"సెలెక్షన్ దొరికింది" చిన్నగా నవ్వి అన్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్"

"థ్యాంక్స్"

"ఎప్పుడెళ్ళాలి?"

"ఈ వారంలోనే"

"ఎక్కడికి?"

"ముందు మా వూరెళ్తాను"

"చాలా సంతోషం. మమ్మల్నందర్నీ మర్చిపోవుకదా? ఐ మీన్ నన్ను మర్చిపోవుగా?"

"మర్చిపోను, కాని గుర్తున్నానని మీకెలా తెలుస్తుంది?"

"ఉత్తరం రాయండి" కావాలనే బహువచనం వాడాను.

"రాయచ్చా?" సందేహంగా అడిగాడు.

"ధైర్యంగా రాయండి" అన్నాను చిరునవ్వుతో.

కొంచెం ఆగి అడిగాడు,

"ఎక్కడికని రాయను? మీరు త్వరలో అరేబియా వెళ్ళిపోతారు కదా?"

"వెళ్తే కద? వెళ్తే అక్కడ్నుంచి నేనే రాస్తాను. కాని నేను వెళ్ళను"

"వెళ్ళకుండా వుండడానికి కుదురుతుందా?"

"ఎందుకు కుదరదు?"

"ఆనంద్ ఒప్పుకుంటారా?"

నేను మౌనంగా వున్నాను.





కొంచెం సేపయ్యాక నేనే మాట్లాడాను.

"మీ వివాహం సంగతేమిటి?"

"ప్రొబేషన్ పూర్తి కాగానే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాను"

"చాలా సంతోషం- మీ వైవాహిక జీవితం సుఖప్రదం కావాలి"

ఒక నిమిషం ఆగి రాకేష్ అన్నాడు-

"మీరు చాలా మంచివారు"

"ఆడదాని గురించి ఇలాంటి మాటలు చాలామంది చెప్తారు" అన్నాను నవ్వుతూ.

"ఇది వుట్టి పొగడ్తకాదు"

"మీరు నాకంటే మంచివారు"

చాలాసేపు రాకేష్ మౌనంగా వున్నాడు. తరువాత,

"నేను ఆనంద్‌ని చూడాలి" అన్నాడు.

"ఎందుకు?"

"విషయం తెలియబరచడానికి, ఈ వారంలో వూరికి వెళ్ళిపోతాను కదా, ఇవాళ, రేపట్లో రానా?"

"ఒక పని చెయ్యండి. ఇంటికి రాకండి. బ్యాంక్‌కే వెళ్ళండి. 'ఇక్కడే ఏదో పనిమీద వచ్చాను. మిమ్మల్ని చూసి వెళ్దామనిపించింది' అని చెప్పి ఈ కబురూ చెప్పండి" అన్నాను.

"సరే"

నేను రాకేష్ వూరు వెళ్ళిపోయాక, మర్నాడు ఆనంద్‌తో రాకేష్ విషయం మాట్లాడాను.

"రాకేష్ ఐ.ఏ.ఎస్‌కి సెలక్షనయిన సంగతి మీకు తెలుసుకదా? అతను నిన్న వెళ్ళిపోయాడు"

"ఊఁ, తెలుసు. ఒకరోజు బ్యాంకుకొచ్చి చెప్పాడు"

అంతవరకు ఆనంద్ ఆ విషయాన్ని నాతో చెప్పకపోడానికి మత్సరం తప్ప మరేమీ కారణం కాదన్న సంగతి స్పష్టంగా తెలుస్తోంది. అదొక పెద్ద చెప్పదగ్గ విషయం కాదన్నట్టుగా వుంది అతని ముఖభావం.

తను ఐ.ఏ.ఎస్‌లో ఫెయిలయిన సంగతి గురించి అతనొకసారి అన్నాడు. అదే మొదటి

సారి తను విన్నది-

"సెలక్షన్ కాకపోడమే మంచిదయింది. సర్కారు చేతికింద బానిసలా బతుకుతూ, ఎవరెవరో రాజకీయ పుండాకోర్లందరి చేతుల్లో చిక్కి, మొయ్యలేనన్ని బాధ్యతలు నెత్తికెత్తుకుని, నావల్లకాదు బాబోయ్ అని బాధపడే దుస్థితి తప్పింది". అని తరువాత బ్యాంకు ఉద్యోగం దొరకగానే -

"ఐ.ఎ.యస్ అధికారికి వచ్చేటంత జీతమూ నాకు ఇప్పుడొస్తోంది. ఈ ఉద్యోగంలో వున్నంత స్వేచ్ఛ ఇంకెందులోనూ వుండదు"

సెక్షన్ హెడ్‌గా వేసినప్పుడు కూడా గర్వంతో విర్రవీగుతూ -

"ఇప్పుడు నేనే మా సెక్షన్ చీఫ్. ఇప్పుడు నా జీతం ఐ.ఎ.యస్ ఆఫీసర్ కొచ్చే జీతంకంటే ఎంతో ఎక్కువ" అన్నారు.

అది విని మహేష్ కూడా తన వాచాలత్వాన్ని ప్రదర్శించాడు.

"వెల్‌కం టుది హై ఇన్‌కం బ్రాకెట్"

ఆ తరువాత ఇద్దరూ తమ తమ గొప్పదనాల గురించి, తెలివి గురించీ, యోగ్యతల గురించీ డబ్బాకొట్టుకున్నారు.

ఇద్దరు డంభాలరాయుళ్ళ కబుర్లని వినలేక పారిపోదామనిపించింది.

పెళ్ళయిన తరువాత, పెళ్ళి అయిందన్న కారణంవల్ల తన స్వంత వ్యక్తిత్వాన్ని మిగుల్చుకోలేని ఆడదాని స్థితికి, అంటే నా స్థితికి నాకే జాలికలిగింది. తనకి మనసా, వాచా, కర్మణా అనుకూలుడయిన భర్త దొరకడంకంటే ఎక్కువ భాగ్యం స్త్రీకింకేమీ లేదా? అనే ప్రశ్న తలెత్తింది. అంతేగనుకయితే పెళ్ళి కాకుండా వుండిపోడమే సుఖమనిపించింది.

పెళ్ళిఅనే దానిలో వుండే గొప్ప సమస్య ఏమిటంటే, భర్త యొక్క నిజమైన గుణధర్మాలు అర్థంకావడం అన్నది. అంతకుముందు ఎంత సన్నిహితంగా మెలిగినప్పటికీ పెళ్ళయి అతనితో శయనించాకనే జరుగుతుంది.

మగవాడి సంగతేమిటో నాకు తెలియదు. నేను ఆడదాన్ని మరి.



ఒకరోజు మధ్యాహ్నం భోజనం అయ్యాక ఆనంద్ అన్నాడు,

"మే, పంతొమ్మిదో తారీకున ప్రయాణం. ఇంక తొమ్మిదిరోజులుంది. కారుకి బేరం వచ్చింది. ఈ వారంలో టిక్కెట్లు కొనాలి. బయల్దేరే ఏర్పాట్లుచేసుకోవాలి. కొద్దిగా డ్రెసెస్, మంచి సూట్‌కేసొకటి, ఒక జత మాస్ కొనుక్కోవాలి"

నేను మాట్లాడలేదు.

"ఇవాళ రాత్రి లాశాంగ్రిలాకి భోజనానికి వెళ్దాం. ఆదివారం కదా, కొంచెం త్వరగా వెళ్ళాలి. లేకపోతే చాలామంది జనం వచ్చేస్తారు. ఎల్లుండి శనివారంనాడు అక్కడే ఒక చిన్న పార్టీపెట్టుకుందాం. మహేష్, శీలా, మరో నలుగురైదుగుర్ని పిలిస్తే చాలు".

అప్పుడూ మాట్లాడలేదు.

'లా శాంగ్రిలా' పేరు వినగానే నామనసులోని భావాన్ని నేను బయటకి కనబడనివ్వలేదు. ఇప్పుడిప్పుడు నా స్వంత ఆలోచనలకి, వూహలకి నా మనసు చాలా ఉత్తేజం పొందుతోంది. కొన్నిసార్లు అటువంటి ఆలోచనలు రావడం అసంగతమూ, హాస్యాస్పదమూ అయినాసరే నాకవి ఆనందాన్నిచ్చేవి. అయితే వాటికి ఏకాంతం కావాల్సిన అవసరం వుండేది. ఈ ఆనంద్ నా ఏకాంతానికి అప్పుడప్పుడు భంగం కలిగించేవాడు.

"ఏమిటి... ఏమీ మాట్లాడవేం?" ఆనంద్ విసుగ్గా అన్నాడు.

నాకూ కోపం వచ్చింది. అయినా కోపం చూపించడానికి అది సరియైన సందర్భంలా





కనిపించలేదు. ఒకసారి అతను తనని పడుకున్నప్పుడు వచ్చి గొంతు పిసికిన సన్నివేశాన్ని తల్చుకుని భయం వేసింది.

"నేనింకా ఏమీ ఆలోచించలేదు" అన్నాను.

"ఏం ఆలోచించలేదు?"

"మీతో వచ్చే విషయం గురించి."

"నువ్వు వస్తున్నావా లేదా అని ఎవరడిగారు?"

"అంటే?"

"అంటే ఇంతే, ఇదివరకే చెప్పానుగా నువ్వు నాతో బయల్దేరాల్సిందే".

"నాకు అదేశం రావడం ఇష్టం లేదని నేనూ చెప్పాను"

"మరే దేశానికి వెళ్ళడం ఇష్టం నీకు?" వ్యంగ్యంగా అడిగాడు.

"ఏదేశానికి వెళ్ళడమూ ఇష్టం లేదు. ఈ దేశమే నాకు అన్నిదేశాలకంటే బాగుంటుంది. ఇక్కడుండటమే నాకు ఇష్టం. ఇక్కడ మనకున్న సౌకర్యాలు, సుఖం కావాల్సినంత వున్నాయి. ఇవి చాలని నా అభిప్రాయం".

"నువ్వు నూతిలో కప్పవి" కోపంగా అన్నారు.

నేను మాట్లాడలేదు.

అతనే అన్నాడు,

"నిన్నొక్కదాన్నే వదిలిపెట్టి నేను వెళ్ళాలన్నది నీ అభిప్రాయమా?"

"మా అమ్మని పిలిపించుకుంటాను"

"మీ అమ్మని పోషించడం కోసం నేను నిన్ను పెళ్ళాడలేదు. నేనున్నచోట నువ్వుండాలంతే".

ఈ మాట విని నాకు క్రోధం పొంగింది. అయినా అణచుకున్నాను. ఆనంద్‌కి బ్యాంకులో ఉద్యోగం ఇప్పించినది నా తండ్రి. నాన్న పోయాక అమ్మకి డబ్బు పంపిస్తానన్నందుకు, పట్టుపట్టినందుకు నా గొంతు నులిమాడు. ఎవరెవరి అండకిందో బతుకుతున్న అమ్మని చూడ్డానికి ఆనంద్‌ని వేడుకోవాలి, పీడించాలి. అదీ అంత దగ్గర్లేవున్నా సంవత్సరానికి ఒకసారో, రెండుసార్లో అంతే. నన్ను ఒక్కతినే వెళ్ళనివ్వడు. ఇక్కడికొచ్చివుండు అంటే అభిమానురాలైన అమ్మ ఒప్పుకోదు. అది ఆనంద్‌కి తెలిసిన సంగతే. ఇప్పుడతను వెళ్ళిపోయాక అమ్మని రమ్మంటే రావచ్చు. కాని నేను కష్టపడి సంపాదించే డబ్బు మా అమ్మని పోషించడంలో ఖర్చయిపోకూడదు. అది బ్యాంకులో జమ అవుతూవుండాలి. వేలూ, లక్షలూ అవ్వాలి. ఇది ఆనంద్ మహత్వాకాంక్ష. 'ఎందుకు?' అనే ప్రశ్నని అతడు వేసుకోడు. నేను అడిగినా నా ప్రశ్న అతనికి వినిపించదు. ఒక్కసారిగా లక్షలు సంపాదించే అవకాశం. దాన్ని వదిలి పెట్టడం ఆనంద్‌కి ఇష్టంలేదు. సిద్ధంగానూ లేడు. అరేబియాలో నేనూ ఉద్యోగం చేస్తే కోటీశ్వరులై రావచ్చనే ఆశ, పేరాశ. అవును... అతనన్నట్టుగా నేను బావిలో కప్పనే. అలావుంటే తప్పేమిటి? నాకు పేరాశ లేదు. చల్లగా బతకాలనే కోరికుంది. అది బతికే ప్రతి ప్రాణీ కోరుకునే సహజమైన కోరిక. అంతేగాని నేను కట్టుకున్న గాలిగోపురాల్లాంటి కోరికలేమీలేవు.

ఆనంద్ ఇప్పుడు 'పెళ్ళి చేసుకున్నదెందుకు?' అనే గొప్ప ప్రశ్నని ఎత్తాడు. నేనూ అదే ప్రశ్నని అడగచ్చు. చాలా సంగతుల్ని తుడిచిపారేసినట్టుగా ఈ పెళ్ళి అనే దాన్ని తుడిచి పారెయ్యడానికి లేదా? 'పెళ్ళి అవడం' అనేదాన్లో 'అయ్యేది' ఏమిటి? ఇవన్నీ నాలో రేగే ప్రశ్నలు.

నేను మాట్లాడకుండా కూర్చున్నాను. ఇదే నా దగ్గరున్న బలమైన అస్త్రం. నానుంచి ప్రతిక్రియ రాకపోతే ఆనంద్‌కి కంగారుగా వుంటుంది. నిస్సహాయుడవుతాడు. లోలోపల అసహనంతో వుడికిపోతాడు.

"నువ్వు నా భార్యవి, నేను రమ్మన్నచోటికి నువ్వు వచ్చితీరాలి" అని అధికార స్వరంతో పలికాడు.

ఎందుకు? అరేబియాలో తన అందమైన భార్యని ప్రదర్శించాలనా? నేను నీకు 'భార్య'ని మాత్రమే కాకుండా ఇంకా ఏమన్నా అవుతానా?

నాకంటే అందగత్తెలక్కడెంతమందో వుంటారు, ప్రదర్శనకోసం నువ్వు నన్నక్కడికి తీసుకెళ్ళక్కర్లేదు అని అనాలనిపించింది. ఎవడన్నా 'షేక్ నీ భార్య సౌందర్యం చూసి,





అడగాలనిపించింది.

ఏం మాట్లాడకుండా వూరికే వున్నాను.

అతని అధికార స్వరానికి తలవంచానని అతను అనుకుంటే అనుకుని వుండచ్చు.

కొంచెం సేపు వూరుకుని,

"నువ్విప్పుడే రిజిగ్నేషన్ ఇవ్వక్కర్లేదు. రెండునెలలు సెలవు అడిగితే చాలు" అని కొంచెం ఆగి, "నువ్వే వెళ్ళి అప్లికేషన్ ఇవ్వాలనేం లేదు. రాసిచ్చెయ్, నేను ప్రిన్సిపాల్‌తో మాట్లాడి, ఇచ్చేసివస్తాను. నీకూ రావాలనుంటే నువ్వూరా- రేప్పొద్దున్నే వెళ్దాం" అన్నాడు.

నన్ను పలుకరించకుండా అతనూరుకోడు అనే సంగతి స్పష్టమయిపోయింది.

చివరికి నిర్ణయం చెప్పాల్సిన ఘడియ ముందు నిలబడి వుంది. ఇక ఎదురించక తప్పదు.

లేదు, ఈరాత్రి లాశాంగ్రిలా భోజనం అయ్యే

వెంకా అతను ఆగడు.. ఆగనివ్వడు.

"నేను ఇప్పుడే మీతో బయల్దేరలేను" నేను దృఢస్వరంతో చెప్పాను.

"అంటే... మరింకెప్పుడు?" చకితుడై అడిగాడు.

"నేను వచ్చితీరాలంటే మీరు ఏడెనిమిది నెలలు ఆగవలసిందే, లేదంటే మీరు ఇప్పుడు వెళ్ళండి. నేను మీకు కావాలంటే తెలియబరచండి. నేను ఆ తరువాత వస్తాను" నిర్వికారంగా చెప్పాను.

"ఏమిటి నాన్సెన్స్... నీ మాటలు నాకేమీ అర్థంకావడంలేదు"

"నాకు మూడవనెల" ఉద్వేగాన్ని అణచుకొంటూ అన్నా స్వరం కంపిస్తూనే వుంది.

"ఏమిటీ?" ఆనంద్ మహా ఆశ్చర్యంగా



అడిగాడు.

నేను మాట్లాడలేదు.

"ఏమిటి? నువ్వు చెప్పింది నిజమా?" అత ను ఒక అడుగు ముందుకి వేసి, వికారస్వ రంతో అడిగాడు.

నాకు వున్నట్టుండి అంతా విచిత్రంగా కని పించడం మొదలెట్టింది. ఆనంద్ ముఖం చాలా వికారంగా కనిపించింది. ఆరోజు రాత్రి మహేష్ ఇంట్లో నామీదవద్ద ఎలుగుబంటి ముఖం గుర్తొచ్చింది. ఒక్కక్షణం అదోరకం భయం. మరుక్షణం ఆదేదో ధైర్యం. నా తల్లిని చూడ్డానికి నాకు హక్కు లేకపోతే, నా బిడ్డని చూడ్డానికి కూడా హక్కులేదా?

అతనిచేతులు నా గొంతు దగ్గరికి వస్తున్న ట్టు కనిపించింది. ఇంకేముంది, నా గొంతు పిసికి నన్ను చంపేస్తాడనే అనిపించింది. ఆశ్చర్యం కలుగలేదు. భయం వెయ్యలేదు. అయితే నాచావు లేదా, అతని చావు. ఆ క్షణం వచ్చేసింది.

నేను ఒకడుగు ముందుకి వేశాను.

అయ్యేదేదో ఈ క్షణంలో అయిపోవాలి. ఇంక తట్టుకోడం సాధ్యంకాదు. ఇక ఆగడం కుదరదు.

ఆనంద్ నుంచున్నచోట వున్నాడు. కదల కుండా అలాగే నుంచున్నాడు. ప్రాణం లేనట్టు నుంచున్నాడు. ప్రాణం పోయిందా?

నేను లోపలికెళ్ళి వరుపుమీద వాలిపోయా ను.

బయట నిశ్శబ్దం.

అరగంట తరువాత లేచొచ్చాను.

బయట ఆనంద్ లేడు, కారూ లేదు.

చాలా సంతోషంగా అనిపించింది. నేను లోపలకివెళ్ళి నా బట్టలన్నీ ఒక సూట్‌కేసులో సర్దుకున్నాను.

చేతిలోకి తీసుకుంటే చాలా తేలిగ్గా అని పించింది. నాదేహం కూడా చాలా తేలిగ్గా వుంది.

నా మనసు లోతుల్లో ఒకటేమాట.

"అమ్మా... నేను తల్లిని కాబోతున్నాను!" ★





# ఉపసంహారం

## (ఈ నవల గురించిన కొన్ని ప్రశ్నలకు సమాధానం)

సుధ అలా చేయడం బాగోలేదు. 'భారతీయ నారి'కి అది తగనిపని. ఆమె రాకేష్‌ని మెచ్చు కోవచ్చు. ఆరాధించవచ్చు. కాని దైహిక సంప ర్కం తప్పు. ఆమె ఆ విధంగా చేయడానికి భర్తమీదున్న ద్వేషంగాని, ఈర్ష్యగాని కారణంకా దు. ఎందుకంటే-

1. ఆమె లైంగిక జీవితంలో అసంతృప్తిగా వున్నట్టు కనిపించదు.

2. ఆమె ఆనంద్‌ని తాను స్వయంగా చంపకుండా చచ్చేటట్టు చేయాలని తీర్మా నించుకుని అతని చేష్టలపట్ల నిర్లిప్తభావనని పెంచుకుని వుంటుంది. సుధ ఒక భారతీయ స్త్రీకావడంవల్ల ఆమె సంసారానికి, ఆమె రక్తంలో ప్రవహించే నైతికధర్మానికి ఆమె ఈ ప్రవర్తన విరుద్ధంగా వుంటుంది. మరి ఆమె ఇలా ప్రవర్తించడం సరిఅయిన పనేనా?

ఇంకో ప్రశ్న: సుధ, రాకేష్‌లమధ్య ప్రేమ-అ నురాగం పెంపొంది వాళ్ళు మెల్లమెల్లగా సన్నిహితమై ఈ సంబంధాన్నిపెట్టుకున్నట్ల యితే బాగుండేది. కాని సుధ రాకేష్‌ని ఏకంగా స్వంతంచేసుకోడం ఎలా సమర్ధనీయం?

ఈ ప్రశ్నలే ఈ వివరణకి ప్రేరణ:

అవును..; సుధ రాకేష్‌ని కౌగిలించుకోడానికి కామం కారణంకాదు. ప్రేమకూడా కారణంకా దు. నిర్లిప్తతని వ్యక్తంచేస్తూ, జడత్వాన్ని అలవా టుచేసుకుంటూ ఆనంద్‌ని పడగొట్టడం సాధ్యంకాదని ఆమెకి క్రమంగా అర్థమయింది. ఈ విధానంలో అరిగిపోయేది, తరిగిపోయేదీ తన వ్యక్తిత్వమేనన్న సంగతికూడా ఆమెకి అవగాహనవుతుంది. ఆదర్శవత్నిలా వుంటూ ప్రతిఘటించినా అది వ్యర్థమేనని ఆమెకి తెలుసు. అదికూడా ఒకవిధమైన ఆత్మవధ అవుతుంది. భర్త వ్యక్తిత్వపు మరొక ముఖం ఆమెకి స్పష్టంగా, సంపూర్ణంగా కనిపించకపో

యినప్పటికీ ఆమె అంతరంగంలో మౌనంగా జరుగుతున్న అతడి వ్యక్తిత్వవిశ్లేషణలో ఆమెకి అతడి వ్యక్తిత్వపు కొలతలన్నీ సుస్పష్టమవుతూ వస్తాయి. ఇటువంటి విశ్లేషణని ఎంతమందో స్త్రీలు చేసుండవచ్చు; చేస్తూనూ వుండవచ్చు. కాని వారుదాన్నంతా మౌనంగా సహిస్తూ, కళ్ళూ, నోరు మూసుకుని పడుంటారు. ఇది కూడా 'భారతీయ స్త్రీ విధి' లేదా 'విధిలిఖితం' అనుకుంటే ఆశ్చర్యంలేదు. ప్రత్యేక సందర్భాలలో ప్రతిఘటన విచ్ఛేదనకి చేరుకోవచ్చు. విచ్ఛేదనకూడా అన్ని సందర్భాలలోనూ సవ్యమయిన పరిష్కారం కాజాలదు. అంతేకాక భారతీయ సమాజంలో విచ్ఛేదనకూడా ఒక విధమైన అసహ్యాకరమైన బంధనంగా మిగిలి పోడమే ఎక్కువగా జరుగుతూంటుంది. ఈ నరకం కంటే ఆ నరరాక్షసుడి పంచనుండటమే మేలు అని భారతీయ నారి నిర్ణయించుకోడమూ జరుగుతుంటుంది. విచ్ఛేదన ఒక సహజమైన పరిష్కారం కావాలంటే 'భారతస్త్రీ' అనే ఆదర్శపు రంగుటద్దాలని తొలగించి స్త్రీని వీక్షించాలి. ఆమెవంక ఒక వ్యక్తి- ఒక జీవి అనే సూటి దృష్టితో చూడాలి, మనిషిని మనిషిగా గుర్తించాలి. ఆ తరువాతే భారతీయుడా, ఆంగ్లేయుడా, అమెరికనా అనే సంగతి.

సుధ రాకేష్‌ని ఆహ్వానించడానికి కారణం ఆనంద్ మీదున్న ద్వేషంకాదు. ద్వేషభావాన్ని కూడా ఆమె క్రమంగా జయించింది. ఆనంద్‌ని చంపాలి అనే భావం కూడా పరివర్తనచెంది జయించాలి అనేభావంగా మారి, తను నిలదొక్కుకోవాలి, తను నాశనం కాకూడదు, తన అస్తిత్వాన్ని తను తెలుసుకోవాలి, నిలబెట్టుకోవాలి- అనే వాంఛ ప్రబలం కాసాగింది.

కామతృప్తి అనేది స్త్రీకి లేదా పురుషుడికి ఏదో పుస్తకంలో చదివినట్టో, తామే నిర్ణయించుకున్నట్టో- వారానికేడుసార్లో లేదా నెలకి ఏడుసార్లో లైంగికక్రియ జరపడంలో దొరికేదికాదు. ఆ తృప్తి దొరకడంలో దేహంయొక్క పాత్రకంటే మనసుయొక్క పాత్ర ముఖ్యమైనది. ప్రణయంలో దైహికవ్యవహారంలో ఏ తక్కువతనం లేకపోయినప్పటికీ మగవాడు తన భార్యతో తృప్తినిపొందలేక వేశ్యల దగ్గరకో, పరస్త్రీలదగ్గరకో పోవడం, వివాహిత స్త్రీ పరపురుషుడి పొందుని ఆశించడం జరుగుతుంది. దీనికి కారణం మానసికమైన అసంతృప్తి. ఈ విధంగా చేసే పురుషుల సంఖ్య ఎక్కువగానూ, స్త్రీల సంఖ్య తక్కువగానూ వుండటానికి కారణం- సామాజికమైన నిర్బంధాలు, మరియు పురుషుడి భయం. ఇది నిన్న-మొన్నటి సంగతికాదుగాబట్టి ఆ భయము-నిర్బంధాలే సంస్కారంగా, ధర్మంగా రూపొంది అలవాటైపోయాయి. చాలా సందర్భాలలో ఈ ధర్మమన్నది కేవలం కావలా మాత్రమే.

కామం అన్నది జీవితంలో ఒక భాగం. అది వికారం కాదు. అది జీవక్రియ. అది సుందరమైనది. అందులో ప్రాణానికి ఆనందం వున్నది. శాంతి వున్నది. అది చైతన్యవంతమై చైతన్యప్రేరకమై మనసుని వికసింపజేస్తుంది. అది ఆరోగ్యవంతమైన మనసుకి, దేహానికి కావలసిన క్రియ. కామం అనేది వికారం అని ఎప్పుడనిపించుకుంటుందంటే అది తృప్తిని వెంటాడి వేళ్ళాడినప్పుడు. అప్పుడు దానికి అనురాగం ఛాయ వున్నప్పటికీ లేకపోయినప్పటికీ అది వికారమే. సుధ అసంతృప్తి చెందిన స్త్రీ నిజమే, కాని ఆమె ఆ తృప్తి కోసం వెంటాడి వేళ్ళాడలేదు. కామ తృప్తికోసం రాకేష్ వెంటపడలేదు. కామ తృప్తికోసం వల విసరలేదు. అసంతృప్తి ఆమెని మోహపరవశంలో ముంచెత్తలేదు. కామోద్రిక్తురాలిని చెయ్యలేదు. చాలా మంది స్త్రీలకి సంభవించే ఇది ఆమె విషయంలో సంభవించలేదు. తను అసంతృప్తురాలినని ఆమెకి తెలుసు. ఈ సందర్భంలో ఆమెని స్త్రీగా గుర్తించడం కంటే మనిషిగా గుర్తించడం అవసరం. మనిషంటే ఏమిటి? వ్యక్తి. వ్యక్తి అంటే?... అతడి మనసు!

ఆనంద్ ఎందుకలా? అతడి వ్యక్తిత్వమే అంత! లోపల్లోపల అతను దుర్బలుడు. కాని బయటికి అతడు 'మగవాడు'. అతన్ని స్వాధీనంలో పెట్టుకోవాలంటే అతనికంటే ఎక్కువ బలశాలి అయ్యుండి, మగతనం కలిగి వున్న ఒక ఆడదాని వల్ల మాత్రం సాధ్యమవుతుందేమో! సుధ అతడిని ఆ విధంగా తన వశంలో వుంచుకోలేకపోయింది. ఎందుకంటే ఆమె ఆడతనం వున్న నాజూకయిన వనిత. మగతనం వున్న మగవాళ్ళున్నట్టుగానే

ఆడంగి మగవాళ్ళు, మగరాయుళ్ళలాంటి ఆడవాళ్ళు కూడా వుంటారు. ఆ సంగతి భూమ్మీద అందరికీ తెలిసిందే. అచ్చమయిన ఆడది - సిసలయిన మగవాడు చక్కటి జోడీ అయినట్లుగానే ఆడంగి మగవాడు - మగ తనం వున్న ఆడది కూడా ఒక విధంగా సానుకూలమయిన జోడీ అన్నదీ పరమార్థవిష యమే.

అలాగయితే ఆనంద్ సంగతేమిటి? అతని వ్యక్తిత్వాన్ని స్పృశించి చూస్తే అతను ఆడా కాదు - మగా కాదు, అలాగని అతడు నపుంస కుడూ కాదు. లైంగికంగా అతను సమర్థుడు. అతను అనేకమంది ఆడవాళ్ళని భోగించాడు. అంతేకాదు, వాళ్ళని తృప్తిపరిచాడు కూడా. పరస్త్రీలకి, వేశ్యలకి అతను సమర్థుడయిన మగవాడు. ఎందుకంటే అక్కడ మనసు ప్ర మేయం లేదు. సుధకి తెలియకుండా జము నతో సంపర్కంపెట్టుకున్న గొప్పవాడతడు. జమునకయినా లైంగికక్రియ ఒక తమాషా ఆట. దానికి ఆమె ఏమంత ప్రాధాన్యతనివ్వ దు. ఆనంద్ ఆమెకొక ఆటబొమ్మ. కాని ఆశపో తు ఆనంద్‌కి ఆ ఆటకూడా కావాలి. నువ్వు నీకోరికలకి దాసుడివి అని ఆమె అతడికి స్పష్టంగా అర్థమయ్యేలా నడుచుకున్నా సిగ్గు మాలిన ఆనంద్ ఆమె ఇక తన చేతికి అంద దు అని తెలిశాక ఏదో పోగొట్టుకున్నవాడిలా పరితపిస్తాడు. అతనిలో అసంతృప్తి పడగ విప్పుతూనే వుంటుంది. అది అతని ఉనికిని అంటుకున్న వేదన. అతడు 'గొడ్డు' అయి వుండడటవల్ల అతన్ని అపరాధి అనలేము, అనకూడదు. ఇక్కడ లెక్కలోకి తీసుకోవల్సింది అతని వ్యక్తిత్వం మాత్రమే. అటువంటి వ్యక్తి త్వం ఒక పరిపూర్ణ స్త్రీ యొక్క విధేయతకి అర్థమైనదేనా? ఆమె భారతీయురాలైనా సరే... విదేశీయురాలైనా సరే. అర్థమైనదేనా?

'ఆదర్శభారతనారి' అనే పట్టం వెనుక, అడుగున ఎన్ని అగ్నిగుండాలున్నాయో; పతి వ్రతా శిరోమణి అనే కిరీటం అడుగున ఎన్ని అగ్నిపర్వతాలు దాగి వున్నాయో- ఇవన్నీ మగ వాడు నిర్మించిన వంచకపదాలు. ఇంకా ఆ పదాలు ధరించి ఆడది విజృంభిస్తుందే. అందు కే 'ఆదర్శ భారతీయ పురుషుడు', 'పత్నీవ్రత శిరోమణి' అనే పదాలకోసం మగవాడు వెంపర్లా డడు. రాముడు ఏకపత్నీవ్రతుడు కావచ్చు. అలాంటివాళ్ళు ఈ భూమ్మీద కోట్లకొలదీ వున్నా రు. అతనికంటే ఉత్తములయిన, పత్నీవ్రతుల యిన పురుషులెంతమందో వున్నారు. భార్యని రాముడిలా హింసించని పురుషులెందరో వున్నారు. రాముడు అంత గొప్పవాడని అనుకో నక్కర్లేదు.

ఒక ప్రశ్న: ఆనంద్‌వల్ల ఆమెకి కామతృప్తి దొరకలేదా?

దీనికి జవాబు సులభం కాదు. ఈ దేహం అనేది ఒక అద్భుతసృష్టి. పురుషుడి దేహంలో వీర్యోత్పత్తి జరుగుతుంది. దైహికమైన పురుష త్వానికి స్త్రీ దేహం వల్ల స్వాంతన కావల్సొ స్తుంది. అదే విధంగా స్త్రీలో కూడా ఒక దైహిక వాంఛ పురుషుడి నుంచి దైహికమైన స్వాంత నకై నిరీక్షిస్తుంది. ఇది దైహిక ద్రవ్యాల క్రియ. జాగృతిలో దానిని అణచివుంచితే స్వప్నంలో మేలుకొని తన వాంఛని తీర్చుకోవచ్చు. అనివా ర్య సందర్భాలలో అది మరొకరకమైన శమనా న్ని కనుక్కోవచ్చును. ఇటువంటి వాంఛలేని 'జీవి' వుండటం అసాధ్యం. ఈ వాంఛ యొక్క 'ఉపశమనాన్ని' కామతృప్తి అని పిలవకూడ దు. 'కామం' అనేది విశాలమైన అర్థం వున్న పదం. అది సమగ్రమైనది. అందులో మొత్తం 'వ్యక్తిత్వం' పొందే తృప్తి ఇమిడి వుంటుంది. ఈ వాంఛయొక్క పటుత్వోపశమనం కొన్ని అపురూప సందర్భాలలోను, బలాత్కార సంగ మంలోనూ జరగడం సాధ్యమవుతుంది. అందువల్ల ఇతర తృప్తులకి సంబంధించని ఒక స్వతంత్రమైన, దైహిక ద్రవ్యాలకి సంబంధించి తృప్తిని పొందగలిగే సంభవం వున్నది. రాత్రి - పగలు కొట్లాడుకుంటూ శత్రువుల్లా బతికే భార్యాభర్తలు కూడా ఈ వాంఛవల్ల పుట్టినటువంటి విస్మరణీయమైన చీకటిలో పరస్పరం ఉపశాంతిని పొందుతారు. దీనివల్లనే మనిషిని కూడా మృగంతో పోలుస్తా రు. లేదా ఇది మనుష్యత్వానికి అంటిన మృగ త్వ శాపం. ఇటువంటి శుద్ధ మృగయ వాంఛవ ల్ల తనను విడుదలచేసుకునే సామర్థ్యం మని షికి వున్నమాట నిజం. కాని ఈ సామర్థ్యం చాలా అపురూపమైన వస్తువు. ఆ సామర్థ్యం వున్నది దేహంలో కాదు, మనసులో కాని





వాంఛలో పుట్టిన దైహిక క్రియ కోసం దేహం, పక్కకి తొలగిన మనసుకి తెలియకుండానే అందులో పాల్గొనే అవకాశం వుంది. ఆనంద్ యొక్క మృగవాంఛకి సుధ దేహం సమిధ అయ్యేటప్పుడు, ఆమె దేహానికప్పుడేనా ఒక్కోసారి, మనసు విస్మృత స్థితిలోకి తోసివేయబడ్డప్పుడు వాంఛే వశమనం కావచ్చును. కాని అది సుధ అనే వ్యక్తికి, ఆమె వ్యక్తిత్వానికి సంబంధించినది కాదు. దైహిక ద్రవ్యాలు, మానసిక ద్రవ్యాలు ఒకటికొకటి పెనవేసుకున్నవయినప్పటికీ అవి రెండూ 'ఒకటే' మాత్రం కాదు. దేహానికి కావాలనిపించినవి మనసుకి వద్దనిపించవచ్చు. సంవత్సరాల తరబడి సుధ అంతరంగంలో మౌనంగానే ఆనంద్ వ్యక్తిత్వానికి సంబంధించిన విశ్లేషణ జరుగుతోంది. ఆమె బుద్ధిరీత్యా అంధురాలు కాదు. ఆమె ప్రజ్ఞాజ్ఞానం ఎప్పుడూ జాగృతంగానే వుంటుంది. ఆమె బయటికి మాత్రం నిర్లిప్తంగా వుంటుంది. లోపల... ఆమె ఆనంద్ వ్యక్తిత్వాన్ని పొరలు పొరలుగా విడదీసి మరీ చూస్తుంది.ఆమెకు మొదట్లో అతడంటే చాలా భయం వుండేది. అతడి దైహిక కార్యానికి ఆమె అదిరిపోయింది. కాని క్రమంగా ఆమె ఆ భయం పిడికిళ్ళనుంచి విడిపించుకుంటుంది. ఆమె చివరికి, "రా , చంపునన్ను!" అని అనడం ఓటమినొప్పుకొని శరణాగతురాలు అవడంవల్లకాదు. నిస్సహాయతవల్ల కాదు. తనని చంపడం, నాశనం చేయడం అతడివల్ల కాదు అనే ధీమాతో తను అతడిని గెలిచింది. తను చచ్చిపోయినా సరే అది తన ఓటమిమాత్రం కాదు అనే అపూర్వమైన నమ్మకంతో అతన్ని గెలవడానికి, తన వ్యక్తిత్వాన్ని స్థిరపరచకుందుకి ఆమెకున్న ఒకే ఒక్క ఆయుధం 'తల్లి కావడం'.

కాని అది కేవలం ఆయుధం మాత్రమే దు. తల్లి కావాలనే 'వాంఛ' స్త్రీకి అత్యంత తీక్షణమయిన కోరిక. అది ప్రకృతి ఆమెలో నిబిడీకృతం చేసినటువంటి కాంక్ష. అది మృగాలకి, పక్షులకి, చేపలకీ, చెట్లకి - చేమలకి వుండే కామన. అందులో పాపం లేదు - పుణ్యంలేదు. అది వికారం కాదు. అది సౌందర్యం. అది లేకపోతే దృశ్యం లేదు - ధ్వనిలేదు. పూలులేవు - పళ్ళులేవు.

తన దైహిక దోషాల వల్ల స్త్రీ తను తల్లికాలేకపోతే తప్పకుండా ఒప్పుకొంటుంది. ఎందుకంటే దానినామె ఒప్పుకోవలసిందే. కాని తను తల్లి కాగలిగినా కూడా పురుమడి లోపంవల్ల తను తల్లి కాలేకపోయిందన్న సంగతి ఆమెకి ఊపిరున్నంతవరకూ యాతనకి గురిచేస్తుంది. తల్లికావడానికి, తండ్రికావడానికి చాలా తేడా వుంది. తండ్రయినప్పుడు మగవాడు ఏమీ 'అయిపోడు'. స్త్రీ 'అవుతుంది'. అదొక ఛేంజ్ ఆఫ్ పర్సనాలిటీ టోటల్లీ. ఒక స్త్రీ తను తల్లి కాలేకపోయిన దుఃఖాన్ని సహించి జీవించవచ్చు. భర్త ఆమెని తన మరొక ప్రాణంలా ప్రేమిస్తే ఆ వ్యధని తుడిచిపెట్టవచ్చు. కాని సుధకి తను గెలవాలి, ఆనంద్ ఓడిపోవాలి - అనే పట్టుదల కలగడానికి కారణం, ఆమె సుఖాన్నివ్వగలిగే ఏ అంశమూ ఆనంద్ వ్యక్తిత్వంలో లేకపోవడం అతను కొంచెమయినా ఆమె ప్రాణానికి దగ్గర కాలేకపోయాడు. స్త్రీ హృదయం తెలిసిన మరే స్త్రీ అయినా తప్పకుండా సుధని అభినందిస్తుంది. ఇటువంటి వ్యక్తిత్వపు లోతు - ఉనికి వీటి ప్రశ్న తల ఎత్తినపుడు నియమనిబంధనలన్నింటినీ గాలికి అప్పగించే వ్యక్తులవల్లనే సమాజం 'లోకం - మార్గం' అంటూ సింహావలోకనం మొదలుపెడుతుంది.

సుధలాగా 'గొడ్రాలు' అనిపించుకున్న స్త్రీలంతా ఆమె పద్ధతిలోనే సంతానాన్ని పొందాలన్నది మీ అభిప్రాయమా?- అనే ప్రశ్నకి, నా సమాధానం:

ఒక కథగాని, నవల గాని చట్టాన్ని వివరించే గ్రంథం కాదు. మన ధర్మశాస్త్రం కాదు. ఆత్మచరిత్ర అంతకన్నాకాదు. సమాజ చిత్రణ, వ్యక్తిచిత్రణ, మనోవ్యాపార అధ్యయనం మాత్రమే దీంట్లో జరుగుతుంది. ఒక విషయంలో కొత్తరకంగా ఆలోచింపచేయడానికి రచయిత ప్రయత్నించవచ్చు. 'ఇలాగయితే సరికాదు', 'ఇలాగయితే తప్పుకాదు' లేదా 'ఇలాగయితే మంచిది' అనే అభిప్రాయాలని కూడా అతడు వెలిబుచ్చవచ్చు. అందువల్ల ఆ దృష్టికోణంలో ఈ విధంగా చెప్పవచ్చు. సుధలాంటి ఒకస్త్రీ, అంటే ఆ పరిస్థితిలో చిక్కుకు



న్న ఒక స్త్రీ ఆమె తల్లి అయిన పద్ధతిలో తల్లిఅయితే తప్పుకాదు. అంటే స్త్రీలంతా అలా చెయ్యాలి, చెయ్యొచ్చు అని దాని అర్థం కాదుకదా? ఒకామెకి పిల్లలు ఒద్దులే అని పించవచ్చు. మరొకామెకి భర్తనుండి ఆదర్శ ప్రాయమైన పరిపూర్ణమైన ప్రీతి లభించి ఆమె సుఖసంతోషాలన్నింటినీ అందులోనే పొంది, తల్లికాకపోయినా చింతలేదు అనుకోవ చ్చు. ఇంకొకామె భర్తని పక్కకి తొలగించి, మరొకడివల్ల కేవలం సంతానాన్ని మాత్రమే కాకుండా ప్రేమని - కామాన్ని అన్నింటినీ పొందవచ్చు. ఇంకొకామెకి కృత్రిమ గర్భధారణ మంచిది అనిపించవచ్చు. మరొకామె పిల్లవా డిని దత్తతకి తీసుకుని తృప్తిపడవచ్చు. అంద రూ సుధ చేసినట్టే చెయ్యాలనడానికి రచ యిత ఎవరు? అతనేమీ అవతారమూర్తికాదే. రచయిత అయినా రచయిత్రి అయినా ఆ రాసేదేదో రాసి పక్కకిపెట్టేస్తే చదువరిలాగే అతడూ ఒక సామాన్యవ్యక్తి.

దుష్యంతుడు శకుంతలని విస్మరించిన కథ మనకి ఆదరణీయమవుతుంది. దానికి ఋషిశాపం కారణమంటాము. త్రికాలజ్ఞాని అయిన ఋషి ఎందుకు మూర్ఖంగా శపించా డు?- అన్నది జవాబు లేని ప్రశ్న. రాముడు సీతని అడవిలో వదిలి వెళ్ళడం సమర్థిస్తాం. రావణుని చంపడానికి రామావతారంలో వున్న విష్ణువుకి ఒక నెపం కావల్సొచ్చింది అంటాం. మళ్ళీ ... మరోసారి ఆమెని కావాలని అడవుల పాల్జెయ్యడం కూడా ఒక అందమైన, ఆదర్శనీ యమైన కథగానే మనకి కనిపిస్తుంది. అడవు ల్లో దమయంతిని వదిలిపెట్టి పోయిన నలుడి కథ కూడా ఒక ప్రేమకావ్యమై వర్ధిల్లింది. హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మెయ్యడం తప్పని ఎవరూ ఎదురుతిరగరు. ద్రౌపదిని పణంగాపెట్టి జూదమాడిన ధర్మరాజు మనకి పూజనీయుడు. పెళ్ళికి ముందే గర్భవతిఅ యిన కుంతి కర్ణుడిని నీటిపాలు చేయడానికి వెనుకనున్న పురుషుడి కర్తవ్యభ్రష్టత్వం మన దృష్టికి రాదు. సాళ్వరాజు నుంచి అంబని విడదీసి, తనూ చేరదియ్యకుండా వదిలేసి, ఆమెని అగ్ని పాల్జేసిన భీష్ముడు నీతికి ప్రతి రూపం.

ఇవన్నీ మగతనపు కథలు. ధర్మరాజులు, భీష్ములు, హరిశ్చంద్రులూ ఇప్పటికీ వున్నారు. వారికి మర్యాద దొరుకుతూనే వుంటుంది. ద్రౌప దులు, అంబలు, చంద్రమతులూ కూడా వున్నారు. అటివంటివారుండటమే సంప్రదా యానికి, వ్యవస్థకీ గౌరవం! స్త్రీలో మగవాడిపట్ల విధేయత కావాలి, ప్రేమకావాలి, భక్తికావాలి. ఆమె పతివ్రతగా భర్తని ఆరాధించాలి, పూజించాలి. సతీసావిత్రిలా భర్తని యముడి బారినుండి రక్షించుకుంటూ వుండాలి. ఆమె రేణుక కావాలి. అహల్య కావాలి. సీత, ద్రౌపది వగైరా కావాలి. కేవలం స్త్రీ అయితే చాలదు. 'పవిత్ర భారతనారి కావాలి. ఆ విధంగా బత కడం ఆమె ఔన్నత్యానికి చిహ్నం. భర్త ఎటు వంటివాడయినా సరే అతడిలో ఆమె కరిగిపో వాలి. అంతర్థానమయిపోవాలి. స్త్రీత్వం అంటే ఇదేనా? అంతేనా?

పురాణ కథల్లో నాకు చాలా ఇష్టమైన పాత్ర లు రెండు. ఒకటి అంబ, రెండవది రాధ. ఒకత్తె చచ్చి సవాలుగా నిల్చింది. మరొకత్తె ఎటువంటి సవాలు చెయ్యకుండానే, సవాలు కాకుండానే గెల్చింది.

ఒకర్నొకరు కావాలని కోరుకుని, తపస్సుచేసి గెల్చుకుని, అన్ని రీతులలోను సమానులయిన స్త్రీ పురుషుల జంట ఒకే ఒక్కటి పార్వతి - శివుడు.

స్త్రీ హింస గురించి, మగవాడు ఆమె పైన నడిపిన దౌర్జన్యం, ఒత్తిడి, పురుషుడు ఆమె కోసమై నిర్మించిన నియమనిబంధనల చట్టం గురించి, స్త్రీని పూజించి, లోపల దాచిపెట్టి బంధించిన సంగతుల గురించి, ఆమెని అనేక విధాలుగా ప్రదర్శించి ఆమెనొక వ్యాపార వస్తువుగా చేసిన సంగతి గురించి, ఆమెని దాసిగా తొత్తుగా - వేశ్యగా వుంచుకొన్న నీతి గురించి, ఆమెని అక్క, తల్లి, చెల్లి అని పిలుస్తూనే వంచించే విషయం గురించి, వర దక్షిణపేరుతో అంగడిబొమ్మగా అవమానించే దాని గురించి, 'విధవ' అనే బిరుదునిచ్చి వేధించే సంగతుల గురించి ఎన్నెన్నో తర్కా లు- వితర్కాలు జరుపుతాం. కాని స్త్రీ ఈ స్థితినుంచి మార్పుచెందాలి అనే విషయం వస్తే స్త్రీయే దానికి అడ్డంరావడం చూసినా,





సీతకయిన అన్యాయాన్ని తెలుసుకొని కూడా రాముణ్ణి పూజించే స్త్రీని చూసినప్పుడూ మన స్త్రీలకింకా శాపవిముక్తి దొరకలేదని అనిపిస్తుంది. మనకి రాముడితోటీ పనిలేదు, సీతతోటీ పనిలేదు. వారి దైవత్వం వారి దగ్గర భద్రంగా వుండనీయండి. మనకి కావల్సినది స్వంత వ్యక్తిత్వం, మనం మానవత్వం అనే నిర్ధారానికి రావడానికింకెంతకాలం పడుతుంది?

కొన్ని సంగతుల్ని మనం వాస్తవ దృష్టికోణంలోనే చూద్దాం. కౌసల్య, కైక, సుమిత్ర పాయసాలు తాగి గర్భవతులవడం ఏమిటి? అటువంటి పాయసమంటూ వుంటే మరెవరూ దాన్ని తాగి గర్భవతులెందుకవలేదు? అసలు సంగతేమిటంటే, చక్రవర్తి భార్య గర్భవతి కావాలంటే దివ్యమంత్రాలు, దివ్యపాయసాలు వుంటాయి. పేదవాడి భార్యకి కడుపురావాలంటే తన భర్తవల్ల కాకపోతే మరొకడితో శయనించడంవల్ల జరుగుతుంది. చక్రవర్తి మర్యాదని కాపాడాలంటే యజ్ఞయాగాల ముసుగు - రక్షణ కావాలన్నదొక్కటే అంగీకరించక తప్పని సత్యం.

ఆ దృష్టిలో మహాభారతం నిష్ఠురమైన నిజం. పాండురాజు, ధృతరాష్ట్రుల తండ్రి క్షత్రియుడు కాదన్న సంగతి స్పష్టంగానే తెలుస్తోంది. క్షత్రియుడికి పిల్లలు పుట్టకపోతే బ్రాహ్మణుడివల్ల పొందవచ్చని బ్రాహ్మణుడు సంస్కృత భాషలో చట్టం చేశాడుగా! తొంభైఅయిదు శాతం ప్రజలు నిరక్షరాస్యులు అయిన కాలంలో మూర్ఖుడయిన పండితుడికి పండితుడయిన మూర్ఖుడికి సంస్కృతంలో చెప్పిందల్లా పవిత్రమే. ఆ శ్లోకాలన్నీ ఆచరణీయమే. పెళ్ళిళ్ళకి ఫలానా శ్లోకాలు పఠించాలి, గృహప్రవేశానికి ఫలానా శ్లోకాలు పఠించాలి, శ్రాద్ధానికి ఫలానావిధమైన శ్లోకాలు చెప్పాలి అనేది సంస్కృత భాషలో చట్టమయింది. ఈ చట్టంలో చెప్పిన ప్రకారం వివాహవిధి నెరవేర్చడంవల్ల, పురుషుడినోటివెంట, స్త్రీనోటివెంట కొన్ని మాటల్ని చెప్పించడంవల్లనే వారు భార్యాభర్తలు అవుతారన్న నమ్మకం ఏర్పడింది. చెల్లెల్ని చూపించి వంచనతో అక్కమెళ్ళో తాళికట్టించి ఈ శ్లోకాల్ని పఠించినప్పుడు, స్త్రీ పురుషులిద్దరికీ ఇష్టంలేకుండా బలవంతంగా ఒకచోటచేర్చి శ్లోకాలు పఠిస్తుంటే స్త్రీ మనసులో తను మెచ్చిన మరో మగవాడు, పురుషుడి మనసులో తను వలచిన ఇంకో ఆడపిల్ల విహరిస్తున్నారనే, ఆ శ్లోక మహిమవల్ల వీరిద్దరు ఆదర్శదంపతులవుతారు. తరువాత ఆ సంప్రదాయపు బడిలో పుట్టి సంప్రదాయపు సంకెళ్ళవల్ల బంధింపబడ్డ జనాలు నిర్మించిన సర్కారు చట్టంలో కూడా ఈ సంప్రదాయానికి రక్షణ దొరికింది. మనసుకి ప్రాముఖ్యత లేకుండాపోయి నాలుకతో ఉచ్చరించే శ్లోకాలకి, మెడలో వేసే దారానికి ప్రాముఖ్యత లభించింది. బుద్ధికంటే భయం శక్తివంతమయినది. స్వాతంత్ర్యం కంటే నిర్బంధం గొప్పదయింది. లోకమంతటికీ జీవితార్థాన్ని చాటిచెప్పే కృతులయిన వేదాలు - ఉపనిషత్తులు చీకట్లో మిగిలిపోయాయి. యోగం అగమ్యంగా ఉండిపోయింది. గరుడపురాణం, మనుస్మృతులలో విరజిమ్మిన ధోరణులు ఆలోచనని, క్రియనీ నిర్దేశించే చట్టాంగాలయ్యాయి. ధైర్యంకంటే భయమే ఎక్కువ సుఖకరంగా అనిపించింది. స్వాతంత్ర్యం కంటే బంధనమే హితవుగా అనిపించింది. ఈ వ్యవస్థలో ప్రథమంగా బలి అయినదే స్త్రీ. ఆడదాన్ని ముక్కలుచేసి వేయించి కాకులకి గ్రద్దలకి వేయాలని మనువు చెప్పినట్లయితే ఏమీ ఆశ్చర్యపోనక్కర్లేదు. మనువు ఒక వ్యక్తి కాదు. అది ఒక పదవి పేరు. స్వర్గానికి ఇంద్రుడెలాగో భూమ్మీద మనువు అలాగ. మనువుకి పర్యాయపదం మగవాడే.

భార్యా-భర్తలవడం అంటే 'ధర్మేచ-అర్థేచ'...లాంటి మంత్రాలవల్ల కాదు; తాళి కట్టడంవల్ల, కలిసి పడుకోడంవల్లాకాదు. ఇద్దరి మతం, జాతి ఒకటైనంతమాత్రాన భార్యాభర్తలయిపోరు. భార్యాభర్తలు కావలసింది దేహాలవల్లకాదు మనసులవల్ల. వివాహ విధిమూలకంగా భార్యాభర్తలని ఘోషింపబడ్డ భార్యాభర్తలెందరో నిజంగా భార్యాభర్తలయివుండకపోవచ్చు. జాతకాలు అతికినందుకు భార్యాభర్తలయిన జంటలెన్నో మనసులు అతకక శాశ్వత నరకాన్ని అనుభవిస్తూ వుండచ్చు. కాని అదంతా బయటికి కనిపించని సంగతి, కనిపించినా ఏం ప్రయోజనం అనే నిరాశ,

భయంకూడా వీటికి కారణంకావచ్చు. ఆర్థిక మైన సామాజికమైన కారణాలు కూడా వుండచ్చు. ఈ సామాజిక బంధనాలలోని యాతన ఇంకా కొంతకాలం కొనసాగవచ్చు. కాని ఏదో ఒకనాటికి అవి తుడిచిపెట్టుకుపోకతప్పదు.

తనకి పిల్లలు పుట్టలేదని మగవాడు విడాకులిస్తాడు. మరో పెళ్ళి చేసుకుంటాడు. 'ఇతడి వల్ల తనకి పిల్లలు పుట్టలేద'ని ఆడదెందుకు విడాకులు తీసుకోదు? ఎందుకు మరో పెళ్ళి చేసుకోదు? తనకి తన భార్యమూలకంగా పిల్లలు పుట్టలేదనే మాటకంటె, తనకి తనభర్తవల్ల పిల్లలు పుట్టలేదనే మాట ఎక్కువ విశ్వాసార్హమైనది. మగవాడు తన భార్యని గొడ్రాలని తీర్మానించి ఆమె అనుమతి ప్రకారం మరో ఆడదాన్నిపెళ్లిచేసుకుంటాడు. ఆదే ఆడది తన భర్తని 'అశక్తుడు'గా తీర్మానించి అతడి అనుమతితో మరో మగవాడినెందుకు పెళ్ళిచేసుకోదు? చట్టాలన్ని పురుమడివల్ల పక్షపాతం చూపిస్తున్నాయని తెలిసికూడా స్త్రీ ఆ చట్టానికెందుకు తన మద్దతునిస్తుంది?

మగవాడంటే మగతనం (వీర్యం) కలవాడు. నిర్వీర్యులుండేది కూడా మగవారిలోనే. ఆడవాళ్ళల్లోకాదు. స్త్రీలలో ఇటువంటి వర్గీకరణానికి వీలులేదు. స్త్రీ దైహికంగా స్త్రీఅయ్యుంటే చాలు మగవాడికి. సంగమమవుతుంది. కాని స్త్రీ విషయంలో అలాకాదు. ఆమె మనను, దేహం కూడా నిర్వీర్యుడయిన భర్తని అంగీకరించ(లే)వు. అర్థ పండుడయినా, పూర్ణ పండుడయినా స్వీకరించలేదు. ఈ సంగతి తెలిసుండికూడా మగవారు తమదోషాన్ని కప్పిపుచ్చుకుని పెళ్ళిచేసుకొని స్త్రీని వంచించి తమ అశక్తతని, గొడ్డుతనాన్ని స్త్రీకి ఆపాదించరా? ఇలాంటి ఎన్నో సందర్భాలలో నేను గొడ్రాలిని కాను, 'ఇతడు నాకక్కర్లేదు' అనగలిగే ధైర్యాన్ని వ్యక్తిత్వాన్ని ఎంతమంది స్త్రీలు వ్యక్తంచేస్తారు. ఎందుకు వ్యక్తం చేయకూడదనలు? వ్యక్తికి ముఖ్యమైనది ఏమిటి? కృత్రిమమయిన, ఆడంబరమై, పటాటోపంతోకూడిన ఆషాఢభూతితనం నిండిన సామాజిక హెూదానా? వ్యక్తిగతమైన అంతఃసత్యమా? మానవ జీవితం చాలా చిన్నది. దాన్ని కేవలం వంచనకి మీదుకట్టడం, జీవితమంతా పటాటోపం కావడం ఎంత దురదృష్టం!

ఏ వ్యక్తికయినా వ్యక్తిగత దృక్పథం మరియు సామాజిక దృక్పథాలమధ్య అంతరం వుండదో అతడిది పరిపూర్ణం అయిన వ్యక్తిత్వం అని చెప్పచ్చు. ఆ రెండింటిమధ్యా చాలా అంతరమున్నట్లయితే అది స్కిజోఫ్రెనియా యొక్క ఒక రకం. తన భార్యముందు పరాయి స్త్రీలని గౌరవంగా మాట్లాడించడం, మరెక్కడయినా వాళ్ళు కనిపిస్తే వాళ్ళని కౌగిలిలోకి లాక్కోవాలని చూడటం, మాటల్లో ఒక రకంగాను, చేతల్లో మరోరకంగాను వుండటం ఈ రోగలక్షణాలు. తనలో అంతా మంచి గుణాలేననీ, అవే గుణాలు మరొకరిలో వుంటే చెడ్డగా కనిపిస్తున్నాయనీ అనడంకూడా ఒక మనోవైకల్యమే. ఈ మనోవైకల్యానికి ఆనంద్ ఒక వుదాహరణ. ఆ దృష్టితో చూస్తే మహేష్‌ది ఆనంద్ కంటే శుద్ధమైన వ్యక్తిత్వం. ఎందుకంటే అతను అంతరంగ వ్యక్తిత్వానికి, సామాజిక వ్యక్తిత్వానికి మధ్య రహస్యమైన అంతరాన్నేమీ వుంచుకోలేదు. అంతేకాక ఆ రెండింటి మధ్య సామరస్యాన్ని సాధించాడు. దీనికి అతని భార్య సహకారం కూడా పూర్తిగా ఉంది. తను ఏమిటి, ఎటువంటివాడన్న సంగతి చాలావరకూ అతడు బహిరంగంగా ప్రకటించుకుంటాడు. అతడు తన అంతరంగ వ్యక్తిత్వాన్ని సామాజిక వ్యక్తిత్వాన్ని తన అదుపాజ్ఞలలో వుంచుకున్నాడు. కాని ఆనంద్‌కే ఆ విధమైన అదుపులేదు. మహేష్ ఆడది కనిపిస్తే మతి పోగొట్టుకోడు. తనంత తాను ఆహ్వానించేవరకూ సంయమనంతో వేచివుంటాడు. అవకాశం దొరక్కపోతే ఎదుటివ్యక్తి సహకరించకపోతే వూరుకుంటాడు.

ఇది ఒక విధంగా ధూర్త సంయమనం. ఆనంద్ అలాకాదు. ఆడదాన్ని చూస్తే తనెవరో, ఎక్కడున్నాడో, తన స్థానం ఏమిటో అన్నీ మర్చిపోతాడు. నీరుతాకిన ఉప్పులా కరిగి నీరవుతాడు. అతని ఈ దౌర్బల్యంవల్ల గందరగోళంలో ఇరుక్కుంటాడు. తన వ్యక్తిత్వం ఏమిటో అతనికే తెలియదు. అతని అంతరంగ వ్యక్తిత్వము, సామాజిక వ్యక్తిత్వమూ కూడా అనిర్దిష్టమయినవే. నిజాన్ని దాచి వుంచగలడు. జమునతో, ఇంకా అనేకమంది స్త్రీలతో అతనికున్న లైంగికవ్యవహారం సుధకి తెలియదు. తను




తనలోని ఏముఖాన్ని(ఫేజ్) సుధకి చూపిస్తాడో 'అదే తాను' అనే అభిప్రాయం ఆమెకి కలిగేలా ప్రయత్నిస్తాడు. కాని అతడి వ్యక్తిత్వానికున్న మరొక తలని చూడగలిగే తెలివితేటలు సుధకున్నాయి. ఆ ముఖంలో ఏ విన్యాసం కనిపించినా దానితో చేరిన, దాగిన అతడి అసలు వ్యక్తిత్వపు విలువ 'ఎంత' లేదా 'ఇంతే' అన్నది ఆమె అర్థంచేసుకోగలదు.

ఏ వ్యక్తికయినా అతడి అంతరంగముఖం, సామాజికముఖం-ఈ రెండింటిమధ్యన చిన్న అంతరంవుండి తీరుతుంది. మన ఇంట్లో మనం కుర్చీమీదనో, టేబుల్ మీదనో కాళ్లుపెట్టుకొని కూర్చుంటాం. అదే ఆఫీసులో అయితే అలా చెయ్యలేం. ఒక వ్యక్తి వుండే సన్నిహిత సంబంధంవల్ల మాత్రమే మనం అతని వ్యక్తిత్వపు లోతుని చూడగలం. వ్యక్తిగత స్వభావాన్ని తెలుసుకోగలం. బుద్ధుడు, ఏసు, అక్బర్....మొదలైన వ్యక్తుల గురించి మనకు వారి వ్యక్తిగత విలువలు మనకి తెలియవు. అందువల్ల వారి వ్యక్తిత్వం గురించి మనకి తెలిసినదేదయినా అది ఆ ఒక్క సమయంలోనో, వ్యక్తిగతమైనదో లేదా సామాజికమైనదో లేదా అంతరంగముఖమో-ఏదో ఒక్క స్వభావమో అయివుంటుంది. కొన్నిసార్లు ఇటువంటివారి వ్యక్తిగత స్వభావం-వ్యక్తిత్వాల గురించి వివరాలు దొరికినప్పుడు నిశ్చేష్టులమవుతాము. విక్టోరియా మహారాణి అంతరంగప్రేమ-కామ జీవితంగాని, అక్బర్ స్త్రీవేషంలో చాందినీ చౌక్‌కివెళ్ళి అక్కడి బజార్లో రహస్యస్థానాల్లోని అందమైన ఆడవాళ్ళనెంచుకొని భోగిస్తుండిన సంగతిగాని; విరాగి, నిస్సంగీ అయిన, పరమ పూజ్యుడయిన ఏ మతాధికారో స్త్రీలతో రహస్యంగా కామకేళి జరిపేవాడు అనే సంగతి చటుక్కున బయటపడిందంటే ఉలిక్కిపడతాం. కొందరు ఇది నిజమని తెలిసినా తమ ధార్మిక నమ్మకాల పంచాంగం ముక్కలవుతుందనే భయంతో అది 'అబద్ధం' అని ఘోషించడం మొదలుపెడతారు. అలాగే చెడ్డవాళ్ళు అని ముద్రవడ్డ వ్యక్తుల విషయంలో ఏదయినా అతి మంచి సంగతి వెలుగులోకి వస్తే దాన్ని ఒప్పుకోడానికి తమ గుడ్డినమ్మకం, వేళ్ళూని పాతుకుపోయిన అభిప్రాయాలు అడ్డొస్తాయి. మత సంబంధమైన విషయాల్లో స్థిరాభిప్రాయాలు పాతుకుపోయిన మనుషుల్ని, మతాసక్తిలోపడి తామేమిటో తమకే తెలియకుండా మతిలేక కొట్టుకుపోతున్న మనుషుల్ని(ఏ విధంగానూ) పరివర్తనన్నది ఇందుకే స్పృశించదు. మన సమకాలీనుల్లో మనం ఇలాంటి అపాథభూతితనాన్ని గుర్తించచ్చు. అది సులభంకూడా. కాని పురాణాలు, చరిత్రలలో మహామహులయిన మనుషుల విషయంలో మనకి నిజంతెలియాలంటే మనచేతికి రాముడిది, రావణుడిది, సీతది, కుంతిది, అక్బర్‌ది-నిష్ఠురమైన నిజాలున్న డైరీలు దొరకాలి. ఆ డైరీల్లో వారి క్రియలు మాత్రమేకాక, భావాలేమిటన్నవి కూడా రాసి ఉండాలి. అప్పుడు అందులో కొన్నిసార్లు రాముడిలో వున్న రావణత్వం, రావణుడిలో కొంచమైనా రామత్వం కనిపించవచ్చు. రాముడి గురించి మనకి కొండంత తెలుసు. రాముడు మనకి తెలిసిన రాముడు అవడంలో, రావణుడు మనదృష్టిలో సృష్టింపబడ్డ రావణుడు అవడంలో నిజం ఎంత-మిధ్య ఎంత?- అన్నది మనకప్పుడు అర్థమవుతుంది.

ఈ దృష్టితోచూస్తే ఏ ద్వంద్వం లేకుండా, లోపలొకటి బయటకొకటి వుంచుకోకుండా మనకి పూర్తి డైరీ ఇచ్చినవాడు కృష్ణుడొక్కడే. రాధ గురించి మనకట్టే తెలియదు. ఆమెకొక భర్త వున్నాడు. ఆమెకి కృష్ణుడిమీద అత్యంత ప్రేమ వుంది. ఆమె అతడికి ప్రియసఖి అంతే మనకి తెలుసు. దాన్ని మనం ఒప్పుకున్నాం. మనకి తెలిసిన వివరాల ప్రకారం కృష్ణుడేమిటి?

అతడు బాలకుడు, అతడు వీరపురుషుడు, అతడు పురుషోత్తముడు. స్త్రీకి ఆదర్శసఖుడు. పురుషుడికి ఆదర్శమిత్రుడు. రాక్షసుడికి మృత్యువు. తను సర్వశక్తుడనీ చూపించాడు, నిశ్శక్తుడిననీ చూపించాడు. అతను చంపాడు, చివరికి చంపబడ్డాడు. అతడు ఈ విశ్వంలో ఏమేమున్నదో అదంతా అయివున్నాడని మనం అనుకున్నాం... కాని మనకింకా పూర్తి అర్థంకాని, మనం అర్థంచేసుకోనిదల్లా-

రాధని, ద్రౌపదిని, అంబని, అహల్యని, దమయంతిని ఇంకా అటువంటి వేలాది స్త్రీలని. ★



# చతుర ప్రపంచం

## అద్భుతాల బుక్‌షెల్ఫ్

అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాల్లో సంగీత ప్రియులకి మామూలు రికార్డులు, క్యాసెట్లు కాకుండా, అంతకంటే మేలైన కాంపాక్టు డిస్కులు దొరుకుతున్నాయి. అందువల్ల పాటల రికార్డులు, కాసెట్లు పాతబడిపోతున్నాయి. అయితే, ఈ కాంపాక్టు డిస్కులు కంప్యూటర్ వినియోగదారులకి కూడా ఎంతో ఉపయోగకరం కాబట్టి బహుళ జనాదరణ పొందవచ్చు. పర్సనల్ కంప్యూటర్‌కి ఉండే ప్రత్యేకమైన "డిస్క్ డ్రైవ్"లో కాంపాక్టు డిస్కుని పెడితే, ఒక్కో డిస్కు నుంచి పదిహేను వందల పాతరకం డిస్కులలో పొందుపరచగలిగినంత సమాచారం తెరపై కనపడుతుంది. సాఫ్ట్‌వేర్ తయారీ సంస్థలకి దీనివల్ల మంచి గిరాకీ ఉంటుంది. కాంపాక్టు డిస్కులు వాడడంవల్ల తక్కువ వ్యవధిలో ఎక్కువ సమాచారాన్ని ఉపయోగించుకునే వీలుంటుంది.

ఇటీవల అమెరికాలో రెండువందల తొంభై అయిదు డాలర్ల ఖరీదు చేసే 'బుక్‌షెల్ఫ్' అనే కాంపాక్టు డిస్కుని ఓ అంతర్జాతీయ సభలో ప్రవేశపెట్టారు. పేరుకి తగ్గట్టే ఆ డిస్కులో 'బార్లెట్స్ ఫెమిలియర్ కొటేషన్స్', 'రోజెట్స్ థిసారస్', 'వరల్డ్ అల్మనాక్', 'యునైటెడ్ స్టేట్స్ జిప్ కోడ్ డైరెక్టరీ' వంటి పది రెఫరెన్స్ గ్రంథాల్లో ఉండే సమాచారాన్ని పొందుపరిచారు. అలాంటి డిస్కు, దానికావల్సిన ప్రత్యేకమైన డిస్కుడ్రైవ్, ఓ పర్సనల్ కంప్యూటర్





తమ వద్ద వుంచుకోగలిగితే రచయితలు దేనికీ తడుముకోనక్కర్లేదు. బటన్ నొక్కితే చాలు- తమక్కావల్సిన పదాలు, వాటి పర్యాయపదాలు, నానార్థాలు, కొటేషన్స్- అన్నీ తెరపై ప్రత్యక్షం!

సంగీతమైనా, సాహిత్యమైనా చిన్న డిస్కులో బోలెడంత సమాచారాన్ని భద్రపరచడం నిజంగా ఓ అద్భుతం. బుల్లెట్‌ప్రూఫ్ విండోల తయారీకి ఉపయోగించే ఓ రకమైన ప్లాస్టిక్‌తో ఆ డిస్కుల్ని తయారు చేస్తారు. లేజర్ కిరణాల్ని వాటిపై ప్రసారం చేసి కావలసిన సమాచారాన్ని అందులో ఇముడుస్తారు. ఆ ప్రక్రియలో 'అతి సూక్ష్మమైన రంధ్రాలు డిస్కులో ఏర్పడతాయి. 4.72 అంగుళాల డిస్కులో రెండున్నర లక్షల పేజీల సమాచారాన్ని ఇమడ్చవచ్చు. ఆ మాటకొస్తే ఆరడుగుల పొడవూ, ఆరడుగుల వెడల్పూ ఉపరితలంగా ఉన్న కాంపాక్టు డిస్కులో ఇంతవరకూ రాయబడ్డ పుస్తకాలన్నిటిలోని సమాచారాన్ని ఎక్కించవచ్చుట!

మొదట్లో పుస్తక ప్రచురణకర్తలు కాంపాక్టు డిస్కుని తమ ప్రయోజనానికి ఉపయోగించారు. తొమ్మిది మిలియన్ల పదాలుండి ఇరవై సంపుటాలుగా వెలువడ్డ ఎకడమిక్ అమెరికన్ ఎన్‌సైక్లోపీడియాని రెండేళ్ళక్రితం డిస్కులోకి ఎక్కించారుట. ఆ మొత్తం సమాచారం ఒకే ఒక్క డిస్కు ఉపరితలంలో అయిదోవంతుని మాత్రమే ఆక్రమించిందంటే, ఒక్కో డిస్కులో ఎంత ఎక్కువ సమాచారాన్ని పట్టించవచ్చో ఊహించుకోవచ్చు!

అమెరికాలో ఇప్పుడు దాదాపు 130 కాంపాక్టు డిస్కు ప్రచురణలు ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీష్ డిక్షనరీ, బుక్స్ ఇన్ ప్రింట్, రీడర్స్ గైడ్ టు పీరియాడికల్ లిటరేచర్ వంటివి దొరుకుతున్నాయి.

అయితే, ఆ కాంపాక్టు డిస్కుల్లో వున్న విషయాన్ని కంప్యూటర్ తెరపై చూడాల్సిందే తప్ప, ఉన్నదాన్ని చెరపడం, కొత్త వివరాల్ని ఎక్కించడం, మార్పులు చేర్పులు చెయ్యడం ఫ్యాక్టరీ బైట వీలుపడదు. అందుకే, సొంత కంప్యూటర్లు ఉన్నవాళ్ళు ఆ డిస్కుల్లో తమక్కావలసిన సమాచారాన్ని చేర్చడం కానీ, అంతకుక్రితం వున్నదాన్ని చెరిపెయ్యడంగానీ చెయ్యలేకపోతున్నారు. పైగా, ఖరీదు కూడా ఎక్కువే. డిస్క్ డ్రైవ్‌ల ఖరీదు ఎనిమిది వందల డాలర్ల వరకూ ఉంది. విలువైన సమాచారం చేర్చబడ్డ కంపాక్టు డిస్కు ఖరీదు యాభైవేల డాలర్ల వరకూ ఉండడంవల్ల, చాలామందికిది అందుబాటులో లేదు.

## అభీష్ట సంతానయోగం

**జ్యో**తిష సాంప్రదాయంలో కుజుడిస్థానం పురుష సంతానం సూచిస్తుందంటారు. కానీ వచ్చే పదిహేను ఏళ్ళలో తల్లిదండ్రులు తమకు పుట్టబోయే బిడ్డను ఎంపిక చేసుకునే అవకాశం కావలసిన స్టేషనుకోసం రేడియో ట్యూన్ చేసినంత సామాన్యంగా, మామూలుగా అయిపోవచ్చు. ప్రస్తుతం జపాన్‌లోని బ్యాంకాక్ నగరంలో ఈ సౌలభ్యం రెండుచోట్ల ఉంది. ఒకటి: ప్రొఫెసర్ విటోన్ ఒనతానొంథ్ పర్యవేక్షణలో రమతిబోడి హాస్పిటల్; రెండు: డాక్టర్ రొనాల్డ్ ఎరిక్‌సన్ ఆధ్వర్యంలోని ఆర్.ఐ.ఎ సెంటర్ అనే ప్రయివేటు సంస్థ.

వీర్యంలో మగసంతానానికి కారణమయిన "వై" క్రోమోజోమ్స్ వేగంగా ఈదుతుంటాయి. వాటికంటే తక్కువవేగం ఉన్న "ఎక్స్" క్రోమోజోమ్స్ వల్ల ఆడసంతతి కలుగుతుంది. వీటిని వేరువరచి కావలసినవి తల్లి గర్భంలోకి ప్రవేశపెట్టడమే. ఇది కేవలం నాలుగ్గంటల్లో జరుగుతుంది. పిండోత్పత్తి సరిగా జరిగేటట్లు చూడటం కొన్నినెలలు పట్టవచ్చు.

సెక్స్ సెలక్షన్‌లో మనోరథులయిన ఈ ఇద్దరు వైద్యులూ పుట్టబోయే పిల్లలగురించి 80% గ్యారంటీ ఇస్తున్నారు. క్రోమోజోమ్స్‌ని వేరువరచడంలో మౌలికంగా ఇద్దరికీ వేరువేరు పద్ధతులున్నాయి. డా॥ ఎరిక్‌సన్ తన ఆధ్వర్యంలో 600 మంది ప్రసవాలు జరిగినట్లు, తన ఆధ్వర్యంలో ప్రపంచంలో పలుచోట్ల 55 సెక్స్ సెలక్షన్ సెంటర్లున్నట్లు చెప్పారు. ఖర్చు సుమారు వెయ్యి డాలర్లుంటుంది. పర్యవేక్షణకు ఖర్చులు అదనం.

సత్ఫలితాలు కేవలం 80% అయినందువల్ల ఇరవైశాతం తల్లిదండ్రులకు తమకు కావలసిన సంతానయోగ్యత లేదని వేరే చెప్పనక్కర్లేదు. తస్మాత్ జాగ్రత్త!






## యూనిట్ లింక్‌డ్ ఇన్సూరెన్స్ ప్లాన్ మీకు అందిస్తుంది

- **ఆదాయపు పన్ను మినహాయింపు**
  ఆదాయపు పన్ను చట్టం 80C క్రింద ఆదాయపు పన్ను మినహాయింపు.

- **అధిక రాబడులు**
  డివిడెండ్ ప్రతి సంవత్సరమూ పెరుగుతూనే వుంటుంది. ఈ సంవత్సరం యిది 13.75%- ఎన్నడూ లేనంత ఎక్కువ. రూ. 60,000/-* 10 సంవత్సరాల కాలానికి చెల్లించినప్పుడు రూ. 1,13,155.97, 15 సంవత్సరాల కాలానికి చెల్లించినప్పుడు రూ. 1,57,299.74 అవుతుంది.

- **జీవిత భీమా**
  గరిష్ఠం రూ. 60,000/- వరకూ వైద్యపరీక్ష అవసరం లేదు.

- **ప్రమాద భీమా**
  జీవిత భీమా కాక - అందరు సభ్యులకు రూ. 15,000/-

- **మెచ్యూరిటీ బోనస్**
  10 సంవత్సరాల ప్రణాళిక మీద 5% మరియు
  15 సంవత్సరాల ప్రణాళిక మీద 7.5%

  అర్హత : 10 సంవత్సరాల ప్రణాళికకి
  18-55 సంవత్సరాల వయసు
  15 సంవత్సరాల ప్రణాళికకి
  18-50 సంవత్సరాల వయసు

  లక్ష్యం మొత్తం : రూ. 3,000/- నుంచి
  రూ. 60,000/- వరకు

* ఈ మొత్తంలో మెచ్యూరిటీ బోనస్ కూడా చేరివుంటుంది.
అర్హతకి వుండవలసిన వయసు 25 సంవత్సరాలు.

# యుయల్ఐపి
## మీకు అతితక్కువకి
## అత్యధికంగా లభింపచేస్తుంది!






**UNIT TRUST OF INDIA**

(A Public Sector Financial Institution) H.O. Bombay 400 020.

**Regional Office:** 45, Second Line Beach, Madras 600 001.
Ph: 587433, 580938. **Branch Offices • Hyderabad:** 203/204,
Moghul Court Complex, 2nd Floor, Basheer Bagh, Hyderabad 500 001.
Ph: 240030 • **Vijayawada:** 29-3-12, Venkateswara Rao Street,
Near APCO Bhavan, West of Rehman Park, Governorpet, Vijayawada
520 002. Ph: 63964.

**Our Chief Representatives in Andhra Pradesh** ☐ ADILABAD
• **Sanwal Ram Sah,** Ph: 91 (P.P) ☐ CHITTOOR • **K V Kotiveeraiah,**
Tirupati, Ph: 22322 ☐ CUDDAPAH • **A R Krishna Reddy,** Ph: 2701
☐ EAST GODAVARI • **P Venkataramana,** Kakinada, Ph: 76047
☐ GUNTUR • **K B Tilak,** Ph: 24964, 31839 ☐ KARIMNAGAR
• **T Ahalya Sreenivas,** A-1, Gouthaminagar, P.O. Fertiliser City,
Pin 505 210 ☐ KURNOOL • **T Seetharamaiah Setty,** Ph: 22335 (P.P)
☐ MEDAK • **P V Krishna Reddy,** Ph: 2820 ☐ MEHABUBNAGAR
• **N Venkatanarayana,** H.No. 10-87, B R Compound,
Jadcherla 509 301 ☐ NELLORE • **A Sathyanarayana,** Ph: 2002
☐ PRAKASAM • **M V Ramanaiah,** Ongole, Ph: 3337, 3244
☐ RANGAREDDY • **S Veeraraghavalu,** H.No. 11-9-485-6-1,
Plot No.13, Lalithanagar, Hyderabad 500 044 ☐ VIZAG/
VIZIANAGARAM • **C Narayanaswamy,** Ph: 63116
☐ WARANGAL • **B S N Murthy,** Ph: 8631
☐ WEST GODAVARI/KHAMMAM • **Y Somasundara Rao,**
Tanuku, Ph: 2440.

లక్ష్యం మొత్తం
రూ. 60,000/-కి
పెంచబడినది.

UTI.1303.89.TE

# చతురశీవర్

# తంజావూర్: సరస్వతీమహాల్ లైబ్రరీ

ఎప్పుడైనా దక్షిణాదికి వెళితే తంజావూరును చూడటం మరువకండి. తెలుసుకోవాలన్న ఉత్సాహం ఉండాలేగాని, తంజావూరు ఓ విజ్ఞాన భాండాగారాన్ని మన ముందుంచుతుంది.

సుమారు రెండువేల సంవత్సరాల దక్షిణాది ద్రవిడ సంస్కృతిని పుణికిపుచ్చుకొన్న ప్రముఖ నగరాలలో తంజావూరు ఒకటి.

మద్రాసునుంచి 351 కి.మీ. దూరంలో తూర్పుతీరంవైపు ఉండే తంజావూరు అటు టౌనుకు, ఇటు సిటీకి మధ్యస్థంగా ఉండే జిల్లా కేంద్రం. దీనికి తూర్పున 13 కి.మీ. దూరంలో సంగీతనిధి, వాగ్గేయకారుల్లో రెండవవారైన త్యాగరాజస్వామి జీవించి, మహా సమాధి పొందిన తిరువాయూరు ఉంది. పడమరవైపు 60 కి.మీ. దూరంలో శ్రీరంగం, తిరుచిరాపల్లి ఉన్నాయి.

దక్షిణాదిన ముఖ్యంగా తమిళనాడులో అన్ని ప్రముఖ పట్టణాలను కలిపే కావేరి నది ఈ తంజావూరునుకూడా పునీతం చేస్తోంది.

తంజావూరుకు ఆ పేరు రావటం వెనుక రెండు కథలు వ్యాప్తిలో ఉన్నాయి. ఊళ్లపేర్ల మీద పరిశోధనలు చేసేవారికి అవి ఆసక్తికరంగా ఉంటాయి. 'తంజాన్' అంటే ఓ రాక్షసుడి పేరుగాను, 'శరణాగతులకు ఆశ్రయం'




సరస్వతీ మహలు (బయటనుంచి) మహలు వెనుక రాజకోట గోపురం చూడవచ్చు.

రెండవ శరభోజి ( సర్ఫోజీ-II) మహరాజు పాలరాతి విగ్రహం. భవనంలో కప్పు పైభాగంలో కుడ్య చిత్రణ చూడవచ్చు.

ఇచ్చే స్థలంగాను, రెండు అర్థాలలో రెండు కథలు ఈ ప్రాంతంలో ప్రజల నోళ్ళలో నానుతున్నాయి.

చోళ, నాయక, మరాఠరాజులు ఓ పరంపరగా పాలించిన ఈ తంజావూరు ప్రాంతంలో సుమారు పది శతాబ్దాలపాటు అత్యున్నత స్థాయిలో సాహిత్యం, సాంస్కృతిక కార్యక్రమాలు, శిల్ప, చిత్రకళలు వర్థిల్లాయంటే అతిశయోక్తికాదు.

తంజావూరేకాక దానికి సమీపంలోఉన్న గంగైకొండ చోళాపురం, కుంభకోణం, కారికేళచోళుడు రెండవ శతాబ్దంలో 'కావేరిపై కట్టించిన ఆనకట్ట తిరువారూర్, నాగపట్టణం వంటివి ఆనాటి రాజుల కళాభిరుచికి, వైజ్ఞానిక దృష్టికి, సాంకేతికనిపుణతకు అద్దంపడతాయి.

తంజావూరులో ఆనాటి సంస్కృతిని ప్రతిబింబించే వాటిలో తెలుగు సాహితీపరులకు సుపరిచితమైన సరస్వతీమహలు, రాజా

రెండవ సర్ఫోజి భవనం, బృహదీశ్వరాలయం తప్పనిసరిగా చూడదగ్గవి.

సరస్వతీ మహల్ ప్రపంచంలోని అతి పురాతనమైన గ్రంథాలయాలలో ఒకటి. రకరకాల విజ్ఞాన శాస్త్రశాఖలకు చెందిన అరుదైన తాళపత్రాలు, కాగితంమీద రాసిన రాతప్రతులను అసంఖ్యాకంగా ఈ గ్రంథాలయంలో భద్రపరిచారు. ఇందులోనే ఓ చక్కని మ్యూజియంకూడా ఉంది. దీనిని అపురూపమైన పురాతన విజ్ఞాన భాండాగారంగా అభివర్ణించవచ్చు. ఈ గ్రంథాలయంలో ఉన్న అరుదైన రాతప్రతులు, పుస్తకాల్లో ఎక్కువభాగం సంస్కృతం, తమిళం, తెలుగు, మరాఠీ భాషలకు చెందినవే. దేశం నలువైపులనుంచి, విదేశాలనుంచి కూడా అనేకమంది విద్యావేత్తలు పరిశోధన నిమిత్తం ఈ గ్రంథాలయానికి వస్తుంటారు. దీనినే ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాలో - "అత్యంత అరుదైన ప్రపంచంలోని లైబ్రరీలలో 16వ శతాబ్దానికి చెందిన తంజావూర్ రెండవ రాజా సర్ఫోజి సరస్వతీమహలు ఒకటి" అని ప్రముఖంగా పేర్కొన్నారు.

మరాఠారాజుల్లో చివరివాడైన శివాజీకి ముందువాడు ఈ రెండవ రాజా సర్ఫోజి. క్రీ.శ. 1798 నుంచి 1832 వరకుగల మధ్యకాలంలో ఈ గ్రంథాలయానికి ఓ క్రమరూపం, తరగని కీర్తి తెచ్చిన ఘనత సర్ఫోజీదే. ఇది భావితరాలకు ఓ సాంస్కృతిక, వైజ్ఞానిక నిధిగా నిలవాలని ఆయన అభిలషించారు.

ఈ గ్రంథాలయంకోసం అరుదైన పురాతన సాహిత్య ప్రతులను సేకరించడానికి ఆయన తన ధనం ఎంతయినా ఖర్చు చేయడానికి వెరవలేదు. పురాతన రాతప్రతులను సంస్కరించి, వాటిని ముద్రించడానికి ఆయన ఇక్కడ ఓ అచ్చుయంత్రాన్నికూడా నెలకొల్పారు. తన మిత్రుడైన స్వార్ట్ అనే జర్మన్ మతాధికారి సాయంతో విదేశాలనుంచి ఈ అచ్చుయంత్రాన్ని తెప్పించారు. 1804 నాటికి దక్షిణాది మొత్తంలో ఇదొక్కటే అచ్చుయంత్రం. ఆయన కృషి ఫలితంగా అనతికాలంలోనే సరస్వతీ మహల్ లైబ్రరీ ఓ పరిశోధనాలయంగా మారి, దీనికోసం ఓ ప్రత్యేక పాలనాయంత్రాంగాన్ని రూపొందించవలసి వచ్చింది.

1918లో దీనికోసం మొదటిసారిగా ఓ ట్రస్టు



శరభోజీ భవనం బయట గోడలపై డిజైను, నటరాజ విగ్రహం చూడవచ్చు. వెనుకనున్న ఆరు అంతస్థుల భవనాన్ని అబ్జర్వేటరీ అంటారు.

రాజభవనం లోపలి కప్పు పైభాగంలో కుడ్య చిత్రణ.

ను ఏర్పరచి దానికి అయిదుగురు సభ్యులున్న కమిటీని వేశారు. ప్రారంభ నిధిగా ఈ కమిటీ లక్షరూపాయలు ఇచ్చి, తర్వాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలనుంచి ధనసహాయం అందేలా చేశారు. ఇటీవల తమిళనాడు ప్రభుత్వం దీన్ని ఓ స్వయం ప్రతిపత్తిగల సొసైటీగా మార్చి జిల్లా కలెక్టర్‌ను కార్యనిర్వాహణాధికారిగా నియమించి తంజావూరులో తమిళ విశ్వ విద్యాలయం స్థాపించింది. ఈ గ్రంథాలయంలోని అనేక అరుదైన, పురాతన తాళ, కాగిత ప్రతులు పరిశోధకుల దృష్టిని అంతకుముందుకన్నా అధికంగా ఆకర్షించాయి. ఈ గ్రంథాలయంలోని అరుదైన పురాతన విజ్ఞాన సర్వస్వాన్ని రెండు రకాలుగా తాళపత్ర గ్రంథాలు, కాగితంపైని రాతప్రతులుగా విభజించారు.

ఇక్కడ సంస్కృత భాషకు చెందిన తాళపత్ర గ్రంథాలు 19,155 ఉండగా కాగితపు రాతప్రతులు 17,768 ఉన్నాయి. అలాగే తమిళ భాషా తాళప్రతులు 2,991, తెలుగు గ్రంథాల తాళప్రతులు సుమారు 766 ఉన్నాయి. ఇక్కడున్న మరాఠీ భాషా రాతప్రతులన్నీ కాగితంపై రాసినవే. అవి సుమారు 3,060 ఉన్నాయి. మొత్తం మీద తాళ, కాగిత రాతప్రతులు అన్నీకలిపి 43,740 ఉన్నాయన్నమాట.

ఈ గ్రంథాలయంలో లభించే రాతప్రతుల వివరణాత్మక సూచిని అనేకమంది ప్రముఖులు కలసి రూపొందించారు. డిస్ట్రిక్టు సెషన్సు జడ్జీగా పనిచేస్తున్న ప్రముఖ పండితుడు డాక్టర్ ఎ.సి. బర్నెర్ (1879-1890) రాజుగారి భవనంలోని సంస్కృత భాషకు సంబంధించిన సమాచారాన్నంతా సేకరించి, రూపొందించిన మూడు సంపుటాల సూచీలాధారంగా, వివరణాత్మక సూచీలను తర్వాత తయారు చేయటం జరిగింది. ప్రస్తుతం సంస్కృతంలో ఇలాంటివి 21, తమిళంలో 11, మరాఠీలో 4, తెలుగులో 2 ఉన్నాయి. ఇవి ఆయా భాషల్లోని తాళ, రాత ప్రతులలోని సమాచారాన్ని సంక్షిప్తంగా వివరిస్తాయి. అంతేగాక గ్రంథాలన్నీ ఇంకా పరిపుష్టం చేయాలన్న సంకల్పంతో దేశ వ్యాప్తంగా ఎవరెవరిదగ్గరో ఉన్న అరుదైన తాళ, రాత ప్రతులను సేకరించే ప్రయత్నాలు చేశారు. ఇప్పటికీ చేస్తున్నారు. ఈ విధంగా 4,000 పుస్తకాలు, 3,000 రాత

ప్రతులను సేకరించారు కూడ.

ఈ గ్రంథాలయంలోని అరుదైన తాళ, కాగిత ప్రతుల్లో కొన్నింటి పరిమాణం, వాటిపై రాసిన లిపి పరిమాణం మనల్ని ఆశ్చర్యంలో ముంచెత్తుతాయి. మూడు అంగుళాల వెడల్పు, తొమ్మిది అంగుళాల పొడవు ఉన్న వాల్మీకి రామాయణం తాళ వత్ర ప్రతి ఒకటి ఇక్కడ ఉంది. ఇందులోని ప్రతి తాళ పత్రంపైన మువ్పయి వంక్తులు చొప్పున రెండువైపులా రాసి ఉంది. ఈ పంక్తుల్లోని 'అక్షరాలు సాధారణ చూపుకు కన్పించేవి కావు. ఇది ఆనాటి లేఖకుల నైపుణ్యానికి ఓ మచ్చుతునక మాత్రమే. అలాగే జేబులో ఇమిడే పరిమాణంలో ఉన్న కాగితంపై రాసిన భగవద్గీత కూడా ఇక్కడ ఉంది. ఇందులో దేవనాగరి లిపిలో శ్లోకాలు, తాత్పర్యం ఉంటాయి. అతి పెద్దదైన తాళవత్రాలపై రాసిన కంబ రామాయణం కూడా ఇక్కడే ఉంది. ఇది వాల్మీకి రామాయణానికి తమిళ అనువాదం. శివాజీ గురువైన సమర్థరామదాసు రాసిన 'దశబోధం' అనే గ్రంధం కూడా ఈ మహలులో భద్రంగా ఉంది. అదేవిధంగా ఒకప్పటి మత సామరస్యాన్ని చాటుతున్న అంబర్ హుస్సేన్ మరాఠీ భగవద్గీత, తెలుగు అనువాదం కూడా ఈ గ్రంథాలయంలో ఉన్నాయి. జైమినీ సిద్ధాంతాలను వివరించే అరుదైన తాళవత్ర గ్రంథాలు ఇక్కడ ఉన్నాయి. బౌద్ధమతతత్వాన్ని వివరించే తాళపత్ర గ్రంథాలలో ఆనాటి బర్మా లిపిని, పాళీ భాషను చూడవచ్చు. రుగ్వేద సంహిత, 'భామతి' అనే శంకర భాష్యం, తత్వ చింతామణి వంటి అనేక తాళవత్ర గ్రంథాలు వివిధ భాషల్లో ఉన్నాయి.

ఈ విభాగంలో సుమారు 37,164 అరుదైన పుస్తకాలు ఉన్నాయి. వీటిలో రెండవ సర్ఫోజీ సంపాదించినవే.4,218 దాకా ఉన్నాయి. అవి ఫ్రెంచి, ఇంగ్లీషు, లాటిన్ భాషలకు చెందినవి. అపరిష్కృతంగా ఉన్న తాళ, కాగిత ప్రతులను కొన్నింటిని పరిష్కరించి అచ్చు వేయించటం జరిగింది. అలా అచ్చువేయించిన పుస్తకాలు సుమారు 1,254 దాకా ఉన్నాయి. ఇవి ముఖ్యంగా తెలుగు, తమిళం, సంస్కృతం, మరాఠీ భాషలకు చెందినవి. వీటిలోని విషయాలు మతం, తత్వం, భాష, వ్యాకరణం, నృత్యం, నాట్యం, సంగీతం, ఖగోళ శాస్త్రం, మంత్ర, శిల్ప శాస్త్రాలకు చెందినవి.

ఈ గ్రంథాలయాన్ని అన్ని శాస్త్ర రంగాలలో పరిపూర్ణం చేయడానికి సర్ఫోజీ చేసిన కృషి "విజ్ఞాన శాస్త్ర విభాగం"లో కనిపిస్తుంది.

గ్రంథాలయంతోపాటే అనుబంధంగా మ్యూజియంలాంటి ప్రదర్శనశాలను కూడా ఏర్పరచి, రెంటికీ మధ్య సరైన పొంతన కల్పించటంలో సర్ఫోజీ ప్రతిభ ప్రకటితమవుతుంది.



రాజభవనంలోని పంచలోహ నటరాజ విగ్రహాల ప్రదర్శనాలయం.



రాజకోటపై పదిలంగా ఉన్న 14వ శతాబ్దపు తిమింగిల అస్థిపంజరం.

ఇక్కడున్న సైన్సు, వైద్యం, వృక్షశాస్త్రం, పక్షి శాస్త్రం, అశ్వశాస్త్రం, గజశాస్త్రం తాలూకు తాళపత్ర గ్రంథాలు ఆనాటి శాస్త్రవేత్తలకు ఆయా రంగాలలో ఉన్న పరిశీలనా దృష్టిని, తార్కిక చింతనను తెలియపరుస్తాయి. అదేవిధంగా కంటి చికిత్సకు సంబంధించిన వైద్య, శస్త్ర చికిత్సల వివరాలు కంటి రోగుల వ్యాధి నివేదికలు ఈ మ్యూజియంలో భద్రంగా ఉన్నాయి.

వైద్య ప్రాధాన్యంకల రకరకాల మొక్కలను సేకరించడానికి వాటిపై ఆయుర్వేద, అలోపతి మిశ్రమ పరిశోధనలు చేయడానికి సర్ఫోజి ప్రత్యేకంగా "ధన్వంతరీమహల్" ఏర్పాటు చేశారు. ఇందులో దేశ, విదేశీ వైద్యులు కలసి పనిచేసి తయారుచేసిన కొన్ని మందుబిళ్ళలు ఇప్పటికీ భద్రంగా ఉన్నాయి. 'కనగ సుందరం', 'చింతామణి', 'రసభూపది', 'పంచామృత ఏర్పడి' అని ఆ బిళ్ళలపై ఓవైపు ముద్రించి, రెండవవైపు అవి తయారైన సంవత్సరాన్ని కూడా ముద్రించారు. అవి ఇప్పటికీ చెడిపోకుండా అంతే శక్తివంతంగా పనిచేస్తాయి. ఇందుకుగాను వాటికి 'కత్తు' అనే ప్రిసర్వేటివ్‌ను కలిపారని తెలుస్తోంది.

ఇవిగాక దేశ, విదేశాలనుంచి సేకరించిన వైద్య శాస్త్ర గ్రంథాలు, ఆనాటి మానవ కంకాళంపైన రాసిన ఎనాటమీ పుస్తకాలు ఈ మ్యూజియంలో దర్శనమిస్తాయి. జీవ స్వరూప శాస్త్రాన్ని అధ్యయనం చేసే ఛార్లెస్ విబ్రన్ అనే శాస్త్రవేత్త మనుములకు, జంతువులకు మధ్య ముఖ కవళికలలో ఉన్న పోలికలను రాళ్ళపై చిత్రించగా వాటిని సర్ఫోజి సేకరించి మ్యూజియంలో ప్రదర్శనకు ఉంచారు. ఆ కాలంలో జీవించిన పక్షులను రంగుల్లో యధాతథంగా చిత్రించి ఓ పుస్తకరూపంలో భద్రపరిచారు. పక్షులద్వారా విశ్వంలోని ఖగోళ చలనాన్ని తెలుసుకొనేందుకు వీలు కల్పించే ఓ పాకెట్ సైజు తాళపత్ర గ్రంథం కూడా ఈ గ్రంథాలయంలో ఉంది. దీనికి ఆధారం 'వేదవిజ్ఞానం'



అతిప్రాచీన బృహదీశ్వరాలయం

అని ఆ తాళపత్రం తెలుపుతోంది.

పరిశోధకుల సౌకర్యార్థం ఈ గ్రంథాలయంలోని తాళప్రతులను, కాగిత ప్రతులను మైక్రోఫిల్మ్ తీసేందుకు ఇక్కడ ఓ మైక్రోఫిల్ము యూనిట్‌కూడ ఉంది. ఇవిగాక అనేక అరుదైన కళాఖండాలలో ఈ సరస్వతీ మహలు సందర్శకుల హృదయాల్లో ఇట్టే హత్తుకుపోతుంది.

తంజావూర్‌లోని బృహదీశ్వరాలయం గోపుర నిర్మాణం ఆనాటి శాస్త్ర సాంకేతిక ప్రగతిని ప్రతిబింబిస్తుంది. ఆలయ గోపురంపైన ఏకశిలలో మలిచిన కుంభాకారపు శిఖరం ఉంది. 28 మీటర్ల విస్తీర్ణంకల కుదురుపై 15 మీ ఎత్తుండే ఈ శిఖరం బరువు 81.3 టన్నులు. దీనితో కలుపుకొని మొత్తం దేవాలయం ఎత్తు 65 మీటర్లు. దేవాలయంలో ఉన్న నందిని నల్లరాయిలో మలిచారు. ఆరు మీటర్ల పొడవు, రెండున్నర మీటర్ల వెడల్పు, నాలుగుమీటర్ల ఎత్తు ఉండే ఈ నంది భారతదేశంలోని రెండవ అతిపెద్ద నంది. శిల్పకళ విషయంలో బృహదీశ్వరాలయం కన్నుల విందు చేస్తుంది. అంతే గొప్ప శిల్పకళను రాజభవనంలోకూడా చూడవచ్చు. ఈ భవనంలో సర్ఫోజి నిలువెత్తు శిల్పం ఉంది. ఇక్కడి కుడ్యశిల్పకళ అద్భుతం. తంజావూరు కళా వైభవానికి అంతులేదు. అది అనుభవైక వేద్యమే. తప్పనిసరిగా చూసి తీరవలసిన దక్షిణాది పట్టణాలలో తంజావూరు ఒకటని మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు.

-గిరిజా నారాయణ్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 52685, Visakhapatnam 52211, Tirupati 5291.

# ఇంటా బయటా బహు రుచికరం!

ఎప్పుడైనా, ఎక్కడైనా... ప్రియ!

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి -
ఏ వేళప్పుడయినా సరే,
అల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్లుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్లతోనే భోజనం పరిపూర్ణం!

మీ పళ్లెంలో ప్రియ ఉంటేనే మీకు
సంతృప్తి సంతుష్టి!!

**ఎంతో రుచి... ఎంతో రుచి...**

# ప్రియ






మామిడి • నిమ్మ • గోంగూర
• అల్లం • టొమాటో • పండుమిరప
• పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్లన్నీ వెల్లుల్లితోనూ,
వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి

ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లి.
(ప్రియ ఫుడ్స్ డివిజ
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ,
హైదరాబాదు -500